# భారతి

మాసపత్రిక





సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



జనవరి 1970



సంపుటము : 47 : సంచిక : 1 :

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జనవరి 1970


| | | |
|---|---|---|
| జీర్ణదేవాలయంలో శివారాధన | శ్రీ ఉమాపతి బాలాంజనేయశర్మ | 1 |
| బౌద్ధవాస్తువు | శ్రీ టి. వి. జి. శాస్త్రి | 4 |
| ఆంధ్రప్రబంధములలో గ్రంథగ్రంథులు | శ్రీ కజ్జి సాంబమూర్తి శాస్త్రి | 12 |
| ఆర్తనాదం | శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి | 17 |
| ఓడలు - బస్సు | తమిళ మూలం: శ్రీ కా. నా. సుబ్రహ్మణ్యం; అనువాదం: శ్రీ బి. వి. సింగరాచార్య. | |
| | శ్రీ వి. సభాపతి | 19 |
| ప్రేమలేఖ | శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి | 34 |
| చలిమంట! | శ్రీ ఇలపావులూరి శేషగిరిరావు | 42 |
| కాటమరాజు కథాచక్రము | డా. తంగిరాల వెంకటసుబ్బారావు | 44 |
| తెనుగు నవల తెన్నులు | కుమారి జి. లలిత | 49 |
| పాంథుడు | శ్రీ గంధం జోయెల్ | 63 |
| శ్రీ కుటుంబరావు పద్నాలుగు కథలు | శ్రీ కె. ఇనాక్ | 65 |
| ఎవరు పసివాళ్లు? | శ్రీ వి. వి. యస్. రామదాసు | 73 |
| కలగూరగంప | | 79 |
| గ్రంథవిమర్శలు | | 82 |


---

## రు. 116 లు పారితోషికం

భారతిలో ప్రతినెలా ఒక పెద్దకథ వేయాలని సంకల్పం. ఆమోదింపబడిన పెద్దకథకు రు. 116 లు పారితోషికం. కథకులు ఈ కృషిలో సహకరిస్తారని ఆశిస్తున్నాము. — సంపాదకుడు.

# స్వవిషయము

"భారతి"కి 47 వ సంవత్సరము ఆరంభమైనది. నాలుగు దశాబ్దములు పైగా నిరాఘాటముగా సాహిత్యసేవ చేయగలిగినందుకు "భారతి" గర్విస్తున్నది. ఆనందిస్తున్నది. ఇక ముందుకూడా ఇతోధికముగా సాహిత్యసేవ చేయగలనను దృఢనిశ్చయముతోను, దృఢసంకల్పముతోను వున్నది. ఆ సంకల్ప సాధనకు రచయితల సహకారము పూర్తిగా లభించగలదని ఆశిస్తున్నది. సహకరించిన వారందరికీ కృతజ్ఞత తెలుపుతున్నది.

# జీర్ణ దేవాలయంలో శివారాధన

శ్రీ ఉమాపతి బాలాంజనేయ శర్మ

కేరళ రాష్ట్రంలోని అరణ్యంలో, నిర్జన ప్రాంతంలోగల, ఒక శిథిల దేవా
డగా, కలిగిన పవిత్ర మధుర భావంయే. ఈ కవితా ఖండికకు మాతృక.]

ఒక విపినాంతరమ్మున మహోన్నత పర్వతపాదమందు నం
దొక సెలయేటిచెంత కలదొక్కటి జీర్ణశివాలయమ్ము ఆ
సకల చరాచర ప్రకృతి శాసనకర్తకు రాదమేడలై
నికటచరత్కవి ప్రవరనిర్మలదృష్టివిలగ్నమానమై.

నలు కెలంకుల కొండలు, నడుమనొక్క
కొలను చద్దానిదరిని యూడలనుదన్ని
నిలచె వటవృక్షమొకటి యా నీడఁగలదు
ఆ ప్రశాంత సంశిథిల దేవాలయమ్ము.

శరదాశశాంకసుందరసాంద్రచంద్రికా
పూరమ్ములచట నుప్పొంగి పారల
నవవసంతోదయ నానావనీపుష్ప
వృక్షమ్ములచట క్రొవ్విరులు గుఱియ
శ్రావణకాలగర్జారవార్భటీనీల
మేఘమ్ము లచట కుంభిని నదల్ప
గ్రీష్మ మాధ్యందిన భీష్మాతపమ్మున
భానుడచ్చటి గిరుల్ బగుల మెఱయ

సకల ఋతువుల నవ్య సంచారములను
దీక్ష శాసించి జగముల రక్ష సేసి

ఏలుదొర మేడ యనగ జీర్ణాలయమ్ము
నిలచియున్నది హరునకు నిలయమౌచు.

ఎలమావి గున్నల చిగురుజొంపమ్ముల
    కలకంఠ కాకలీకలకలమ్ము
బలువైన బోదరిండ్ల కొలువుదీర్చిన రామ
    చిలుకగుంపులు సేయు కిలకిలార్పు
మలలపై చెట్టుకొమ్మల చిటారుల నూయ
    లల నూగు నడవిపక్షుల రవంబు
సెలయేటి యిసుకతిన్నెలపైం జెరలాడు
    గోరువంకల మంజుకూజితములు

ఉదయగిరిపైన యరుణరాగోదయావ
సరమునందున ప్రకృతిసుందరి హృదయము
విమల గంధర్వగానమై యమరి మొఱయ
నీశ్వరుని దేవళమ్ము ఘూర్ణిల్లుచుండు.

సెలయేటన్ వలగొన్న నీటి తరఁగల్ చిందించు నీరమ్ములన్
జలకాల్వోయును దేవదేవునకు ఝంఝామారుతమ్ముండు ని
ర్మలతీరమ్ములయందు ప్రాపుగొను సాంద్రప్రాంశుబిల్వద్రుమ
మ్ములు నెప్డున్ దళిరాకు జొంపములతో బూజించు నీశానునిన్.

వనసీమమ్మనున్న కొండకోనలన్ వర్ధిల్లు వృక్షాళి జా
ర్చిన గ్రొందావుల కొండగోగుపువులున్, చేమంతులున్ బంతు లె
ఱ్ఱని గన్నేరులు, కోవిదారములు, మారధ్వంసి శీర్షమ్మునన్
ఘనవాతాహతి వచ్చి రాలి యభిషేకమ్మొర్చు నెల్లప్పుడున్.

తావుల్ క్రేవల జల్లు పూవుపొదలన్ దారొక్కన్న పుష్పంధయా
రావమ్ముల్ మృదువేదఘోషలు దరీప్రాంతమ్ములన్ లోయలన్
తావుల్ గొన్న ఖగాళి కూజితములున్ దైవారు కైవారముల్
శైవాగారమునందునన్ ప్రకృతియోషాదేవి నిత్యార్చనల్.

## జీర్ణ దేవాలయంలో శివారాధన

చరమాద్రిన్ వినుకెంపు గ్రుంకుతరి లాక్షారాగరేఖల్ ధరా
ధర శృంగమ్ములనుండి జారుకొని ప్రస్థానించి యందందు సుం
దర దేవాలయభూమిభాగములపై దార్కొన్నచోన్ దోచు నా
హారు పాదార్చన కేగుదెంచునొకొ సంధ్యాదేవి యన్నట్లుగన్.

ఆ దేవాలయదూరదేశముల యందందందు గన్పట్టు నా
కేదారమ్ములు, శాద్వలమ్ములు, జనాకీర్ణమ్ములౌ పల్లియల్
పూదోటల్, కదళీవనమ్ము లటుపై భూభృద్దరీశృంగముల్
ప్రాదుర్భూతము సేయు డెందమున నవ్యక్తంపు మోదమ్ములన్.

---



# బౌద్ధవాస్తువు

## శ్రీ టి. వి. జి. శాస్త్రి

ఆగమములయందునూ, పురాణములయందునూ ప్రత్యేకముగా హిందూవాస్తువును గురించి యున్నట్లు, బౌద్ధవాస్తువునుగురించి ప్రత్యేక బౌద్ధ గ్రంథములు లేవు. అతిపురాతనమైన సుత్తపిటక, వినయపిటక, మహావంశ, దీపవంశాదికములగు బౌద్ధ గ్రంథములలో బౌద్ధవాస్తువునకు సంబంధించిన విశేషములను కొన్ని సేకరింపవచ్చును. బౌద్ధ చారిత్రక స్థలములు, ఎక్కువగా పుణ్యతీర్థముల యందునూ, నదీతీరములయందునూ, కొండ చరియల యందునూ యున్నట్లుగ పై గ్రంథముల యందు ఉదహరింపబడియున్నది.[1] జాతక కథల యందు, చారిత్రకస్థలములకు దారులు అరణ్యముల మధ్య నుండియూ, తటాకములప్రక్కనుండియూ, పంటపొలములనుండియూ యుండెనని జాతకకథల వలన తెలియుచున్నది.

మగధలోని 'గిరివ్రజ'పు కోట పరిధి ఒక అరమైలు వెడల్పున యుండెడిదని, అది 'మహాగోవిందు'డను శిల్పిచే కట్టబడినదని 'విమానవత్థు'నుండి తెలుసుకొనవచ్చును. ఇటులనే 'అయోజ్ఝ', బరాణసి, కపిల, కోసాంబి, వేసాలి మొదలగువానినిగురించి వ్రాయబడియున్నది.[2] తరువాత వచ్చిన బౌద్ధగ్రంథములనుండి, పల్లెలు, పట్టణములు, వానిలోని కట్టడములు మొదలగువానినుండి కొన్నివాస్తువిశేషములు బయటబడుచున్నవి.

'ఖుల్లవగ్గ'[3]యను గ్రంథమునందు బుద్ధుడు ఐదురకములగు బౌద్ధగృహములను వర్ణించినట్లుగ యున్నది. అవి విహారము, అర్ధయోగము, పాసాదము, హార్మ్యము, గుహ అనునవి

**విహారములు :** అవి బౌద్ధులు విహరించుశాలలు. స్తూపము మొదలగు కట్టడములు గలిగినవి.

**అర్ధయోగము :** దీని అర్థము ననుసరించి రెండు అర్థభాగములు కలుపునదియని తెలియుచున్నది. ఇప్పటికినీ రెండు అర్థగృహములను కలుపు ఇండ్లను కొన్ని పల్లెటూళ్లలో చూడవచ్చును. బుద్ధఘోషుడు అర్ధయోగ మనగా 'సువర్ణవంగగేహ'మని వ్యాఖ్యానించియుండెను. అందువలన ఇదియొక బంగారువర్ణము కలిగిన భవనమని అర్థమగుచున్నది.[4]

**ప్రాసాదము:** 'బుద్ధఘోషుడు' ఇది దీర్ఘభవనమని చెప్పెను. కాని రైస్ డేవిడ్స్[5] మొదలగువారు మేడవలెనుండు భవనమని యూహించుచున్నారు. 'మోనీర్ విలియమ్స్' బౌద్ధమతమునందు చేరుటకు గుమిగూడు యొక భవనమని చెప్పెను.

**హర్మ్యము :** ప్రాసాదమునందు ఒకటిగాని, కొన్ని గదులుగాని వసతిగల భవనము. వీనిని

1. Rhys Davids: Buddhist India, P. 42.
2. Viman Uattu. Commentary P. 82; Digha Nikaya XIX. 36.
3. 6.17.1: మరియు మహావగ్గ. 1.30.4.
4. Indian Culture April 1935, p. 717.
5. Vinaya Texts (Translation) P 173.




గురించి శిల్పశాస్త్రములయందును, సంస్కృత కావ్యములయందును తెలుసుకొనవచ్చును.

**గుహ :** భూగర్భమున నుండు ఒక శిలాగృహము. ఉమ్మగ్గ జాతకమునందు[6] బౌద్ధగుహను గురించి విపులముగా వర్ణింపబడియున్నది.

పురాతత్వ పరిశోధనలలో అనేక బౌద్ధ అవశేషములు బయటబడుచున్నవి. వీనియందు విహారములు, ఆరామములు, సంఘారామములు, ప్రాసాదములు, చైత్యగృహములు, స్తూపములు మున్నగునవి యెన్నియో కలవు. వీనిలో ముఖ్యమైనది స్తూపము. ఈ కట్టడము బుద్ధజననమునకు పూర్వమే యున్నట్లు చెప్పుటకు ఆధారములున్నవి.[7] 'స్తు' అను సంస్కృతధాతువును పురస్కరించుకొని, ముఖ్యమైన కొన్ని అవశేషములను ఒకచోట యుంచి వానిమీద కట్టెడు నిర్మాణములకు స్తూపములని పేరు.[8] అటులనే 'చితి' అను పదమును పురస్కరించుకొని అవశేషసముదాయముల నొకచోట యుంచి కట్టెడు నిర్మాణములకు 'చైత్యము'లని పేరు. ఇందువలన చైత్యములు, స్తూపములు అర్థమునుబట్టి చూచిన ఒక్కటేయని తెలియుచున్నది. అమరావతి స్తూపమునందు 'ఉష్ణీష'యను రాయి 'సిముద'యను వానిచే నెలకొల్పబడినట్లు 'హిత సుఖ థధ్య భగవతో మహాచేతియస ఉష్ణీషస' అను శాసనమువల్ల తెలియుచున్నది[9]. దీనినిబట్టి మహాస్తూపము, మహాచైత్యము ఒకటియని తెలుచున్నవి. ఇదియునుగాక అమరావతియందు కనిపించు 'మహాచైత్యము' గుండ్రముగానుండి చుట్టునూ రాతిఫలకములతో అమర్చియున్నట్లుగ అక్కడనున్న అవశేషములవలన తేలుచున్నది.

స్తూపమనునది బుద్ధునికి పూర్వమునుండీ వచ్చుచున్న కట్టడముగనుక దీని నిర్మాణములోని ఉద్దేశమేమియో తెలిసికొనుట అవసరము. 'లాంగ్‌హర్స్టు' అన్నదొర స్తూపమనునది చనిపోయిన వాని ఆత్మను భద్రపరచుటకు వినియోగింపబడు భూగృహమని, చనిపోయినవాని అవశేషములను దీనియందుంచి, తిరిగి పైకివచ్చి బ్రతికియున్నవారిని బాధపెట్టకుండనుండుటకు పెద్ద పెద్ద బండలతో కప్పెడివారని, అవశేషములనుబట్టి చెప్పవచ్చునని

---

6 Page 430 (Jataka Tales.)

7. Annual Report of the Archaeological Survey of India, 1906-07. P. 110.

8. పటము 1 చూడుడు. దీనిలోనున్న పటములన్నియూ శ్రీయుతులు ఎం. రామిరెడ్డి, బషీర్‌ఖానులచే గీయబడినవి.

వ్రాసెను.[10] ఈ రాతిబండల సమాధులను (Megaliths) యిప్పటికీ మనము చూడవచ్చును.[11]. వీనినే కొన్నిచోట్ల 'రాక్షసిగుళ్ళు' అనికూడ పిల్చెదరు. ఇందువలన ఈ రాక్షసిగుళ్ళు, సమాధులు, బౌద్ధ స్తూపపు కట్టడములకు ఆధారములని చెప్పవలెను

కాలాంతరమున స్తూపములను మూడు రకములుగా విభజనచేసిరి (1) శారీరకము (2) పారిభోగికము (3) ఉద్దేశికము 12

**శారీరక స్తూపములు :** వీనికి 'ధగోబ' లేక ధాతు 'గర్భ'యను నామము గలదు బుద్ధుని శరీరమునకు సంబంధించిన అవశేషములను ఉంచి కట్టినవానికి శారీరకస్తూపములని పేరు. బుద్ధుడు మహాసంబోధి పొందిన కాలమున త్రపుష, భల్లిక నగరశ్రేష్ఠులకు ఆయన తన వెంట్రుకలు, గోళ్ళు యిచ్చెను.[13] వీనిమీద వారు స్తూపములను కట్టిరి. తిరిగి బుద్ధుని పరినిర్వాణానంతరము, బుద్ధ శారీరావశేషములను ఎనిమిది భాగములుగ విభజించి స్తూపములను కట్టిరి. తర్వాత అశోకునికాలమున వీనిలోని ఏడు స్తూపములు త్రవ్వి వానిని 8,400 భాగములు చేసి, ఒక్కొక్కభాగముమీద ఒక్కొక స్తూపమును కట్టిరి.[14]

**పారిభోగిక స్తూపములు :** ఇవి బుద్ధునిచే ఉపయోగింపబడిన వస్తువులమీద నిర్మించిన కట్టడములు. సుజాతయను ఒక శ్రేష్ఠి యొక్క కుమార్తె బుద్ధుడు సంబోధి పొందిననాడు, ఒక గిన్నెయందు పాయసము నివ్వగా, బుద్ధుడా పాయసమును భక్షించి, ఆ గిన్నెను ప్రక్కనున్న నిరంజరానదిలో విసరివైచెను. నాగులు, దేవతలు దానిని పట్టుకొని దానిమీద యొక స్తూపమును కట్టిరి. ఇటులనే బుద్ధుడుపయోగించిన సింహాసనమునకు బౌద్ధభిక్షువులు ప్రణమిల్లుచున్నట్లుగ చిన్న స్తూపఫలకములు గలవు. ఇవియును పారిభోగిక[15] స్తూపఫలకములే.

**ఉద్దేశిక స్తూపములు :** వీనియందు బుద్ధుని అవశేషములుగాని, బుద్ధుడు ఉపయోగించిన సామగ్రిగాని యుండదు. ఇది కేవలము బుద్ధుని పరినిర్వాణసూచక చిహ్నములు. చైనా యాత్రికుడు 'హ్యూయన్‌సాంగ్' హిందూదేశమునందు అనేకవేల ఉద్దేశిక స్తూపములను చూచినట్లు వ్రాసుకున్నాడు.[16] అశోకుడు బుద్ధుని జ్ఞాపకార్థము లుంబినీ వనమునం దొక ఉద్దేశికస్తూపమును కట్టించెను[17].

బౌద్ధస్తూపనిర్మాణ విశేషములు కొన్ని 'మహావంశ'మను సింహళ బౌద్ధగ్రంథమునందు కలవు.[18] సింహళములోని మహాస్తూప నిర్మాణమును కొన్ని వేలమంది బౌద్ధభిక్షువుల సమక్షమున రాజా 'దుత్తగామణి' ఒక్క బయలునందు గుండ్రముగా గీటుగీసి

---

9. Luders List No. 1281.

10. Longhurst : Story of the—Stupa, P. 8.

11. ఇవి దక్షిణహిందూదేశమునందు వింధ్య పర్వతమునుండి కన్యాకుమారి వరకును అనేక గ్రామములలో కనిపించును.

12. Sivaramamurti, C : Amaravati, Sculptures, P. 20.

13. Mitra — Rajendralal : Sanskrit Buddhist Literature from Nepal, P. 340.

14. Vogel : Indian Serpant Lore and Nagas in Hindu Legend and Art, P. 127.

15. Sivaramamurthi Ibid, P. 21.

16. Travels of Huen Thsang-Vol. II. P. 146.

17. Vogel Ibid, P. 95.

18. Geiger-W. Mahavamsa P.191-209.

పునాదులు వేసెను. దీనియందు ముఖ్యముగా మూడు భాగములు గలవు.[19] (1) అండాకారముగనుండు కట్టడము. ఇది కొంతవరకు నూతిగోడవలెకట్టి పైన అండాకారముగ చేయుదురు. (2) అండ భాగము దీనిపైన 'హార్మిక' లేక 'టీ' (బర్మాలో నుండు స్తూపములలో నుండును) యను ఒక పెట్టెవలె ఇటుకలతో అమర్చిన కట్టడము. దీనిపైన (3) మూడి లేక 'ఛత్ర' (ఛత్రావళి) యను గొడుగులవరుస యుండును[20].

'లాంగ్‌హర్స్టు' దొర స్తూపములు మొట్ట మొదలు ఎలా ఉండెనో 'The Story of the Stupa' అను వ్యాసమువందు వర్ణించెను[21]. దానిని బట్టి స్తూప మనునది బోర్లించిన కప్పువలెనుండి దానిచుట్టునూ శిలాప్రాకారమొకటి యుండును. (Rail). కప్పు క్రిందభాగము గుండ్రటి నూతిగోడ వలె నుండును. బుద్ధుని పరినిర్వాణానంతరము ప్రప్రథమముగా కట్టిన స్తూపములు చిన్నవిగా నుండుటవలన వానిని పూలతో అలంకరించుటకు అక్కడక్కడ కొయ్యలుండెడివి.[22] ఈ చుట్టును నుండు కొయ్యలనే తర్వాత సున్నము మొదలగు వానితో తోరణములుగా మార్చిరి. ఈ గుండ్రటి

రేఖాచిత్రము-2




1 ప్రదక్షిణపథము
2 అండము
3 హార్మికము
4 ఛత్రావళి

రేఖాచిత్రము-3



స్తూపములకు చుట్టునూ మొదట చెక్కతోకట్టిన ప్రాకారము లుండెడివి. తర్వాత శిలా ప్రాకారములుగ జేసిరి. ఈ ప్రాకారములయందు ఆకులు, పువ్వులు, కాయలు, మొదలగునవి అందముగా చెక్కెడివారు. ప్రాకారమునకు నాలుగువైపులా నాలుగుదిక్కులను సూచించు తోరణములతోగూడిన ద్వారములు నిల్పిరి.

పురాతత్వ అవశేషములయందు ముఖ్యముగా నేపాల్‌లోనున్న 'పిప్రహ్వా' స్తూపము మన కిప్పుడు కనిపించువానిలో అన్నిటికన్న మొట్టమొదటిది. దీని ఎత్తు 22 అడుగులు. వ్యాసము 116 అడుగులు. 200 ఏళ్ళతర్వాత కట్టిన సాంచి స్తూపము ఎత్తు 54 అ; వ్యాసము 120 అడుగులు.[23]

---

19. Mahavamsa, పేజీ 219. f చూడుడు
20. రేఖాచిత్రం 2. చూడుడు.
21. Longhurst Ibid, P. 29.
22. దీనికే మహావంశమునందు 'పుష్పాదాన' అని వ్రాసియున్నది. రేఖాచిత్రం 3.
23. శివరామమూర్తి. చూడుడు, P. 23.

స్తూపము అండముపైనుండు 'హార్మికము' నందు బుద్ధుని అవశేషములను భద్రపరచినట్లుగ 'మహావంశము'నందు ఉన్నది.[24] కాని హిందూ దేశములో స్తూపపు పునాదులయందు ఉంచినట్లుగ పురాతత్వ పరిశోధనలవలన తెలియుచున్నది. హార్మికము పైన ఛత్రావళి యుండియుండవలెనని యూహింపవచ్చును. దీనికి తార్కాణముగా కొన్ని స్తూపఫలకములయందు స్తూపముల నమూనాలు గలవు. ఇవియునుగాక కొన్నిశాసనములయందు ఛత్రావళి మొదలగు భాగములు కొంతమంది శ్రేష్ఠులచే నెలకొల్పబడినట్లుగ నున్నది. ఛత్రావళియనగా గొడుగులవలెనుండు కట్టడములు. సింహళ మహాస్తూపమునందు 'ఛత్రావళి' ఒక బోధివృక్షమువలె నుండెనని, దాని మ్రాను వెండితోను, ఆకులు మొదలగునవి మణులతోను తయారుజేయబడినట్లుగ 'మహావంశము'నందు వ్రాయబడియున్నది.[25]

ఆంధ్రదేశమునందుండు బౌద్ధస్తూపములకు ఒక విశేషము కలదు. స్తూపములకు చుట్టునూ నాలుగు దిక్కులను సూచించు ప్రదేశములయందు దీర్ఘచతురస్రాకారములో నాలుగు ఆయకట్టులు (Extensions) గలవు. వీనికి 'ఆయకవేదిక'లని పేరు. వీనిపైన ఐదు స్తంభములను నెలకొల్పెడివారు. వీనికి 'ఆయకకంభ' (స్తంభము)లనిపేరు. కొన్నిస్తూపములయందు బుద్ధుని అవశేషములు ఈ స్తంభముల క్రింద దొరికినవి.

స్తూప అండము ఇటుకలతోనూ, సున్నము తోనూ కట్టెడివారు. తర్వాత పెద్ద పెద్ద రాతిబండలను చెక్కి 'అండము'చుట్టునూ 'హార్మికము' నకునూ అతికెడువారు. ఈ రాతిబండలయందు అనేకములైన జాతకకథలు, స్తూపముల నమూనాలు, పూవులు, చెట్లు, చేపలు, త్రిరత్నచిహ్నములు, శాక్యసింహములు, ఏనుగులు, గుఱ్ఱములు, మొదలగునవి చెక్కెడివారు. ఈ బండలయందు ఆనాటి స్తూపములుండు రీతిని సంఘములోని ఆచారములు కంటికి కట్టినట్లుగ బొమ్మలతో నుండుట వలన, గ్రంథములలో నుండువాటికన్న ఎన్నో విషయములను తెలుసుకొనుచున్నాము.[26] స్తూపముపైన ఈ రాతిబండల తొడుగు ఉండుటవలన అండము నందుండు ఒంపులకు అనుగుణముగ రాతిఫలకములూ, బల్లపరుపుగనుండు రాతిబండలూ గలవు.

స్తూపముచుట్టునూ ప్రదక్షిణమునకు కొంత దారి వదలి, దారు, లేక శిలాప్రాకారములను నిర్మించెడివారు. ఈ ప్రాకారముల చుట్టునూ స్తంభములను ప్రతి 'మసూరక' (Lenticular) రూపము వలెనుండు కంతలను స్తంభములయందు తొలిచి కంతలకు అనుగుణముగా 'సూచీఫలక'మను మరికొన్ని రాతిచక్కలను తయారుచేసి స్తంభములను కలిపెడివారు. స్తంభములను కలుపుచూ పైన ఉష్ణీషమను రాతిబండలునేసి బిగించెడువారు

ఇటులనే తోరణములను చెక్కతోగాని, రాతితో గాని తయారుచేసెడివారు. ద్వారమున రెండు ఎత్తైన స్తంభములను నాటి 'ద్వారోపరి సవారు'లను (Lintel) రెండుగాని, మూడుగాని కలుపుచూ ఒక ఆకృతిని (Frame) తయారుచేసి, వానిమీద స్థాపించెడివారు ఇట్లు తోరణములతోనూ, ప్రాకారములతోనూ, రాతితొడుగులతోనూ అలంకరింపబడిన స్తూపములు ఎంతో రమణీయముగ నుండెడివి. ఆనాటి స్తూపముల శోభను ఇప్పటికినీ 'సాంచి'లో చూడవచ్చును.

తోరణములయందు ప్రాకారములయందుకూడ అనేకరకములైన బౌద్ధకథలు, యక్షులు, గంధర్వులు, కిన్నరలు మొదలగువారి బొమ్మలతోనూ, వృక్షములు, మృగములు, పక్షులు మొదలగువానితోనూ అలంక

24. మహావంశ. పే. 219.

25. Mahavamsa, P. 203

26. నాగార్జునకొండ స్తూపములయందు ఈ రాతిఫలకములు బయటబడెను.

## రేఖాచిత్రము-4





పెద్దవిహారము

రించెడివారు. ఈహామృగములు, మకరములు, గజ వ్రక్త్రఝషములు[27] మొదలగు వింత జంతువులను కూడ చూడవచ్చును.

బౌద్ధ నిర్మాణములలో ముఖ్యమైనవి విహారములు. ఇవి నివాసములుగాని, దేవగృహములుగాని, విద్యాపీఠములుగాని, కావచ్చునని, 'మహావంశము'నం దున్నది[28]. వీనికే సంఘారామములని, ఆరామములని, పర్యాయపదములు కూడ కలవు. 'అరిగోవ్' శాసనమునందు 'ప్రాగ్ గంగేశ్వర

---

27. ఏనుగుతల చేపతోకవలెనుండు జంతువు.

28. ఇది 'తుషిత' స్వర్గమునకు ద్వారము అను ప్రకరణమునందు వ్రాయబడియున్నది.

సన్నిభే...చక్రే దారు మయం; విహారం అమలం త్రిలోకనాథాస్పదం.'[29] అని వ్రాసియున్నది. దీనిని బట్టి దేవాలయము దానికి సంబంధించిన కట్టడములు కూడ విహారములను పేరుతో వ్యవహరింప బడుచుండెడివని చెప్పవచ్చును.

నాగార్జునకొండ, నలందా మొదలగుచోట్ల అనేకములైన విహారములు పురాతత్వశాఖవారి త్రవ్వకములలో బయటబడెను వీనివిబట్టి విహారములయందు స్తూపము ముఖ్యముగా నుండునని తేలుచున్నది.[30] ప్రతిబౌద్ధవిహారమునందును ముఖ్యముగా నుండునది స్తూపము. రేఖాచిత్రమునందు (అ) భాగము చూడుడు. దీని నమూనా బండిచక్రమువలె నుండును, ఇరుసు కొన్ని స్తూపములయందు గుండ్రముగా నుండును. కొన్నిటియందు చతురస్రాకారములో నుండును. ఇరుసునకు చుట్టునూ స్తూప నిర్మాణమునకు పై నిర్మాణమును గట్టిగ జేయుటకు ఆకులు (Spokes) గలవు. కొన్నిస్తూపముల యందు నమూనా 'స్వస్తిక' ఆకారములోగాని గుండ్రముగానుండు వేదికలు ఒకదానిలో మరొకటి గాని యుండును.

రేఖాచిత్రమునందు అనేకభాగములు గలవు. చుట్టునూ వెడల్పుగ నల్లగీతతో నుండునది ప్రాకారము. ఈ ప్రాకారములో పై నుదాహరించిన

రేఖా చిత్రము-5



లయనము

స్తూపమునకు ఎదురుగనుండు ఒక ద్వారము లోపలికిపోవుటకు సోపానమూ గలవు. లోపల మనకు కనిపించునవి గజపృష్ఠాకృతిలోనుండు (ఆ, ఆ) చైత్యగృహములు. మామూలుగ ఒకదానియందు స్తూపముండును. మరొకదానియందు స్తూప ముండదు. వీనిని వంపులకు దగ్గరగా చూడవచ్చును. వీనియందు పైకప్పు మూసికొనియుండి ఒకే ద్వారము గలిగియుండును. చైత్యగృహములకు వెనుక దీర్ఘచతురస్రాకృతిలో, ప్రాకారములోపల మూడు వైపులా, చిన్నచిన్న గదులగనుండు కట్టడములు గలవు. ఈ గదులకుముందు ఒక ఆలిందము (Verandah) కలదు ఇవి బౌద్ధభిక్షువులుండు గదులు. 'ఈ' యనునది విహారమునకు మధ్యనుండు దొడ్డి. ఇది భిక్షువులు సమావేశమగుటకును, మత చర్చలు మొదలగువానికిని, వినియోగపడు స్థలము.

పై నుదాహరించిన స్తూపములు, విహారములు బయలులో నుండునవి. ఇవియునుగాక బౌద్ధులు కొండచరియలయందు కూడ స్తూపములు, విహారములు నిర్మించిరి. వీనికి 'లయన'ములని పేరు గలదు.[31] వీనిని కొండ చరియలయందు సురంగము వలె చేసెడివారు. వానిలోపల ఒక చివర గజపృష్ఠాకృతి వచ్చునట్లుగ తొలిచి దగ్గరగా ఆ రాతిలోనే చిన్న స్తూపాకృతులు వచ్చునట్లు చేసెడివారు. పార్శ్వములయందు రెండు వరుసలలో స్తంభములుండి వానిపైని కూర్మమునకు పైభాగమువలె ఉబ్బెత్తుగ వంపుగల కప్పును చెక్కెడివారు. 'లయనము' లోపలి భాగమునందు స్తంభములమీదనుండు కప్పు సన్నటి చెక్కదూలములతో రేఖాంకిత (Ribbed) నిర్మాణమువలె కన్పించును. దీనినిబట్టి ఈ 'లయనము'లు మొట్టమొదట దారుమయమై యుండెడివని తెలు

29. దీనినిబట్టి మొట్టమొదట విహారములు దారుమయమని తెలియుచున్నది.

30. రేఖాచిత్రం 4. ఇది నాగార్జునకొండలో బయటపడ్డ పెద్ద విహారము.

31. రేఖా చిత్రము 5. చూడుడు

చున్నది. ఈ 'లయన' ప్రవేశద్వారములు ఆనాటి అత్యున్నత కళావిశేషములను తెలియజేయును. ప్రవేశ ద్వారమునకు పైన గుఱ్ఱపునాడా ఆకృతిలో వాతాయనములు గలవు. బౌద్ధులకు 'పిప్పలి' (రావి) ఎంతో పవిత్రము గనుక 'పిప్పలి' పత్రాగ్ర ఆకారము గలిగి యుండవలెనను యుద్దేశ్యముతో అట్లు చేసి యుండవచ్చును. ఈ వాతాయనమున కిరుప్రక్కలా 'కూడు' (గూడులు)గాని, చిన్నచిన్న గవాక్షములు గాని యుండును. వీనినుండి సూర్యకాంతి లోపలికి పోయి 'లయన' గర్భమునయందున్న చీకటిని పోగొట్టును. ఇవి లేనిచో ఈ లయనములు అంధకార నిబిడీకృతమై యుండెడివి.

మౌర్యులకాలములో తొలిచిన లయనములకు ముందు ఎత్తైన ధ్వజస్తంభమువలెనుండి వాటి మీద 'సింహధర్మచక్ర'పు నమూనాలు ఉండును ఇటువంటి గుహాలయమును పశ్చిమ కనుమలలోనున్న 'కార్లా'యనుచోట చూడవచ్చును.

లయనములకు 'ప్రతోలి'యను ప్రవేశ ద్వారము కలదు. స్తంభములు పూర్ణఘటముల నుండి పైకివచ్చునట్లుగ చెక్కెడివారు. స్తంభకాండము కోణములుదేలి (Fluted) యుండును. కొన్నిస్తంభములయందు 'పాలిక', 'హార', 'పట్టిక', 'లత' మొదలగు నగిషీలుండును. లయనము గోడలను పైకప్పునూ కలుపుచూ 'కపోత', 'ప్రస్తర', 'వితానము'లు గలవు. ప్రవేశద్వారపుగోడయందు కూడు, గవాక్ష వాతాయనములు ఉండును. ఈ భాగములన్నియు, విహారప్రాసాదములకుగూడ కలవు.

సమగ్రముగా బౌద్ధవాస్తువిశేషములను తెలుపు గ్రంథములు చాల అరుదు. కాని పైనుదాహరించిన, స్తూపవిహారములయందుండు విశేషములను గ్రహించి, వానికి గ్రంథస్థమైయున్నవానిం మిళితముజేసి, 'ఆగమ'గ్రంథములు తయారుజేసి యుందురు. ఇవే తరువాత వచ్చిన హిందూదేవాలయ వాస్తు మొదలగువానికి ఆధారములయ్యెను.



# ఆంధ్రప్రబంధములలో గ్రంథగ్రంథులు

## శ్రీ కట్టి సాంబమూర్తి శాస్త్రి

శ్రీ పరమేశ్వర కటాక్షమున ఆంధ్రప్రబంధములు ముద్రితావస్థనందుట క్రీ. శ. 1835 ప్రాంతమున నారంభమైనది. నేటికి నూటముప్పది వత్సరములు కడచినవి. ఎక్కడెక్కడనో గృహస్థుల యిండ్ల పూజాపీఠములందును అటకలపైనను అజ్ఞాతవాసము చేయుచున్న అనేక గ్రంథములు లోకవ్యాప్తి నందినవి. నాడుమొదలు నేటివరకు ననేకులు సుప్రసిద్ధ పండితులచే తాళపత్రగ్రంథములను బరిష్కరింపించియున్నారు. ఇటీవల తెల్లనిగ్లేజు కాగితము, చక్కని అక్షరములు, ముచ్చటనిచ్చునట్టు గుండె లవియజేయు ధరలతోడను మోదశేములను గల్గించుచున్నవి. ఇంతకాలమైనను అసలు గ్రంథమునందు అనేక గ్రంథులు దుర్భేద్యముగానుండి గ్రంథమునకు న్యూనత గల్పించుచున్నవి. ఇప్పుడాంధ్రభాషాభిమానము, ఆంధ్రభాషా పాండిత్యము, విమర్శన దక్షత గల పండితప్రవరు లనేకులున్నను వాని విషయమును దడవ కుపేక్షించుట దురదృష్టము. సుమారు 50 ఏండ్లనుండియు భాషాసేవ సేయుచు నేడశీతి ప్రాయముననున్న నాకది దుఃఖాకరమై యథాశక్తి సంస్కరణములు భారతీముఖమున దెలిపినచో మున్ముందు ముద్రణములందైన దొసఁగులు పొసఁగకుండునను నాసచే నిట దిఙ్మాత్రసూచనములు గావించుచున్నాను.

### 'పల్లక'

ఆంధ్రమహాభారతోద్యోగపర్వమున ధర్మజుఁడు శ్రీకృష్ణుని కౌరవసభకు రాయబారిగా బంపు సందర్భమున నతనితో జెప్పినది.

పగయడగించు టెంతయు శుభం బది
లెస్స యడఁగునే పగం
బగ పగగొన్న మాన్కానక పల్కక
యుండగవచ్చునే కడుం
దెగ మొదలెత్తి పోవఁ బగ దీర్పఁ
గడంగిన నాశమందు నే
మి గతి దలంచినం బగకు మేలివి
లేమి ధ్రువంబు కేశవా.

తాత్పర్యము: – కేశవా! పగయణచివేయుటెంతో శుభము. పగచేతనే పగ లెస్సగా నడఁగునా? దెబ్బకు దెబ్బతీసిన నా పెనుగులాట పెరుగునేకాని తరుగదు.

విసివి తెగించి మరల నెన్నడును దలయెత్తకుండ విరోధముచేతనే వైరము శాంతింపజేయ దలంచిన మూలచ్ఛేదము సర్వనాశము తప్పదు. కాబట్టి యే విధముగా జూచినను విరోధమునందు మేలు లేదనుట నిక్కము

ఈ పద్యము రెండవ పాదమున 'బగగొన్న మాన్కానక పల్కకయుండగవచ్చునే' యని కలదు. పగగొన్నవారు కలహమునకు దిగుట సహజమే. కాని పల్కకయుండలేదనుట వింతగా నున్నది. ఏమి పల్కుట? బాహుబలము లేకున్నను వాగ్బలమున శక్తి యున్నంతవఱకు కొట్టుటా? దీవించుటా? పల్కక అను పదమునకు వేఱుగ మఱియొక అర్థమేదయిన గలదా? పల్కక యనుటానికి మౌనమను నర్థముగదా? తూష్ణీంభావము గూడ గావచ్చును. తూష్ణీంభావమున నిర్వ్యాపారము. ఆ తూష్ణీంభావమే యిక్కడం బొసగును. ఇన్ని బాధలు పడుటకు పరిష్కర్తలు మూలము విచారింపక నిర్లక్ష్యముగా గూర్చిన పల్కకదా కారణము. అసలు ఆ పదము పల్కకకాదు; పల్లక. పల్లక యన దూష్ణీంభావము,

నిష్క్రియత్వము — రెండు గూడ వర్ణములు. పల్లక పదము దేశ్యము. ఆవాడు వ్యవహారములోనుండి యీనాటికి విరళప్రయోగమైనది. శ్రీకాకుళము, గంజాము మండలములం దీనాడును బహుళ వ్యవహారమున నున్నది. శ్రీశ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారొక సభలో నిశ్శబ్దము చేయుటకు 'పల్లకొండి పల్లకొండి' యని హెచ్చరించిరి. పల్లక, నిశ్శబ్దముగా, నిష్క్రియముగా నని యర్థము కాదా?

### 'కలకలప్యాది'

నన్నెచోడ మహాకవి కుమారసంభవమున హిమగిరిపై దపమున కరుదెంచిన శంకరు నర్చించి పార్వతిని పరిచారమునకు నియోగింపవెడలు సందర్భమున 'కలకలప్యాది సమస్తవస్తువులం గూర్చికొని' యని కలదు. ఆ పదమున కర్థమేమియో యిప్పటికిని దేలలేదు. అబద్ధమున కర్థముండదు కదా? అసలక్కడనున్నది; 'కలప్యాది' కాదు కలపాది; కలపమన సువాసనద్రవ్యమిళితమగు చందనము. ఇది సుప్రసిద్ధమైన దేశ్యపదము. అయినచో నీ మిశ్రసమాసము దుష్టమగును కాకుండు. అర్థరహితపదముకంటె సంగ్రహమగు దుస్సమాసము మేలేకదా? నన్నెచోడుడే కాక యింకను గొందఱు శివకవు లిట్టి ప్రయోగములు గావించినారు. నన్నెచోడుడే 'నిగుర్వణ జృంభణంబులన్' అని ప్రయోగించుట దానికై దుష్టమని కీ. శే. వడకుదుటి వీరరాజుగారును, సాధువేయని శ్రీ వత్సవాయి నీలాద్రిరాజుగారును హోరాహోరిగ బోరాడుటయు ఆ యింకటము నన్నును జొప్పించుటయు పండితు లింకను మఱచియుండరు. కాబట్టి కలపాదికాని కలప్యాదికాదని మనవి.

వరుసలో తరువాత రావలసినవి, శ్రీనాథకృతులైనను నవి బహుళములు బహువిషయకము లగుటచే వానికి ముందితరములు చూపుచున్నాను.

### ప్రేంఖన్నభోవాహినీ

పెద్దనార్యుని మనుచరిత్రమున వరూథిని ప్రవరునకు దన ప్రాభవ మెఱిగించుపట్టున.

బహురత్నద్యుతిమేదురోదరదరీ
భాగంబులం బొల్చు ని
మ్మిహికాహార్యమునం జరింతు మెపుడుం
బ్రేమన్నభోవాహినీ
లహరీశీతలగంధవాహపరిఖే
లన్మంజులత్ సౌరభ
గ్రహణేందిందిరతుందిలంబు లగు తత్
త్కాంతారసంతానముల్.

ఈ పద్యము ఇక్ష్వాకులనాటినుండి యిప్పటివఱకు నిట్లే ముద్రింపబడుచున్నది. ఇందు రెండవ పాదమునగల ప్రేమము ఎవరిపైని? మిహికాహార్యము నెడలనా? లేక కాంతారసంతానముల యెడలనా? ప్రేమమన నర్థమేమి? అనురాగము. కామము మొదలగు చిత్తవ్యాపారముగదా! ఆ పదము సాధారణము మనుజులందును నితర సచేతనములందునే ప్రయోగింపబడుట చూచుచున్నాము. కాని అచేతనములను గమించుట ప్రేమించుట పాశ్చాత్యసంప్రదాయమగునేమో కాని మన సంప్రదాయముగాదు. అక్కడ నెవ్వరిని ప్రేమింపనులేదు. అక్కడ నుండదగునది ప్రేమమును గాదు. కవిప్రయుక్తము ప్రేంఖత్ అను పదము. నభోవాహినీలహరులకు విశేషణము. ప్రేంఖణము జలప్రవాహములకు సహజమగుట కెవ్వరు నాక్షేపింపరుకదా? కాబట్టి ప్రేంఖత్పదము కవిప్రయుక్తము. ప్రేమపదము ప్రతిలేఖకుల ప్రమాదమనియు దానిని బరిష్కర్తలు. వ్యాఖ్యాతలు గుర్తింపకుండుట దైవదోషమనియు నెఱుంగునది.

### పల్కులొండొంటికి

భట్టుమూర్తి :— కావ్యాలంకారసంగ్రహకృత్యాది పద్యమునందు నాయకప్రాధాన్యము తెలుపు సందర్భమున.

రామాయణాదిక గ్రంథంబు లనవద్య
నేతృవర్ణనల వన్నియకు నెక్కె

పల్కులాండాంటికి బ్రామిన్కులును బర
బ్రహ్మ గోచరములై బ్రణుతికెక్క

అని కలదు. ఇందు పల్కులాండాంటికి అర్థమేమి? ప్రామిన్కులకును బల్కులాండాంటికిని సంబంధమేమి? క్రొత్తగా సర్వంకషముగా భరింపరాని వెలగానున్న ప్రతియందు నీ పాఠ మిట్లే యున్నది. వ్యాఖ్యాత లీ పదమును చూడనైన లేదేమో? ఇక్కడ నుండదగిన పదము పల్కులాండేటికి అను ప్రత్యేకవాక్యము. ప్రతాపరుద్రీయమందు 'కింబహునా' అని ప్రత్యేక వాక్యమే కలదు. దానికిది అనువాదము. ప్రతిలేఖకుల పరిష్కర్తల ప్రమాదమువలన 'పల్కులాండేటికి' 'పల్కులాండాంటికి'గా మారినది.

## 'ప్రభూతయవ సైంధవ'

కౌరవసభనుండి రాయబారము వెడలిన కృష్ణుడు తన్నునిచివచ్చుటకు కర్ణుని కొంతదూరము తోడ్కొనివచ్చి అతనితో చెప్పవలసిన విషయములన్నియు చెప్పి ప్రయత్నమంతయు విఫలము కాగా చివరకు సమరము నిశ్చయించి ఇది యుద్ధమున కనుకూలమైన సమయము. 'ప్రభూతయవ సైంధవంబు అని' చెప్పినట్లు భారతముద్రిత ప్రతులన్నిటియందు గలదు. దీని కర్థమేమి?

ప్రభూత = పుట్టిన లేక సమృద్ధమైన; యవ = ఆహారధాన్య విశేషము; సైంధవము=సైంధవ లవణము. గుల్మములకు ఔషధముగా ఉపయోగించునట్టిది అని అర్థముకదా. యుద్ధమునకు కావలసినది ఈ రెండే అయినచో ఈ రెండును ఏకాలమందైనను సమృద్ధముగా దొరకును. ఆ కాలమే ఏల? దీనిని విచారించి ఇంతవరకును ఎవ్వరు సంస్కరింపరైరి. అక్కడి పదములు యవసైంధవములు కావు—యవసేంధనములు 'యవస'మనగా అశ్వమునకు ఇతర పశువులకు కావలసిన తృణవిశేషము. ఆ కాలమందు వర్షకాలమందు పుట్టిన గడ్డి బాగుగా పెరిగి సమృద్ధముగా సులభముగా లభించును. ఇక ఇంధనము. ఇంధనమనగా వంటచెఱకు. ఇది కృష్యాది కర్మలలో పాయపడెడి వర్షాకాలమందును నిదాఘతాపబహుళములగు ఉష్ణకాలమందును శీతికా పిశాచికాక్రాంతమగు చలికాలమందును కంటె మిక్కిలిగా శరత్కాలమందే సులభముగా లభించుట అనుభవసిద్ధము. కృష్ణుడు ఆ విషయమునే కర్ణునకు చెప్పెను. ఇప్పటికిని పెద్దలు ఏదైన ఒక గ్రామమును గూర్చి చెప్పునపుడు తృణకాష్ఠజల సమృద్ధిగల గ్రామమని చెప్పుదురు.

## అద్రిగ్రావము లుర్విరాల

తెనాలిరామకృష్ణుని పాండురంగమాహాత్మ్యమునందు రాధయొక్క తపోవర్ణనావసరమున తొలకరి వానలు వర్ణించుపట్టున 'అద్రిగ్రావములుర్విరాల బలిఘోషాడంబరంబుల్ వియోగి ద్రోహమ్మొనరింప' వానలు కురిసెనని కలదు. దీని కర్థము: అద్రిగ్రావములు=కొండలరాళ్లు, ఉర్వి=భూమిపైని, రాలన్=రాలగ; బలి=ప్రజల సంబంధమైన; ఘోషాడంబరంబుల్=గొప్ప చప్పుళ్లు; వియోగిద్రోహంబున్=విరహులకు బాధను; ఒనరింపన్; ఈ యర్థము ప్రతి ముద్రణమునందును గలదు. చివరికి ఆకు ప్రతులతో సంప్రదించి పాఠనిర్ణయము గావించి వావిళ్లవారిచే ప్రకటింపబడిన దుర్భరమైన వెలగల ప్రతియందును ఈ మూలపాఠ మిట్లే యున్నది. ఇది సరియగునా? కొండరాళ్లు చిన్నవి. ఏ వర్షమునకైనను రాలును. వానికి తొలకరివానయే అక్కరలేదు. పెద్దబండలు ఏ వర్షమునకును రాలవు. ప్రాలుట భూమిపైనే రాలునుకాని మరి ఎక్కడ రాలును? దానికి ఈ తొలకరివాన లేల? ఇంకను బలిఘోషాడంబరములు = పూజాధ్వనులు వర్షకాలారంభమున తప్పక సంభవించునని యా దేవాలయములలో వియోగులకు సూచకముగా పూజలొనర్చి వాద్యములు వాయింతురా? ఈ రెండును అసంబద్ధములే. అచ్చట మూలపాఠము ఏమనగ అద్రిగ్రావములు ఉర్విఘ్రాలన్ బలిఘోషాడంబరంబుల్ వియోగిద్రోహంబొనరింప

అని అనునది కవిప్రయుక్త పాఠము. ప్రతిలేఖకుల ప్రమాదములవలన ఈ దోషము సంభవించినది. వీని నింతవరకు ఎవ్వరును గమనింపకుండుటదురదృష్టము.

## ప్రథమ జామాత

శృంగారనైషధములో భీమరాజు దమయంతీ వివాహానంతరమున అల్లునకు అరణమిచ్చు సందర్భమున 'మనుజనాథుండు ప్రథమ జామాత కొసగె' అనుదానికి 'ప్రథమ జామాతకు=పెద్దయల్లునకు' అని వెంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్యానము. అబద్ధమునకు అసంబద్ధముగా వ్యాఖ్యానించిరేకాని పాఠదోషమును పరికింపజాలరైరి. అక్కడ ఉండవలసిన పాఠము 'ప్రథిమ జామాత కొసగె'. ప్రథిమన్ ప్రశస్తితో అని అర్థము.

## గనేరుకాదారి

భీమఖండమున

వినయంగల్గినకూర్మి భృంగిరిటిగానీ
తండుగానీ నికుం
భునిగానీ కయిదండ వట్టుకొని సం
భోగేచ్ఛ నంతఃపురాం
గనలన్ గన్నుమొరంగి యప్పురమునం
గన్నేరుకాదారి ప్రొద్దున భీమేశుడు
సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబునన్

అని కలదు.

కాదారియన అర్ధరాత్రికాగా గన్నేరుపదమున కర్థమేమి? గన్నేరుపూవుతప్ప మరి ఏమియు కనపడదు. అక్కడ ఉండవలసిన పాఠము కన్నేర్చుఅని ఉండవలయును. అట్లున్నచో కంటిని బాధించు దృష్టి ప్రసరింపనీయని అని అర్థమగును. అట్టి కాదారిలో విటసంచారము ప్రసిద్ధము. అట్లు కానిచో గన్నేరుపదము వ్యర్థమగును. మరియొక వింత. ఈ కాదారిప్రొద్దు శివరాత్రి మాహాత్మ్యమునందును ప్రయోగింపబడినది సారస్వత పరిషత్ప్రకటిత ప్రతియందు 'గాంధారి ప్రొద్దున' అని ముద్రింపబడినది. దానిని నేను సవరించిపంపినను ద్వితీయ ముద్రణమున సవరింపరైరి. తాళపత్రగ్రంథస్థమో పరిష్కర్తృప్రణీతమో తెలియరాదు. గాంధారి ప్రొద్దనుపదము శ్రీనాథుడు ప్రయోగించునా? అందే

## సాని పెండ్లి

పదునాల్గు మహాయుగముల
ముదుకండగు భీమనాథు మొగచాటై యుం
డదు సానిపెండ్లి యెప్పుడు
నది దక్షారామ మహిమ మగునో కాదో.

ఇచ్చట సానిపెండ్లి భీమనాథునకు మొగచాటై యుండదనగా నిత్యము సానిపాపల పెళ్ళిళ్లు ఆ ముసలితాత చూచుచుండును అనికదా భావము. నిత్యము పెండ్లి చూచుటలో విశేషమేమియున్నది. సానులు పెండ్లాడుటయన్నను విశేషమేయగును. ఇక్కడ పెండ్లియాడుటే వర్ణితముకాని పెండ్లి చూచుటమాత్రముకాదు. ఇక్కడ అపార్థమునకు కారణము, పెంటిఅనుటకు బదులుగాపడిన పెండ్లి అను అపపాఠము. పెంటియనగా యువతి అని అర్థము. తిర్యగ్జంతువులయందు ఏనుగుపెంటి ఇత్యాది ప్రయోగములు కనపడుచున్నవి.

ఆదిమజాతులలో పురుషులకు పుంజాలనియు స్త్రీలకు పెంటులనియు వ్యవహారము కనుబడుచున్నది. కావున సాని పెంటి అని పాఠము సవరింపవలయును. అయినచో వర్ణనావిశేష మేమనగా వృద్ధులను తరుణులు అసహ్యించుకొందురు కదా! అట్లు అసహ్యించుకొనక పదునాల్గు మహాయుగముల నాటి మహావృద్ధుని సైతము అసహ్యించుకొనక కామించుట.

## ధరణీ ధరపత్ని

భీమఖండమునందే

పరమాసించుచు బరమే
శ్వరు నాసలిజేసె దివ్యభవనంబులు దా

నరికాలుడు కరికాళుడు
**ధరణి** ధరపత్ని మనసు దైన్యము ముంచెన్.

అని యున్నది. దాని భావము – పరమేశ్వరు నాజ్ఞచే కరికాలచక్రవర్తి దివ్యభవనములను నిర్మించెననియు దానిచే హిమవంతునకు భార్యయు పరమేశ్వరునకు అత్తయునగు మేనక మనస్సు దైన్యములో మునిగి పోయెననియు కదా? ఆ దైన్యమునకు కారణమేమి? ఇల్లు వాకిలి లేక మెట్టలవెంట పుట్టలవెంట తిరిగెడి తన అల్లునకు కూతునకు దివ్యభవనములు లభించుట అత్తకు దైన్యహేతువగునా? అల్లుడు కూతురు సుఖించుట అత్తకు దుఃఖహేతువగునా? ఈ దురభిప్రాయము తప్పు పాఠమువలన కలిగినది. ఇల్లు వాకిలి లేకపోవుట ఇల్లాలికి దుఃఖహేతువగును. కాని ఇల్లాలి తల్లికి కాదు. కావున యిక్కడ పత్నియను చోట పుత్రియని దిద్దవలయును. ముంచెన్ అను చోట మాంచెన్ అని దిద్దవలయును ఈ రెండు పాఠములు సవరించిన సరసమైన అర్థము లభించును.

భీమేశ్వర పురాణము ప్రథమాశ్వాసమున పురవర్ణనమున మందమారుతమును వర్ణించుచు:

**వటపల్లవంబులు**

'కలమపాలికల చిక్కని చన్నుగవలపై వట పల్లవంబులు వ్రాయదట్టె' అని కలదు. కలమపాలికలు తొమ్మపై వటపల్లవములు ఉన్నట్లు కదా దీనికి అర్థము. వటపల్లవములు ఎక్కడను అలంకారముగా నుపయోగించుట కనపడదు. తాపశాంతికైనను అవి ఉపకరణములుకావు. అవి ఆ కన్నెల చన్నులపైని వర్ణించుట అనుచితముగదా! కాని అక్కడ నున్నవి వటపల్లవములుకావు. పటపల్లవములు. అనగా సన్నని చిన్ని పయ్యెద చెంగులని అర్థము. వ్రాయసకాని పొరపాటు, పరిష్కర్తల పరాకు కలసి ఈ యనర్థమును కల్పించినవి.

శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యమునందు సారస్వతపరిషద్ద్వితీయ ప్రకటనము నందు తప్పు పాఠము లనేకము లున్నవి. సుమారు ఏబది దగ్గరగా సవరణలు పంపితిని. సుగృహీత నామధేయులు రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు కొన్ని సవరణలు పంపిరట. వానికై ద్వితీయ ముద్రణమున నాకును శ్రీశర్మగారికిని కృతజ్ఞత తెలిపిరేకాని నా సవరణలుమాత్రము గ్రహించినట్లగపడదు. గ్రంథగ్రంధులు అనేకము మిగిలియున్నవి. వానికై ప్రత్యేక వ్యాసము వ్రాయవలసియున్నది. ఇంతతో ఈ వ్యాసము ముగింతును. ప్రాజ్ఞులు నా పరిష్కరణములు ఉచితములైనచో గ్రహింతురని ఆశించుచున్నాను.



# ఆర్తనాదం

శ్రీ బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి

ఓ లోలంచును ఓలలాడు బ్రదుకునే
యుచ్ఛ్వాస నిశ్వాస మా
ర్గాలన్ భారము దింపు నేత యెవడో!
ప్రాణిన్ ఫలక్షీర ధా
రా లుబ్ధంబుగ పెంచు త్రాత యెవడో!
రావంచు, లేవంచు నే
లా లోలాత్ముడనౌదు! నీ వెలుగు
జూడన్ గూడ నే జాలనా!!

ఈ వలపోతయే నెపుడు
నీ తలపోతయె దారి – తెన్ను – లే
కావల ఈవలన్ విసరినట్టుల
వైచిన నేడ్చికొంచు నా
శావధి జీవిత వ్యవధి
చాలిన నీపదమందుకొందునో!
ఈ విధు రార్త నాదముగ
నే యొక బిందువు చింది పోదునో!—

ఏడువ లేని కన్నులవి
యెందులకో! యెద యెందుకో! ఇటే
నీడలు తాము నే ననుట
నేర్పిన నేరము లెంత దూరమో

ఈడిచె! వ్రేలుబెట్టు నెడ
      మేనియె లేకను నీవె నే నటం
చాడిన మాటనే మరచి
      నాను ప్రభూ! బ్రదుకార్చినాన్ ప్రభూ!

ఇక నేమున్నది! నేది జూచినను
      నీవే యంచు నొక్కొక్క మా
రు! కనన్ జాలని దేదియేని అది
      నీ రూపంచు నొక్కొక్క పా
రి! కలాభావనకన్న గాఢమగు
      నాకృష్యంబు నాక్రందనం
బిక నేమున్నది! అద్వయాఖిల
      జగమ్మె నీవనన్ నేననన్!!

---



# ఓడలు - బళ్ళు


తమిళ మూలం:
శ్రీ కా. నా. సుబ్రహ్మణ్యం

అనువాదం:
శ్రీ బి. వి. సింగరాచార్య
శ్రీ పి. సభాపతి


తంజావూరు నాకు కొత్తకాదు.

గవర్నమెంటు ఆఫీసుల్లో ఏదో చిన్న గుమాస్తాగా ఉంటూన్న వ్యక్తి కడుపున పుట్టడం అదృష్టమే! అలా పుట్టిన అదృష్టవంతుడు బాల్యంలోనే ఎన్నో ఊళ్ళల్లో కొన్నికొన్నినెలలో, సంవత్సరాలో గడిపే అవకాశం ఉంటుంది.

తంజావూరులో కొంతకాలంగడిపే అదృష్టం వెనక ఒకప్పుడు ఇలాగే పట్టింది నాకు. మా నాన్నగారు తంజావూరులో ఉద్యోగంచేస్తున్న రోజుల్లో కొంతకాలం ఆ ఊరు హైస్కూల్లో చదువుకున్నాను. నా హైస్కూలుచదువు పూర్తికావటం, మా నాన్నగారు మరో ఊరికి బదిలీఅవటం— ఏకంగా కలిసివచ్చాయి. గవర్నమెంటు ఉద్యోగస్థులంతా తమ చాకచక్యంవల్ల ఏదోవిధంగా సాధించుకునే విజయమే ఇది.

హైస్కూలు వదిలిపెట్టం తర్వాత చాలా కాలం మళ్ళీ తంజావూరు వెళ్ళవలసిన అవసరం ధొరకలేదు. ఓసారి తంజావూరు వెళ్ళిరావాలి — అక్కడో పదిరోజులు హాయిగా గడపాలి. వెనక బాగా పరిచయమున్న అక్కడి పాతస్థలాలన్నీ ఒక్కసారి చూసిరావాలనే సరదామాత్రం తరచూ కలిగేది. నేను తంజావూరునిగూర్చి తరచు ఇలా ఆలోచించటానికి చాలా కారణాలున్నాయి. బాల్యంలో ఆడుతూ పాడుతూ తిరిగిన స్థలాల్ని మళ్ళీ నడివయస్సులో వెళ్ళిచూడాలనుకోటం చాలామందికి మామూలేగద! అంతకన్నా వేరే కారణాలు చూపించనక్కరలేదేమో! అలా వెళ్ళి చూడటంలో ఓ మహత్తరమైన ఆనందం ఉంది. ఆ సుఖాన్ని అనుభవించి ఎరుగని వాడు మనిషికాడనే చెప్పొచ్చు. ప్రస్తుతం నేను ఉంటూన్న ఊరు ఎంతో మారిపోయింది. తంజావూరుమాత్రం కొంచెంకూడా మారలేదు. మానవుడు ఎప్పటికీ తనలో ఏ మార్పూలేకుండా, చెక్కుచెదరని శరీరసౌష్ఠవంతో బాల్యదశలోనే స్థిరపడిపోతే ఎంతహాయి! ఇలా కలలు గనలేనివాణ్ణి మనమెరుగుదుమా? చిన్ననాడు చిరపరిచితాలైన ప్రదేశాలన్నింటినీ వదిలేను, ఇరవై ఏళ్ళు గడిచాక మరోసారి వెళ్ళిచూడటం—ఓ విధమైన ఆత్మానందమే!

ఇహ తంజావూరుకి సంబంధించినంతవరకు ఆహ్లాదకరమైన సంగతులెన్నో నాకు జ్ఞాపకం ఉన్నాయి. దుఃఖాలను పుండరించే సంగతులుకూడా ఉన్నాయనుకోండి. మా అమ్మ చచ్చిపోయింది తంజావూరులోనే. కాని ఆ దుఃఖం తాలూకు జ్ఞాపకాలు ఈనాడంత దుఃఖప్రేరకంగాలేవు. సుఖమో, దుఃఖమో ఏదైనా—కొన్నికొన్ని బాల్యస్మృతులు నెమరువేసుకోవటంలో మానవుడికి ఎనలేని ఆనందం ఉందన్నమాట నిజం.

మరో కారణంకూడా ఉంది! తంజావూరులో నాకు అవసరమైన పనులుకూడా ఏవో లేకపోలేదు. సరస్వతీమహల్లో ఓ వారం రోజులు కూచుని, చేతనయినదేదో 'పరిశోధన' జరిపితే, నిన్నమొన్నటి

చరిత్రలో మనవాళ్ల గొప్పతనాన్నీ, బలహీనతల్నీ నలుగురూ మెచ్చుకునేటట్టు అతిశయోక్త్యలంకార సంకరంగా రాయటానికి వీలైన సంగతులు కొన్ని దొరక్కపోవు. ఓ సారి తంజావూరు వెళ్ళిరావటం నా వృత్తికికూడా కొంచెం లాభకరంగా ఉంటుందని తీర్మానించుకున్నాను.

'వెళ్ళాలి, వెళ్ళాలి! వెళ్ళితీరాలి' అనుకుంటూ కాలయాపన చేస్తూండగా, స్నేహితుడు రఘు దగ్గిరినించి ఓ ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం ముఖ్యంగా తంజావూరునించి రావటమే దాని విశిష్టత.

నేనూ, రఘూ సహాధ్యాయులం—తంజావూరు హైస్కూల్లోకాదు—చిదంబరం విశ్వవిద్యాలయంలో, నాలుగేళ్లు ఎంతోస్నేహంగా తిరిగేవాళ్ళం. నాటి మా స్నేహం ఎంత గాఢమైనదో మాతోటి విద్యార్థులందరికి తెలుసు. ఆ రోజుల్లో రఘు ఒంటరిగా వాళ్లమధ్య కనబడితే, వెంటనే నన్నుగూర్చి ప్రశ్నించేవాళ్ళు. అలాగే, నేను ఒంటరిగా వాళ్ల కంటబడితే రఘువానిగూర్చి అడిగేవాళ్ళు. కళాశాల చదువులు పూర్తిఅయింతర్వాత కూడా, మేమిద్దరం మొదట రెండుమూడేళ్లు తరచూ ఉత్తరాలు రాసుకునేవాళ్ళం. ఆ రెండు మూడేళ్లతర్వాత, చాలా అరుదుగానే ఎప్పుడైనా కలుసుకునేవాళ్ళం. ఒకరి సంగతి మరొకరికి అంత ఎక్కువగా తెలీదుకూడాను. కాని, మా స్నేహం మాత్రం మాసిపోలేదు. అంతరంగాలలో ఒదిగిఉంది అని చెప్పాలి. రఘు యోగక్షేమాన్నీ, భవిష్యత్తునీ గూర్చి తరచు నేను ఆలోచించటంకద్దు. వాడూ అలాగే, నన్నుగూర్చి ఆలోచించేవాడనటంలో సందేహంలేదు. పత్రికల్లో నాపేరు వాడి కంటబడినప్పుడల్లా నన్ను జ్ఞాపకం చేసుకునేవాడని నిస్సందేహంగా అనుకోవచ్చు.

నాలో అంతర్గతంగా మెదులుతూ ఉండిన ఈ స్నేహభావంవల్ల, మళ్లీ రఘువాతో కొన్నిరోజులు

రఘువా దగ్గిరినించి ఓ ఉత్తరం వస్తుందని ఎదురుచూసినమాట నిజమే. కాని, ఆ ఉత్తరం తంజావూరునించి వస్తుందనుకోలేదు; సరిగ్గా ఆ వేళ వస్తుందనీ అనుకోలేదు. వాడి ఉత్తరం నాకు అమితసంతోషం కలిగించింది.

అలవాటుప్రకారంకాకుండా, రఘు కొంత విపులంగానే రాశాడు. వాడికి పెళ్ళయినసంగతి మటుకే తెలుసు నాకు. రఘు పెళ్లాం ఇద్దరు బిడ్డల్ని అతని సంరక్షణకొవదలి, చనిపోయిందన్న సంగతి ఆ ఉత్తరంలో రాశాడు. భార్య చనిపోయి ఇంకా ఏడాది కూడా కాలేదనీ, తాను తంజావూరులో నలభై యాభై రూపాయలు గడిస్తూ, ఏదో ఆఫీసులో ఉద్యోగంచేస్తున్నట్టూ రాశాడు. మరో పెళ్లిచేసుకోటం ఇష్టంలేదన్నాడు. ఇంటిపనులు చేసిపెట్టటానికి ఓ అవ్వ ఉందిట. ఇహ వాడూ, వాడి పిల్లలూ ఏదో ఉన్నదాంతో సరిపెట్టుకుని కాలక్షేపం చేస్తున్నట్టూ, ఓ పదిరోజులు ఆఫీసుకి సెలవు పెడుతున్నట్టూ, కొన్నిరోజులు తంజావూరులో గడపటానికి నిశ్చయించుకున్నట్టూ రాశాడు. ఆ పదిరోజులూ నేను అతనితో తంజావూరులో గడిపితే, తనకి మనశ్శాంతి, సంతోషం కలుగజేసినట్టవుతుందనికూడా రాశాడు.

వెంటనే బయలుదేరివస్తున్నానని ఉత్తరం రాసేశాను. ఎలాగో నాలుగైదురోజులు గడిచాక బయలుదేరి వెళ్లగలిగాను.

తంజావూరులో పదిరోజులుమాత్రమే ఉండి రావాలనుకుని వెళ్లిన నేను, నెలరోజులకు పైబడే ఉండిపోయానక్కడ. నా స్నేహితుడు రఘూ మొదట పదిరోజులనుకుని, తర్వాత ఇరవై, ముప్ఫై, నలభైరోజులు—ఇలా వరుసగా సెలవు పొడిగించేశాడు. రఘు పిల్లలతో ఆడుతూ, పాడుతూ కాలం వెళ్లబుచ్చటం నాకెంతో సంతృప్తిగాఉంది.

ఆ రోజుల్లో నాకు, — ఆ రోజుల్లోనే ఏమిటి?—అప్పటికీ, ఇప్పటికీకూడా,—అత్యవసర

మైన పనులంటూ ఏవీలేవు. రోజూ ఇరవైనాలుగు గంటల్లో, నిదురపోయేవేళలు మినహాయిస్తే— మిగతా సమయమంతా ఎంతోహాయిగా గడిచేదనే చెప్పాలి. ఎప్పుడూ మాటలే! ఎడతెగకుండా మాట్లాడుకునేవాళ్లం. అలా మాట్లాడుకోటానికి విషయాలేమున్నయ్యాఅని ఇతరు లాశ్చర్యపోవచ్చు. కాని, ఎప్పుడూ, ఏదో కబుర్లతో మా సంభాషణ జోరుగా సాగేది! ఆ సంభాషణ సంతతం రస వంతంగా సాగటానికి వీలుగా, మధ్యమధ్య మౌనం కూడా అలవాటు చేసుకున్నాం. ఆ ఎడతెగని మా సంభాషణా, ఆ సంభాషణలో మధ్యమధ్య క్షణకాల మౌనం మాకెంతో ఆనందం కలిగించేవి.

పొద్దున్నేలేచి కాఫీ పోసేసుకుని, ఎక్కడి కయినా షికారు బైలుదేరేవాళ్లం. పది, పదిన్నర గంటలకల్లా భోజనాలు ముగించేసి, సరస్వతీ మహల్‌కి వెళ్లేవాళ్లం. అక్కడ ఏదో ఓ పాత పుస్తకం తీసిపెట్టుకుని పేజీలు తిరగేసేవాళ్లం.

రఘూకి సాహిత్యంమీద—అంటే పుస్తకాల మీద, చదువులమీద—అట్టే ఆసక్తిలేదనే చెప్పాలి. కాని ఏ విషయాన్నైనా చక్కగా ఆలోచించగల భావుకుడు రఘూ. ఆ రోజుల్లో కొంచెం పుస్తక పరిచయంకూడా ఉండేదతనికి. సాహిత్యాన్ని జీవనో పాధిగా పెట్టుకుని బతకాల్సిన నాకు సాహిత్య వ్యాసంగం వృత్తిగాపెట్టుకోని రఘూ భావనలూ, సంభాషణా ఎంతో ఉపకరించాయి. వాడి సాహిత్య చర్చలు, విమర్శలూ నిజంగా నాకెంతో ఉపక రించాయి.

మధ్యాహ్నం మూడుగంటల కాఫీవేళకి ఇంటికి వచ్చి, రఘు పిల్లల్తో ఆడుకుంటూ కులాసాగా గడిపేవాణ్ణి. రఘూమాత్రం పగలుకూడా ఓ కునుకు తీసేవాడు. ఇహ నేను, ఆ పిల్లలకి తృప్తికలిగించని కథలేవో చెపుతూ కాలక్షేపం చేసేవాణ్ణి. శ్రద్ధగా, కథంతా విన్నతరువాత ఆ చిన్నపిల్ల (పేరు రాజీ) అన్నది: 'మామయ్యకి కథలు చెప్పటం రాదురా మణీ! నువ్వో కథ చెప్పరా!' అంటూ అన్నని కథ- చెప్పమనేది. మణి కథలు చెప్పటం ప్రారంభించే వాడు. ఆరేళ్ళ కుర్రాడుచెప్పే ఆ కథలు నాక్కూడా వినటానికి ఎంతో స్వారస్యంగా ఉండేవి.

సాయంకాలం ఎండతీవ్రత కాస్త తగ్గేవేళకి, మళ్లీ అలా షికారు బైలుదేరేవాళ్లం. రఘూ ఉండే ఇల్లు ఉత్తరపువీథిలో ఉంది. ఇంటినించి బయలుదేరి పడమటిదిక్కుగావెళ్లి, ఎగువవీథిమీదుగా పాతమంటపం దాటి, శివగంగతోట, దేవాలయం దాటి, ఓవర్‌బ్రిడ్జిమీదుగా మైలో, రెండుమైళ్లో నడచివెళ్లి తిరిగొచ్చేవాళ్లం. వచ్చేటప్పుడు రైలు దారమ్మటే స్టేషనుకివచ్చి, ప్లాట్‌ఫారంమీద బుక్ స్టాల్లో ఏవోకొన్ని కొత్తపుస్తకాలు, పత్రికలు పట్టుకుని, టవర్‌క్లాక్‌దాటి, దిగువవీథిమీదుగా రాత్రి తొమ్మిది, తొమ్మిదిన్నరగంటలవేళ ఇల్లు చేరుకునేవాళ్లం.

రాత్రి భోజనాలు, కొంతసేపు పుస్తక మస్తక ప్రస్తారం, కబుర్లూ, నిద్ర.

మొదటి ఏడెనిమిది రోజులూ ఇలాగే గడి పేశాను.

తొమ్మిదోరోజు సాయంత్రం, ఇంట్లోంచి బయలుదేరేటప్పుడు, 'రఘూ, ఈ రోజు కొత్త దారమ్మట పోదాం; దిగువవీథిమీదుగా నడచివెళ్లి, టవర్‌క్లాక్‌దగ్గర కాఫీతాగి, తిన్నగా స్టేషనుకి పోదాం. తర్వాత ఓవర్‌బ్రిడ్జిమీదుగా వల్లం రోడ్డమ్మట రెండుమూడుమైళ్ళు నడవొచ్చు' అన్నాను.

హైస్కూల్లో చదువుకునే రోజుల్లో నేను వల్లంరోడ్డుమీద ఒంటరిగా చాలాదూరం నడచి వెళ్లేవాణ్ణి. ఆ రోజుల్లోకానీ, ఇప్పుడుగానీ స్నేహితులు ఎక్కువమందిలేరు నాకు. అందుకు నాకు విచారమూలేదు. సాయంకాలంకాగానే ఓ పుస్తకం చేత పట్టుకుని—చదువుతానా లేదా అన్నది అప్రస్తుతం!— ఒంటరిగా చాలాదూరం నడచిపోతూండేవాణ్ణి. తరచు వల్లంరోడ్డుమీదుగానే సాయంత్రం షికారు

వెళ్లేవాణ్ణి. నా ఒంటరితనం, ఆ ప్రశాంత వాతావరణం—రెండూ నాకు ఇష్టం. చాలా పొద్దుపోయింతర్వాత, చీకట్లో ఆ రోడ్డుమీద నడవటానికే భయంవేసేది. ఎన్నో రోజులు భయంతో గబగబా నడుస్తూ, పరుగెత్తుతూ ఆలస్యంగా ఇంటికి వచ్చేవాణ్ణి.

'అలాగే వెళదాంలే!' అన్నాడు రఘూ. ఆ వేళ రఘూ ఎందుకో కొద్దిగా జంకుతూ జవాబు చెప్పాడనిపించింది. అయితే ఆ విషయాన్నిగూర్చి ఆట్టే ఆలోచించటం మానేశాను. రఘూ ఏదో పరధ్యానంగా ఉన్నాడని మాత్రం తీర్మానించుకున్నాను.

ఆ సాయంత్రం పెందరాళే బయలుదేరమని రఘూని కాస్త తొందరపెట్టాను. నిజమే. బయటికి వచ్చింతర్వాత రఘు మామూలుగా రోజూ వెళ్లేటట్టు పడమటిదిక్కుగానే బయలుదేరాడు.

'రఘూ! ఈ రోజు కొత్తదారిని పోదాం అనుకున్నాంగా!' అన్నాను.

'ఓ! అలాగే వెళదాం!' అన్నాడు రఘూ. అప్పుడుకూడా కాస్త జంకుతూనే జవాబు చెప్పాడు. కొద్దిగా సంశయిస్తూనే దిగువవీథికి తిరిగాడనిపించింది. ఇలా సస్తాయించటానికి కారణమేమిటో బోధపడలేదు నాకు.

'నీ కిష్టంలేకపోతే, రోజూ వెళ్లేదారినే వెళదాం,' అన్నాను.

'ఏం! ఫర్వాలేదు. ఇటే వెళదాం,' అన్నాడు రఘూ.

'లేకపోతే ఎగువవీథీమీదుగా పాతమంటపం దాటి, ఆస్పత్రిరోడ్డమ్మట నడుస్తూ టవర్‌క్లాక్ రోడ్డుకి తిరుగుదాం', అన్నాను.

'ఎలా వెళ్లినా ఒక్కటేగా,' అంటూ ముందుకి నడిచాడు రఘు.

నేనూ వెంటనడిచాను.

మాట్లాడుకోటానికి ఎన్నోసంగతులున్నాయి. ఆ రోజు ఉదయం సరస్వతీమహల్లో చూసిన ఒక చిత్రకళాగ్రంథాన్నిగూర్చి మాట్లాడుతూ నడిచాం. 'సాంప్రదాయిక చిత్రాలుఅన్నపేరులోనే గొప్పతనమంతా ఉందనుకోటంవల్ల 'కళ' పూర్తిగా నశించిపోయింది. ఆ చిత్రకళాగ్రంథమే దీనికి నిదర్శనం,' అని నేనే వాదించాను.

'సాంప్రదాయిక చిత్రాలు అన్నంతమాత్రాన బాగాలేవు, అనటానికి వీల్లేదు. బాగున్నా, లేకపోయినా వాటిలోని 'సంప్రదాయాంశమే' ముఖ్యంగా గ్రహించి వాటిని గౌరవించాలి'' అని రఘూ తన అభిప్రాయం వెల్లడించాడు.

'చిత్రకారుడు కొన్నినియమాలు ఏర్పరుచుకుని వాటికి కట్టుబడి కృషిచేయటానికి ప్రయత్నిస్తాడు. అన్నికళలూ కొన్నిహద్దుల్ని, నియమాల్ని ఏర్పరచుకుని వాటి ఒద్దికల్లో, ఆ హద్దుల్లోనే వృద్ధిపొందుతయి. ఈ కట్టుబాట్లు, నియమాలు సంప్రదాయచిత్రాల్లో స్పష్టంగా కనిపిస్తాయి—వీటికి విశిష్టమైన అందచందాలు, విశేషార్థాలూ ఉన్నాయి,' అన్నాడు రఘు.

'కట్టుబాట్లూ, హద్దులూ—వీటిలో ఎంతో అందం ఉంది. వాటిని నేనూ ఒప్పుకుంటాను. కాని, ప్రతికళాకారుడూ తనకి అవసరమైన కట్టుబాట్లనీ, హద్దుల్నీ తనే స్వయంగా ఏర్పరచుకోవాలి. కళల్లో సజీవచైతన్యం, తేజస్సు, విశిష్ట రూపకల్పన—ఇవన్నీ అప్పుడే సాధ్యం అనుకుంటాను' అన్నాను.

'అప్పుడు ప్రతికళాకారుడూ అపూర్వ ప్రతిభాశాలి అయిఉండాలి. ప్రతిభాశాలి కాకపోతే నువ్వు చెప్పింది సాధ్యంకాదు! మామూలుగా కళాకారుల్లో అటువంటి ప్రతిభ ఎందరి కుంది? కళాకారులమని గొప్పగా చెప్పుకునేవాళ్లల్లో ప్రతిభావంతు లెందరున్నదీ మనకు తెలుసుగా!' అన్నాడు రఘు చిరునవ్వుతో కలిపి.

'మేధావిత అందరికీ ఉండదు; ఉండనక్కర్లేదు కూడాను. ఓ వేళ ఉంటే అది ప్రమాదకరమే,' అన్నాను నేను.

'కళల్లో క్లిష్టమైన విషమసమస్యలు బాగా అర్థంచేసుకున్నాకే సంప్రదాయాల పేరిట కట్టుబాట్లు ఏర్పరిచారేమో!' అన్నాడు రఘూ.

'అల్లా నిర్వచిస్తే సంప్రదాయ ప్రాభవాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవచ్చు. ఒక కళలో మెలకువలన్నీ తెలిసినంతమాత్రాన ప్రతిభావంతుడు కాడు. అలాంటివాడు కళాసంప్రదాయసూత్రాలకి లోబడి రచన చేయవచ్చు. కాని స్థిరపడిపోయిన సంప్రదాయ సూత్రాలను అధిగమించి సృష్టించటం అతనికి చేతకాదు;—ఓ వేళ సృష్టించినా అందులో 'చైతన్యం' పూజ్యంగావే ఉంటుంది. సంప్రదాయాన్ని అధిగమించిన కళాఖండంగా రాణించదు. అదంతాసరే...'

నా మాటకి అడ్డొచ్చి రఘూ అన్నాడు. 'ఈ సంప్రదాయాలు బహుళ ప్రచారంపొంది, ఇతమిత్థమంటూ రూపొంది అందరూ ఆమోదించేవిగా వాడుకలో స్థిరపడిపోయినయి. ఇటువంటి రమణీయమైన సంప్రదాయాల్ని మనం అంగీకరించాల్సిందే!'

ఆ మాటలు వింటూ నాలో నేనుగా నవ్వుకుంటూ, వరౌనంగా నడుస్తున్నాను. దిగువవీధీ, దక్షిణపు వీధీ కలిసే కూడలిదాటి మామాసాహెబ్ కూడలిని సమీపిస్తున్నప్పుడు రఘూ మళ్లీ మాట్లాడటం ప్రారంభించాడు.

'ఉదాహరణకి కవితా సంప్రదాయాలు తీసుకుందాం. పదప్రయోగాల్లో సంప్రదాయాంశమే ముఖ్యంగా కనిపిస్తూంది. 'నాకు సంప్రదాయంతో పనిలేదు. నేను కళాకారుణ్ణి' అని సగర్వంగా చెప్పుకునే కొందరు 'పదాల నిరంకుశాధికారాన్ని నిర్మూలించటానికి రెండు అంటే మూడనీ, నలుపు అంటే ఎరుపు అనీ, సూర్యుడు అంటే చంద్రుడనీ అంటూ కొత్త సంకేతాలు వాడతాను; ఆ అర్థాల్లోనే నే నాపదాల్ని వాడతాను,! అంటే ఏమైనా అర్థం ఉంటుందా? వీళ్లని లోకం కళాకారులని గౌరవించదు. పిచ్చివాళ్లని తీర్మానించుకుని ఊరుకుంటుంది.'

'చైనాలో మహాకవుల్ని పిచ్చివాళ్లతో జమ కట్టటం నేటికీ వాళ్ల సంప్రదాయంట!' అన్నాను నేను చిరునవ్వు నవ్వుతూ.

'మన ఊళ్లోనూ అంతేగా? కవుల్ని మాత్రమేనా? మహాత్ముల్నికూడా పిచ్చివాళ్లని చూసినట్లు చూసే అలవాటు మనకీ ఉంది. అలా చూడటం మనకీ ఒక సంప్రదాయంగా వచ్చేసింది. కనుకనే మనకదో వినోదంగా స్ఫురిస్తూంది. పైగా......' ఏదో కొత్తసంగతి చెప్పబోతూ చటుక్కుని ఆపి, ఆపైన మాట్లాడటం మానేశాడు రఘూ.

నేను తలెత్తిచూశాను. మొట్టమొదట రఘూని, ఆ తర్వాత రోడ్డుమీదా పరిశీలనగా చూశాను. టవర్‌క్లాక్‌దగ్గరికి వచ్చాం. ఐదు గంటల ముప్ఫైఅయిదు నిమిషాలు చూపిస్తూంది గడియారం.

'త్వరగా నడు మణీ! అడుగో మనకి ఎదురుగా వస్తున్నాడే, వాడికి కనబడకుండా వెళ్లిపోవాలి. ఆస్పత్రిరోడ్డుకి తిరుగుదాం పద!' అంటూ కంగారుగా ముందుకు నడిచాడు రఘూ.

రఘూకేసి ఆశ్చర్యంగా చూశాను. రోడ్డుమీద ఎవణ్నోచూసి ఇల్లా ఖంగారుపడుతున్నాడేమిటి! ఏమిటి కథ? రఘూనిగూర్చి తక్కినవాళ్లు ఎవరైనా నాతో ఈ సంగతి చెబితే, నేను నమ్మేవాణ్ణికాను. రఘు అలాంటి పిరికివాడు కాడనే నా నమ్మకం,

'ఎవరయ్యా అతనూ?—నీకు అంతఇష్టం లేని ఆ వ్యక్తి ఎవరు?' రఘూని వెటకారంచేస్తూ రోడ్డువైపూ చూశాను.

ఆ వేళ రోడ్డుమీద జనసంచారం కొంచెం ఎక్కువగానే ఉంది! మనుష్యులు అన్నివైపులా తొందరతొందరగా పోతున్నారు. మాకేసి వస్తున్న నలుగురైదుగురుమాత్రం ఓ నలభై గజాలదూరంలో ఉన్నారు. వాళ్లల్లో రఘు చూడటానికి ఇష్టం లేక తప్పించుకోవాలనుకున్న అతను ఎవరో తెలియ లేదు. రఘూకేసి తిరిగి ప్రశ్నార్థకంగా చూశాను.

'వాకింగ్‌స్టిక్ ఊపుతూ, జరీఅంచు అంగ వస్త్రం భుజాన వ్రేళ్లాడేసుకుని వస్తున్నాడే, ఆ తెల్లమీసాల ఎత్తైనమనిషి, పెద్ద పెద్ద అంగలు వేస్తూ నడచివస్తున్నాడు చూడు, అతన్ని ఇప్పుడు కలుసుకోటం నాకు ఇష్టంలేదు,' అన్నాడు రఘు చీదరింపుగా.

రఘు చెప్పిన పెద్దమనిషికేసి పరీక్షగా చూశాను. బాగా పొడగరి, కళగలముఖం;—దుస్తుల్లో, నడకలో హుందాతనం కనిపిస్తూంది. నిజానికి పెద్దమనిషిలాగే కనిపించాడు.

ఆస్పత్రిరోడ్డుమీదికి తిరుగుతూ, 'పెద్ద మనుషులతో విరోధాలు ఎప్పటినించీ?' అన్నాను చిరునవ్వు నవ్వుతూ.

'పెద్దమనిషి? ఎవడు? వాడా?' అన్నాడు రఘు.

రఘూ మాటల్లో చిప్పిలిన ద్వేషం, ఏవగింపు నా కాశ్చర్యం కలిగించింది. వాడి ప్రశ్నకి నేను జవాబు చెప్పలేదు. రెండు నిముషాలు ఆగి వాడే సమాధానం చెప్పాడు. 'నువ్వు చెప్పింది వో విధంగా నిజమే. పెద్దమనిషిలాగే కనిపిస్తున్నాడు. నిజానికి పెద్దమనిషికాడు; వెనక ఎప్పుడో పెద్దమనిషి అయిఉండవచ్చు. గొప్ప ఇంటా పుట్టిపెరిగి, అన్ని నీచత్వాలను అనుభవించినవాడు అనుకోవచ్చు.'

ఆస్పత్రి రోడ్డుమీద త్వరత్వరగా ఇరవై ముప్ఫై గజాలు నడిచాం. అప్పటికి, రఘూ మళ్లీ మాట్లాడటం మొదలుపెట్టాడు. 'సమయానికి తలెత్తి చూశాను కనుక సరిపోయింది. వాడు నన్ను గుర్తించలేదు. నా కతన్ని కలుసుకోటం ఇష్టం లేదు. ఓ వేళ అతనే గనక నన్ను గుర్తుపట్టి ఉంటే, ఈపాటికి మనిద్దర్ని నడిరోడ్డు మీదఆపి, గప్పాలుకొడుతూ బీరుతాగేందుకు డబ్బులు గుంజుకుని మరీ వదిలేవాడు!.

నిజానికి చిల్లర డబ్బులు ఇవ్వడానికి వెను కాడే మనిషికాదు రఘూ! వాడలాంటి మనిషికాడని నాకు బాగా తెలుసు. రోడ్డుమీద ఒక వ్యక్తిని చూడగానే, రఘూకి ఇంత చిరాకూ, విసుగూ కలిగిందంటే ఇంతకన్నా బలమైన కారణం ఏదో ఉండి తీరాలి. అందులో సందేహం లేదు. రఘూ మనస్సులో ఏముందో? ఎవరికి తెలుసు?

'అతని పేరేమిటి?'అని అడిగాను.

'మమ్మేలియార్, సదాశివ మమ్మేలియార్,' అన్నాడు రఘూ.

'మమ్మేలియార్! అదేం పేరోయ్! చిత్రంగా ఉందే?'

రఘూ కాస్త సంకోచిస్తూ, 'ఇప్పుడు నన్నేమీ అడక్కు. నా మనస్సు బాగాలేదు. సదాశివ మమ్మేలియార్ సంగతులు అన్నివివరాలతో సహా ఇంకోరోజున చెపుతాలే,' అన్నాడు.

సంప్రదాయరీతులనుగూర్చిన మా సంభాషణ కూడా ఆపైన సాగలేదు. ఇద్దరం మౌనంగా నడిచాం. మధ్యలో మాట్లాడిన ఒకటిరెండు మాటలు రక్తికట్టలేదు. ఆ రోజు వల్లంరోడ్డు మీద షికారు వెళ్లనూలేదు. మామూలుప్రకారం రైలుదారమ్మట అబ్రహాంతోట ఎల్లలువాకా నడచివెళ్లి వెనక్కివచ్చేశాం.

## 2

ఇది జరిగినతర్వాత సదాశివ మమ్మేలియార్ సంగతులేవీ నేను స్వయంగా అడగనూలేదు; రఘు చెప్పనూలేదు. ఎంచేతో ఆ సంగతి మాట్లాడటం రఘూకి ఇష్టంలేదని తేల్చుకున్నాను. చెపితే అతనే

వుతాడు; 'ఎలాగూ మరో రోజెప్పుడో వాడే చెపుతాడు!' అనుకున్నాను.

మర్నాడు పొద్దుటిపూట యథాప్రకారం గడిచిపోయింది. ఆ సాయంత్రం షికారు బయలుదేరే టప్పటికి రఘూ అప్రయత్నంగా దిగువవీథికేసి మళ్లాడు. నేనూ అభ్యంతరం చెప్పలేదు. మౌనంగా రఘూ ప్రక్కన నడిచాను. టవర్ క్లాక్ దగ్గిరికి వచ్చాం. ఇంకా ఐదు కాలేదు. అంత పెందరాళే మమ్మేలియార్ ఇంట్లోంచి బయటికిరాడేమో! ఆ రోజు ఆ చుట్టుపక్కల ఎక్కడా మా కంట పడలే దతను.

ఆ మర్నాడు పొద్దున్న. కాఫీ టిఫినూ అయింత ర్వాత సరస్వతీ మహలుకేసి బయలుదేరాం. అనుకోకుండా ఆ రోజు మా సంభాషణ మళ్లా సంప్రదాయాలమీదికి ఒరిగింది.

తూర్పు వీథిలోంచి అయ్యన్ మార్కెట్ వీథి లోకి వెళుతూన్నప్పుడు రఘు అన్నాడు. 'మొన్న నేగా అన్నావ్!...చైనాలో మహాకవులని పిచ్చివాళ్లని పిలవటం సంప్రదాయమని...

'అవును.. మహాకవుల తత్త్వమే అలాంటిది! షేక్స్పియరూ చెప్పాడుగా? పిచ్చివాడు, కవి, ప్రేమికుడూ అని వరసపెట్టి...'

'ఎంత ఉదాత్త కవి సమయం!...మన మాటల్లో భావాల్లో ఆచార వ్యవహారాల్లో కవితా సౌందర్యంతో నిండిన సందర్భాలు ఎన్నిలేవు?... లెక్కలేనన్ని!' అన్నాడు రఘు.

'నేను మటుకు లేవన్నానా? అన్నీ ఒప్పుకుంటాను...కాని, కవిత్వం సంగతి మరచిపోయి, కవి సమయాల్నే పట్టుకుని పాకులాడే వాళ్లని ఏమనాలో తెలీటం లేదు నాకు' అన్నాను,

'ఏదో సందర్భంలో ఎవరో—చైనా వాడేనని జ్ఞాపకం – చెప్పినట్టు ఎక్కడో చదివాను, బలి పీఠం దగ్గిర బలికి సిద్ధంగాఉన్న మేకపిల్లని కాపాడటానికి పూనుకున్న బుద్ధుడి శిష్యుల్ని నిల బెట్టి, 'ఈ మేకపిల్ల ప్రాణం నీ దృష్టిలో చాలా ముఖ్యమైనదిగా కనిపిస్తూంది. నాకుమాత్రం, ఈ కర్మకాండ—తరతరాలుగా, సంప్రదాయంగా అనుసరిస్తూ వస్తూన్న ఈ కర్మకాండ—ఎంతో పవిత్రమైనదని, ముఖ్యమైనదని నా నమ్మకం. ఇప్పుడేం చేయాలి?' అని ఆ చైనావాడు అడిగాడట.'

రఘు వెనకఎప్పుడోచదివిన సంగతి జ్ఞాపక ముంచుకుని ఇప్పుడు చెప్పగలగటం ఆశ్చర్యమే! రఘూకి పుస్తకాలు చదివే అలవాటుంది. కాని, చదివినవాటిని జ్ఞాపకముంచుకునే అలవాటు లేదతనికి. ఈ సంగతి తెలుసు నాకు.

'అరే! రఘూకూడా పెద పండితుడుగా తయారయ్యేట్టు ఉన్నాడే? చదివిన విషయాలన్నీ జ్ఞాపకం పెట్టుకోటం మొదలుపెట్టాడే!' అన్నాను నవ్వుతూ.

నవ్వడం ఆపి, 'ఆ సంగతి ఎవరు చెప్పారో తెలుసా? నేటి చైనాలో జీవితానికి ఆధారతత్త్వ సూత్రాలు ప్రవచించిన లావోజే శిష్యుడి మాటలవి,' అని కొంచెంగంభీరంగా అన్నాను.

'పేరు మరచిపోయాను. విషయంమట్టుకే జ్ఞాపకంఉంది. బలి, కర్మకాండ—వీటికి సంప్రదాయంవల్ల, ఆచారవ్యవహారాలవల్ల ఏర్పడిన రామణీయకం చాలా గొప్పదే! దానికి విలువ కట్టలేం!' అన్నాడు రఘు.

అయ్యన్ మార్కెట్టులోకి వచ్చేశాం. పొద్దుటి పూటగదా! మార్కెట్టులో జనం రద్దీ ఎక్కువగా ఉంది. అంతేకాదు. పొద్దున్నేలేచి, సంచీ చేత పుచ్చుకుని సరాసరి మార్కెట్టుకి వెళ్లడం చక్కని ఆచారంగా అలవాటుచేసుకొన్నవాళ్లు తంజావూరులో ఈనాటికీ ఎందరోఉన్నారు. మార్కెట్టుకి వెళ్లడం గృహస్థులందరూ తప్పనిసరిగా పాటించవలసిన కనీసపు ధర్మంగా, బాధ్యతగా పరిగణిస్తూన్నవారు ఎందరో ఉన్నారు. ఆ గుంపులమధ్యనించి సులభంగా

బయటపడగలమనుకోటం పిచ్చి ఊహే! హుషారుగా సాగిన మా సాహిత్యచర్చ మార్కెట్టుమధ్య ఆ గుంపులమధ్య పరాకాష్ఠనందుకో బోవటంకూడా హాస్యాస్పదమే!

ఆ జనం మధ్యనించి బయటపడేవరకూ, రఘూ, నేనూ మాట్లాడుకోలేదు. మాట్లాడుకోటమే సాధ్యం కాలేదు. అలా మాట్లాడుకున్నా నిరుపయోగమే! ఇందులో సందేహం ఏమీ లేదు. సాహిత్య చర్చ, తాత్త్వికచర్చ - వీటన్నింటికంటే జీవితంలో చాలా ముఖ్యమైన, తప్పనిసరైన వంకాయల బేరంలో లగ్నమైన ఎంతోమంది మా చుట్టూ మూసురుకుని ఉన్నారు. అంతూ పొంతూ లేని మా సాహిత్య చర్చకి 'పుచ్చు వంకాయలు వీశె రెండణాల్లు' అని నిర్లక్ష్యంగా అన్నమాటలూ చక్కని ముగింపే!

ఆ గుంపుల్నిదాటి వచ్చేసిం తర్వాత రఘూ మళ్ళీ మాట్లాడటం మొదలు పెట్టాడు. 'పొద్దున్నే లేచి సంచీ చేతపుచ్చుకుని, చిల్లర డబ్బులు జేబులో వేసుకుని, 'ఈ రోజు నాల్గణాల కూరగాయలు కొవాలి' అని మార్కెట్టుకి చక్కా 'వెళ్ళేవాడే నేటి నాగరికతకి ప్రతిబింబం అనుకోవాలి! అదరాబాదరగా అంగవస్త్రం భుజాన వేసుకుని, యుద్ధానికి బయలు దేరే మహావీరుడిలాగా ఇంటినించి బయలుదేరుతూ పావుగంటలో మార్కెట్టులో కూరల కొట్లన్నీ పర్యవేక్షించి త్వరగా తిరిగి వచ్చెయ్యాలని దారి పొడుగునా అనుకుంటూ, ముప్పావు గంటసేపయ్యిం తర్వాత గాని తిరిగి ఇంటికి చేరలేని రకం ఒకటి.

నింపాదిగా బయలుదేరి రోడ్డుమీద కనబడే వాళ్ళందరితో బాతాకానీ కొడుతూ దార్లో ఏదైనా ఓ హోటల్లో దూరి, రెండిడ్లీ సాంబారూ, ఒక్క వడ చెట్నీ, వో కప్పు కాఫీ—చక్కెర, డికాక్షన్ హెచ్చు—తాగేసి; ఇందులో ఒక హోటల్లో ఇడ్లీ, మరో హోటల్లో కాఫీ తాగేవాళ్ళు మరీ తాజానాగరీకులు; నెమ్మదిగా మార్కెట్టునించి ఇంటికివచ్చి 'అప్పుడనగా మార్కెట్టుకి వెళ్ళినవారు ఇప్పుడా రావటం? అని సహధర్మచారిణి జ్ఞాపకం చేసే వరకూ మౌనంగా ఊరుకుని; ఆ తర్వాత కాస్సేపటికి 'ఇంకా వంటకాలేదా? ఆఫీసుకి టైమయి పోయిందే' అని మండిపడే పెద్దమనుషులు మరో రకం.

'తను మార్కెట్టుకి వెడితే అక్కడి వాళ్ళెవరూ తనమీద పడకుండా ఉండాలని నానా అవస్థలూ పడుతూ, ఒదిగి ఒదిగి వారగా నడిచే వాళ్ళ రకం ఒకటి.

'మార్కెట్టుకి వెళ్ళి వచ్చిం తర్వాత స్నానం చేయకుండా ఉండలేను' అనే జాతి ఒకటి.

'మార్కెట్టులో మనుషులందరినీ ఒక తోపు తోసి రావాలన్న కుతూహలంతో బయలుదేరి ఘన విజయంతో తిరిగి వచ్చేరకం మరొకటి.

'అణాకానీబేరానికి నాలుగైదు అంగళ్ళు తిరిగే రకం ఇంకొకటి!

'ఎంత ఖరీదు చెప్పినా 'అంతేనా' అంటూ నిర్లక్ష్యంగా డబ్బులు పారవేసే రకం ఒకటి...'

అంటూ ఉత్సాహంగా చెప్పుకు పోతున్నాడు రఘూ.

రఘూ చెబుతున్న వర్గాల జాబితా అంత త్వరగా పూర్తి అయ్యేటట్లు లేదు.

నేను మధ్యలోనే అందుకున్నాను.

'వీటన్నింటినీ మించిన మరోజాతి ఉంది! మార్కెట్టులో తనకితప్ప తక్కిన వాళ్ళెవరికీ ఏదీ సరిగ్గా కొనటం చేతకాదు అని తల ఎగరేసే జాతి...మా నాన్నగారు ఈ రకం మనిషే; నాకు బాగా జ్ఞాపకం ఉంది...మేము తంజావూరులో ఉంటూన్నప్పుడు మా నాన్నగారు కూరగాయలు కొనడాన్నిగూర్చి గంభీరంగా ఉపన్యాసంచేస్తూ మార్కెట్టుకివెళ్ళి కూరగాయలు కొనితెచ్చేవారు.

మా అమ్మ 'మీకోసం ఈ పుచ్చువంకాయల్ని నాలుగ్గైదు రోజులు జాగర్తగాదాచి, మీకిచ్చి పంపినట్టున్నాడు ఆ అంగడివాడు. అసాధ్యుడే!' అని చివరికి అంగడివాడి తెలివిని మెచ్చుకునేది. ఆ పైన మా నాన్నగారి కోపానికి పట్టపగ్గాలుండేవికావు.'

మాటల పారవశ్యంలో నన్ను నేను మరచి అజాగ్రత్తగా నడవటంవల్ల అంతఃపురం ఉత్తర గోపురపు గుమ్మందగ్గర ఎదురుదెబ్బతిన్నాను. కాలికి గట్టిగా దెబ్బ తగిలింది. గోరూడి పోలేదు నయమే. కాలు జివ్వుమన్నది. 'అబ్బా' అని గట్టిగా అరిచాను.

'గొప్ప గొప్ప సంగతుల్ని మేరుపర్వతాల్లాంటి విషయాల్నిగూర్చి గుక్కతిప్పుకోకుండా ఏకబిగిని మాట్లాడగలం. ఎంత గొప్పరాజభవనమయినాసరే, గుమ్మానికి కాలుతగిలి వేలు చితగ్గొట్టుకోకుండా నడవటంమాత్రం చేతకాదు మనకి!' పరిహాస ధోరణిలో అన్నాడు రఘూ.

కాలునొప్పివల్లనేమో, ఒక్కనిమిషం వాడిమీద ఎక్కడలేని కోపం వచ్చింది. ఎలాగో ఆ కోపాన్ని దిగ్రమింగి, మరుక్షణంలో చిరునవ్వు నవ్వాను.

రఘూకూడా నవ్వాడు.

'వీధి గుమ్మా లనే సంప్రదాయాన్ని మరచి పోకూడదు. అస్తమానం వాటిమీద ఎదురుదెబ్బలు తింటూ, వేళ్ళు జివ్వుమనేటట్టు జ్ఞాపకం తెచ్చుకుంటూ ఉండాలి! గోళ్ళూడకుండా, అమాంతం పడిపోకుండా జాగ్రత పడితే చాలు.' అన్నాను నేను నవ్వుతూనే.

'నిజమే. వీధి గుమ్మాలు...' అంటూ మళ్ళీ ఏదో తాత్త్విక చర్చలోకి దింపడానికి ప్రయత్నించాడు రఘు.

రఘు సాగిస్తున్న తాత్త్వికచర్చ నాకెందుకో నచ్చలేదు. 'ఇహ చాలు, ఇలాంటి మాటలు కట్టిపెట్టు' అన్నాను విసుగ్గా.

రఘు మళ్ళీ నవ్వాడు.

'సంప్రదాయాలను సమర్థిస్తున్న నీ కాలికి తగిలి ఉండవలసింది. అప్పుడు తెలిసేది.' అన్నాను నేను కోపంగా.

'ఏం సంగతి? దెబ్బ గట్టిగా తగిలిందా? అరె!'. అన్నాడు రఘూ.

ఉత్తరద్వారం అవలనున్న మైదానందాటి అంతఃపుర ప్రాంగణంలోకి వచ్చాం. వెనక తంజావూరుని రాజులు పరిపాలిస్తున్న రోజుల్లో ఆ ప్రాంగణాన్ని ఎందరు వీరులు అహర్నిశం కాపలా కాసేవారో! ఎందరు కవులు, కళాకారులు, భట్రాజులు, మహాపండితులు—ఆ మహాపండితుల కటాక్షంకోసం ప్రాకులాడే చిల్లర పండితులు—ఎందరు ఎన్ని రోజులు వస్తుండి, ఆరనిఆశతో ఆ విశాలమైన అరుగుమీద, ఆ ఎత్తైన స్తంభాలమీద—జారగిలబడి ఉండేవారో! ఎందరు ప్రభువులు, శ్రీమంతులు రాజదర్శనంకోసం పడిగాపులు పడిఉండేవారో! అత్తర్ల ఘుమఘుమలతో సేవకులనడుమ నిలబడి చుట్టూఉన్న మనుషులకేసి చూసీచూడనట్టు అభినయిస్తూ ఎన్ని భంగిమల్లో నిలబడేవారో ఆ ప్రభువులు! ఎన్ని ఏనుగులు, గుర్రాలు, యుద్ధవీరులు, రథాలు...తంజావూరుని రాజుల పరిపాలించే రోజుల్లో...ఆ ప్రాంగణం 'కళకళలాడుతూ' ఆశానిరాశలతో ఎంతమహావైభవంతో తులతూగుతుండేదో!

వెనకవేపున్న ఏదో జనసమూహం, గుర్రాలు, ఏనుగులూ కదిలివస్తున్నట్టు భ్రమ కలిగింది నాకు. ఉలిక్కిపడి వెనుదిరిగి చూశాను. నిటారుగా పెరిగిన అశోకవృక్షం ఆకుల్ని దూసుకుంటూ చల్లనిగాలి వీస్తూంది; ఆకు గలగల శబ్దం తప్ప ఇంకేమీ లేదు.

పెద్ద పెద్ద స్తంభాలు, గచ్చుపెచ్చు లూడిపోయి వన్నెచెడిన కప్పుతో, గడ్డిమొలచి దుమ్ముకొట్టుకొని ఉన్న అరుగుతో ప్రత్యక్షమయింది— బట్టబయలులో ఉన్న మంటపం. ఆ పాడువడ్డ మంటపంలో ఓ మూల నలుగురైదుగురు బిచ్చగాళ్ల కుటుంబాలు మసిబారిన కుండలూ, చింకిచాపలూ కనిపించాయి. పెద్దస్తంభం, దానినానుకుని, కాళ్లు జాపుకుని ఎర్రటోపీతీసి పక్కన నేలమీద పెట్టి, నెరసిన వెంట్రుకల్ని సుఖంగా గోక్కొంటున్న పోలీసు బంట్రోతూ—

ఇది నేటి తంజావూరు: బ్రిటిషు వాళ్ల సంరక్షణలో ఉన్న తంజావూరు. మరాటీ ప్రభువుల నాటి తంజావూరు కాదు. నాయకరాజుల పాలనలోని తంజావూరు కాదు. ఇంకా పూర్వులైన చోళుల తంజావూరు అసలేకాదు.

ఆ క్షణంలో నాకూ అనిపించింది—సంప్రదాయాలు, ఐతిహ్యాలు మానవ సంతతికి అత్యావశ్యకమే! ఆదిలో ఒకే స్వరూపం కలిగి, కాలక్రమేణా ఒకదాని వెనుక ఒకటిగా ఎన్నో భిన్న భిన్న స్వరూపాలు దాల్చగల లక్షణం ఆచారాలకి, ఐతిహ్యాలకి ఉంది. మానవుని మనస్సు బాహ్య స్వరూపాన్ని స్వీకరించినట్టుగా, ఒక సూత్రాన్నో, తత్వాన్నో అంగీకరించటం అసంభవం. మాటలకి ఉన్న మంత్రశక్తి కొంతమేర ఈ ఐతిహ్య నిరూపణశక్తిపై ఆధారపడి ఉంది అనిపించింది.

'రాజు' అన్నమాటే చూడండి. ఆ పదానికి డిక్షనరీలో ఉన్న అర్థం ఏమిటో మనందరికీ తెలుసు. కాని, 'రాజు' అన్న పదానికి పూర్తిగా అర్థం చెప్పటానికి డిక్షనరీలోని అన్ని పదాల్నీ పట్టుకుని తంటాలుపడినా పూర్తిగా అర్థం చెప్పటం సాధ్యంకాదు. మాటల్లో వివరించడానికి అందని ఒక తత్వానికి, భావానికి 'రాజు' అన్న పదం రూపకల్పన చేస్తోంది. 'రాజు' అనగానే మనకు శక్తికొలదీ, ఒక్కొక్క వ్యక్తికిగల ఊహాశక్తి కొద్దీ, అస్పష్టంగా ఒక రాజునే రూపకల్పన చేసుకుంటాం. సమకాలిక నాటకరంగ చలచ్చిత్ర విజ్ఞానం, చారిత్రక విషయజ్ఞానం కలబోసుకుని 'రాజు'కి రూపకల్పన చేసుకోటానికి తోడ్పడతాయి. సుఖాసీనుడైన రాజు, సింహాసనం, రాజ్యం, రాజధాని, రాజదండం, మంత్రి పరివారాలు. జరిపే లేక జరిపించుతున్నట్టు కనిపించే న్యాయవిచారణ, సభామంటపంలోని కవిశ్రేష్ఠులు, అంతఃపుర స్త్రీలు, అంతఃపురంలో మంతనాలు, వదంతులు, ప్రజలు, సేనలు...ఇవన్నీ మాటల్లో పూర్తిగా ఇమడనంతగ మన కళ్లకి కట్టినట్టు ప్రత్యక్షమవుతాయి స్పష్టంగా జ్ఞాపక చిత్ర రూపం దాలుస్తాయి.

ఉదాత్త సాహిత్య సృష్టి రహస్యం ఏదేనని నేను తీర్మానించుకోటం, రఘునాథ మళ్లా ప్రసంగం మొదలు పెట్టడం ఒకసారి జరిగింది.

ఈ లోగా మేము మొదటి ఆవరణదాటి, లోపలి రెండో ఆవరణలోకి వచ్చేశాం. అక్కడ గోడలమీద రెండు పక్కలా నాలుగు వర్ణచిత్రాలు ఉన్నాయి. అవేమీ ప్రాచీనకాలం క్రితంవి కావు; అనద్యతన భూతకాలానికి చెందినవి కావు. సుమారు నూట యాభై, రెండువందల ఏళ్ల క్రితంనాటివై వుండాలి. అశ్వారూఢుడైన రాజొకడు, సపరివారంగా పురదర్శనానికి బయలుదేరుతూన్న దృశ్యం నాలుగు చిత్రాల్లో కనిపిస్తోంది. మరాటీ ప్రభువు తలపాగా ధరించి, ముఖంలో ఎట్టి భావమూ స్ఫురించక పేలవంగా కనిపించే ఆ రాజు అంతఃపురంనించి బయలువెడలే దృశ్యం—కళ్లకు కట్టినట్టు బాగా జ్ఞాపకం ఉంది. తెల్లగోడల మీద ఎర్రరంగు నడుమగా, కొట్టవచ్చినట్టుగా ఉంది. మిగిలిన రంగులు—ఇంకా ఏయే వర్ణాలో—నాకు జ్ఞాపకం లేవు. అవి నా దృష్టిలో పడినట్టు లేవు.

ఆ చిత్రాలకేసి పరిశీలనగా చూస్తూ అన్నాడు, రఘు : 'ఈ చిత్రాల్లో విశిష్టతగాని,

గొప్పతనంగాని భోత్తిగా లేవు. గుర్రాలు దౌడుతీసే భావం స్ఫురిస్తూంది; మనుషులు గంభీరంగా బయలుదేరుతున్న భావం స్ఫురిస్తూంది. ఎక్కువ ప్రజ్ఞలేని చవకబారు కళాకారులకి ఐతిహ్యాలు చేకూర్చిన గాంభీర్యమే ఈ చిత్రాల ఆకర్షణకి కారణం.'

నేను జవాబు చెప్పలేదు.

రఘు అక్కడ నిలబడి తలెత్తిచూస్తూ 'అంతఃపుర స్త్రీలు, అసూర్యంపశ్యలైన అందకత్తెలు తమ తమ నాయకులు గుర్రాలెక్కి పురదర్శనంకోసం బయలుదేరేటప్పుడు—అదిగో, ఆ గోపురాల కిటికీల్లోంచి చూస్తూ నిలబడేవారట' అన్నాడు.

నేనుకూడా తలెత్తి ఆ వేపు చూశాను. జల్లెడ తూట్లలాగ కనిపించాయి, ఆ గోపురంలోని కిటికీలు. వాటివెనుక నిలబడి వాళ్ళు బయటివాళ్ళని స్పష్టంగా చూడొచ్చు. బయటి వాళ్ళకి అక్కడ నిలుచున్నవాళ్ళు లీలగానైనా కనిపించరు.

'అంతఃపుర స్త్రీలు తమ తమ భర్తల్ని మట్టుకే చూసేవారో, లేక క్రీగంటి చూపులతో తమ తమ ప్రియులనే చూసేవారో చెప్పలేం' అన్నాను నేను పరిహాస ధోరణిలో.

'పోనీ, తమ భర్తల్ని మటుకే చూసేవాళ్ళనుకుందాం. అనుకుంటే మనకేలాంటి నష్టమూ లేదు గద!' అన్నాడు రఘూ మందహాసం చేస్తూ.

'నాకూ అభ్యంతరం లేదు అలాగే అనుకుందాం' అన్నాను నవ్వుతూ. అక్కణించి బయలుదేరుతూ 'తంజావూరు రాజుల్లో చివరివాడు రాజ్యాన్ని, రాజధానినీ బ్రిటిష్ వాళ్ళకి అప్పగించేసి అన్నీ వొదులుకున్న శివాజీరాజునిగూర్చి ఎక్కడో చదివిన ఒక వాక్యం జ్ఞాపకం వస్తూంది' అన్నాను.

'ఏమిటి ఆ వాక్యం?' అన్నాడు రఘూ కుతూహలంగా.

'శివాజీ రాజాకి నూటనలభై ఎనిమిది మంది భార్యలు; పుత్ర సంతానం లేదు' అని చరిత్ర పుస్తకంలో చదివాను.

'గౌరవనీయమైన, వైభవోపేతమైన చరిత్ర ప్రసిద్ధిగాంచిన ఓ రాజవంశానికి భరతవాక్యంపాడిన 'సత్యం' ఆ వాక్యం. గ్రీకు నాటకాల్లో సుప్రసిద్ధమైన నాటకం మధ్యలో ఉండవలసిన వాక్యం!' అంటూ ముందుకి నడిచాడు రఘూ.

'విషాద కావ్యంలో పంక్తిలాగే ధ్వనించే ఆ వాక్యాన్ని ఎవడో చరిత్రకారుడు సునాయాసంగా తేలిగ్గా కొట్టిపారేశాడు ఒక్కమాటతో, వేళాకోళంగా!' అంటూ రఘూని వెంబడించాను.

ఇలా మాట్లాడుతూ రెండో ఆవరణదాటి బట్టబయటి మైదానంలోకి వచ్చేశాం. అక్కణ్నించి వెళ్ళటానికి మూడు ముఖద్వారాలున్నాయి. మొదటిది తంజావూరు రాజభవనంలో రాజులు కొలువుదీర్చే రోజుల్లో సభామంటపంగా వెలిగిన ఆ ప్రదేశానికి దారితీసే ముఖద్వారం అన్నమాట. కళాజీవి శరభోజీమహరాజా సేకరించి కూర్చిన ఈ నాడు సరస్వతీ మహల్ అనే సుప్రసిద్ధ గ్రంథాలయానికివెళ్ళే ముఖద్వారం రెండోది. మూడోది మా ముందున్న ముఖద్వారం—సంగీత మండపానికి వెళ్ళేమార్గం.

ఈ మూడు ముఖద్వారాలదాకా బళ్ళూ, కార్లూ రావొచ్చు.

సరస్వతీమహలు గేటుముందు దుమ్ముతో నిండిన పాత 'సెడాన్' కారొకటి కంటబడింది మాకు.

'తంజావూరు నేటి దుస్థితినిచూసి ప్రాచీన వైభవాన్ని ఊహించుకోటానికి ఎవడో యాత్రికుడు వచ్చి ఉంటాడు, అన్నాడు రఘు.

'విదేశాలనించి వచ్చే ఎందరో పండితులు సరస్వతీ మహల్‌కి వస్తూంటారుకదూ?'

'ఎవరో విదేశీయులు—జర్మన్ పండితులవి కిడి—ముందెప్పుడో ఒకసారి, సరస్వతీ మహ

ల్లోంచి ముఖ్యమైన తాళపత్ర గ్రంథాలు, పుస్తకాలు ఎత్తుకుపోయారని ఎందరో ఎన్నిసార్లో చెప్పగా విన్నాము.' అన్నాడు రఘూ.

ఇలా మాట్లాడుకుంటూ, మైదానందాటి వెళుతూన్నప్పుడు, సభామంటపానికివెళ్లే దారిలోంచి ముగ్గురు వ్యక్తులు ఆ పాతకారు దగ్గరికి వచ్చారు వాళ్లల్లో ఇద్దరు విదేశీయులు–తెల్లదొరలు! ఊరు చూడ్డానికి వచ్చిన వాళ్లని స్పష్టంగా తెలుస్తూంది.వాళ్ల ముఖాల్లో ఏదో తృప్తి, సంతోషం కనిపించాయి. ఠీవిగా నిలబడి సిగరెట్లు కాలుస్తున్నారు. వాళ్లతో సమస్థాయిలో ఇంగ్లీషు ముక్కలు మాట్లాడుతూ, సిగరెట్టు తాగుతూ, భుజంమీద జరీకండువా వేసుకుని చేతిలో వాకింగ్ స్టిక్‌తోసహా నల్లమీసాల వ్యక్తి ఒకడు కనిపించాడు. కొంచెం ఎత్తుగా కాస్త హోదా, గౌరవం ఉన్నవాడులా కనిపిస్తున్నాడు.

ఏదో మాట్లాడుతూ వస్తున్న రఘూ, చటుక్కుని వెనక్కి తగ్గాడు. నా వెనకాల దాక్కోడానికి ప్రయత్నిస్తూన్నట్టనిపించింది.

సరస్వతీమహల్‌కి వెళ్లడానికి మే మాకారుని దాటివెళ్లాలి. కారు ఎక్కబోతూన్న వాకింగ్ స్టిక్ అతను నున్నా, రఘూని చూడగానే కాస్త తటపటాయించాడు. కాని, త్వరలోనే కోలుకుని రఘుకేసి చూస్తూ, 'నమస్కారం' అన్నాడు.

'నమస్కారం' అంటూ హీనస్వరంలో ప్రత్యభివాదం ముగించేసి, మళ్లీ ఆకారుకేసి తిరిగి చూడకుండా గబగబా ముందుకు నడచివెళ్లి, సరస్వతీమహల్‌కివెళ్లే గేటులోకి జొరబడ్డాడు రఘూ. నేనూ రఘూని వెంబడించాను. పైన డాబావేసిన ఆ ముఖద్వారంలో ఓ పదిగజాలు నడచి వెళ్లిన తర్వాత నేను కాస్త తొందరగావే, 'ఎవరు రఘూ, అతను?' అని ప్రశ్నించాను.

'వాడి తమ్ముడు అంగదుడు' అని మాటల్ని సాగదీస్తూ సంకోచిస్తూ జవాబు చెప్పాడు రఘూ.

వాడు మాట్లాడిన తీరు–నాకెందుకో సదాశివ మమ్మేలియార్‌ని జ్ఞాపకం చేసింది. 'ఎవరూ? ఆ సదాశివ మమ్మేలియార్ తమ్ముడా?' కుతూహలంతో అడిగాను.

'అవును వాడికి తగిన తమ్ముడే వీడూ.'

'వీడుకూడా వీరుతాగే ఆసామియేనా?' అడిగాను కుతూహలం నిగ్రహించుకోలేక.

'దానికి మించిన ఆసామి' అని జవాబుచెప్పి ఊరుకున్నాడు రఘూ.

ఆ మమ్మేలియర్లని గూర్చి మాట్లాడటం రఘూకి ఇష్టంలేదని ఇప్పుడు స్పష్టంగా తెలిసింది. నా దగ్గర ఏ విషయాన్నీ దాచకుండా కలుపుగోలుతనంగా మాట్లాడే రఘూ ఇలా అవుతున్నాడేమిటి? బహుశః బిడియపడుతున్నాడేమో? ఈ మమ్మేలియార్ల రహస్యం ఏమిటో తెలుసుకుని తీరాలి. నాకుగట్టి ఆసక్తి కలిగింది. ఈ ఆసక్తికలగటం సహజమే. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు.

నేను సరస్వతీ మహల్ లోపలకి వెళ్లాను. రఘు నా వెంట రాలేదు. 'తర్వాత వస్తా'నంటూ వెళ్లాడు. ఎక్కడికి వెళ్లాడో! ఆలోచనల్లోపడి కొట్టుకుంటూన్న నేను గమనించలేదు.

## 3

ఆ రోజు సరస్వతీ మహల్లో ఓ పుస్తకంతీసి చదవటం మొదలుపెట్టాను. మనస్సు ఆ పుస్తకంలోకి చొరబడటం లేదు. చదువుతున్నంతసేపూ ఒక్కటే ఆలోచన మమ్మేలియార్, మమ్మేలియార్ అన్నపేరు మనసులో సుడులు తిరుగుతూంది. ఆ పేరు కాస్త విడ్డూరంగా ఎప్పుడూ వివని కొత్తపేరులా ఉండడమే కారణ మయ్యుండొచ్చు; 'ఈ మమ్మేలియార్ల చరిత్రలో విచిత్రమైన రహస్యం ఏదో ఉంది! ఆ రహస్యం ఏమిటో తెలుసుకోవాలి!' అన్న నా కుతూహలం, కోరికా

కారణమయుండొచ్చు,— పెడదారుల్లో వారగా ఒదిగి ఉండే విషయాలంటే నాకు సరదాగదా!

నా స్నేహితుడు రఘూ ఇదివరకెప్పుడూ ఏ సంగతీ నాదగ్గిర దాచిఎరుగడు. ఈ మమ్మేళి యార్లనిగూర్చి ఎలా చెప్పాలో తెలియక నీళ్లు నములుతూండటం నా కుతూహలాన్ని మరీ రగిలించింది. 'వాడి మనసులో ఏదో శంక ఉంది. ఆ సంగతి దాచటానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఏమిటి భావగ్రంథి? ఆ పరమరహస్యం ఏమిటో?' అన్న సందేహం నన్ను పీడిస్తూంది. నాకు తెలిసినంతలో రఘు మామూలు మనుషులకంటె కాస్త ఎక్కువ నిగ్రహం కలవాడు; సుఖదుఃఖాలకి కొంతఅతీతుడుగా జీవించగలవాడు. కొద్దోగొప్పో జీవితంలో వేదాంతదృష్టి అలవరచుకున్నవాడు ఎందులోనూ ఎక్కువ జోక్యం కలుగజేసుకుని పట్టించుకునే రకంకాదు. ఓవేళ, జోక్యం కలుగజేసుకోవలసిన అవసరం ఏర్పడినా, అందువల్ల తక్కిన వ్యవహారాలకి ఏ మాత్రం హాని కలగకుండా జాగ్రత్తపడగల సంస్కారం, పట్టుదల ఉన్నవాడు. ఇలాంటి రఘుకి దుర్భరమైనవేదన కలిగేటట్టు, ఆ మమ్మేళి యార్లు ఏం కీడు తలపెట్టారో! ఆలోచించిన కొద్దీ ఆశ్చర్యంగా ఉంది! ఈ సంగతి ఏ విధంగా తెలుసుకోటమాలని అదేపనిగా ఆలోచించాను. నాకేమీ బోధపడకపోవటంలో ఆశ్చర్యమేమీలేదు. కళ్లుకట్టి ఏదో అడవిలో వదలినట్టుఉంది నా పరిస్థితి. కాలేజీకి రాకపూర్వం రఘూ జీవితం, అతడు పుట్టి పెరిగిన వాతావరణం అంతగా తెలియవు నాకు. కాలేజీ వదలిపెట్టింతర్వాతకూడా, రఘూ జీవితం, పోకడా స్పష్టంగా తెలియవు.

తంజావూరులో ఈ మమ్మేళియార్ సోదరులిద్దరూ ఏదో అకస్మాత్తుగా పరిచయమయ్యారు. తంజావూరు హైస్కూల్లో చదువుకునే రోజుల్లో ఎవరో 'మమ్మేళియార్లు' అన్నగొప్ప ఇంటివాళ్ల కుటుంబ వ్యవహారాలు మాచాయగా విన్నాను. పుస్తకం తెరచిపెట్టుకుని గట్టిగా ఆలోచిస్తే ఇప్పుడు జ్ఞాపకం వస్తూంది. మరి తక్కిన వివరాలేవీ జ్ఞాపకం రావటం లేదు. వారాల తరబడి తంజావూరులోనే మకాం వేసుకుని కూచుంటే, ఆ మమ్మేళియార్లని ఒకటి రెండుసార్లు ఎక్కడో అకస్మాత్తుగా కలుసుకోవచ్చు. లేక వాళ్లనిగూర్చి అప్రయత్నంగా ఏవో కొన్ని సంగతులు వినవచ్చు. అంతకుమించి పూర్తి వివరాలు తెలుసుకునే అవకాశాలు ఏవీలేవు. తెలుసుకోటం కష్టమే! ఈ మమ్మేళి యార్ల బంధువులు ఇంకా ఎంతమంది ఉన్నారో? వీళ్ల కుటుంబ వ్యవహారాలు ఎలాంటివో? వాళ్ల ఇంటి ఆడబడుచులు ఎలాంటి వాళ్లు? నాకూ, రఘూకికూడా బొత్తిగా అనవసరమైన ప్రశ్నలు వేనకువేలు నాలో చెలరేగుతున్నాయి.

వీటన్నింటినీ మించిన, మరో ముఖ్యమైన కారణంకూడా ఉంది. నేను ఒక కథకుణ్ణి — కథలు రాసేవాణ్ణి. మృత కళేబరం దగ్గర్లోవుంటే, రాబందుకి ముక్కుమీద చెమట పోస్తుందంటారు — అలాగే కథావస్తువు వాసన దొరికితే వెయ్యికళ్లు విచ్చుకుని వెతకటం అలవాటు నాకు. కొంత స్వారస్యంగా ఓ కథ రాయటానికి వీలైన సంపన్న వస్తువు ఇక్కడున్నట్టు తోచింది నాకు. నేనిలా ఊహించుకోటం — ఆ సంగతి స్వారస్యమైనదే అనుకోవటం — నిజం కాదేమో! అయినా, ఆ సంగతి చివరిదాకా తరచి చూడాలన్న కుతూహలం మట్టుకు నాలో తీవ్రరూపం దాల్చింది.

రఘూతో మాట్లాడి ఈ ఉదంతం తెలుసుకోటం అసంభవం! ఈ సంగతి స్పష్టంగానే తెలిసిపోయింది. మమ్మేళియార్లనిగూర్చి తానుగా చెప్పటం రఘూకి ఇష్టంలేదు. నేనే ఆ విషయాన్నిగూర్చి మాట్లాడటం మొదలుపెడితే,— ఇహ అంతే! టపీమని మూసుకుపోయే ఎలుకబోనులా అయిపోయి, మౌన వ్రతంపట్టి ఎలాగో తప్పించుకుంటాడు. లేకపోతే వేరేసంగతులేవో మాట్లాడటం మొదలుపెడతాడు. అసలు సంగతి మాట్లాడడు. 'వాళ్ల సంగతి ఇప్పుడెందుకు? ఇంకోరోజు నేనే చెబుతాగా;' అని

ఎలాగో నచ్చజెప్పి దాటేస్తాడు. మమ్మేలియార్లని గూర్చి మాట్లాడటంతోటే ఓవిధమైన ఏవగింపూ, ఏదో చేదూ రఘూని వేధిస్తున్నాయనే భావం ధ్రువపడింది. ఆ రోజు ఉదయంకూడా, నాతో ఉత్సాహంగా మాట్లాడుతూ నవ్వుతూ వస్తున్నతను ఆ మమ్మేలియార్లలో ఇతణ్ణి చూడటంతోటే, నవ్వటం ఆపేసి టపీమని బుట్టలో పాములాగా ఇట్టే ముడుచుకుపోయాడే! ఆపైన నాతో మాట్లాడటానికే ఇష్టపడక, ఏకాంతం కోరుతూ ఎటో వెళ్లిపోయాడు! మామూలుగా నాతో సరస్వతీమహల్లో కూచుని, ఏదో పాతపుస్తకంతీసి చదువుతూ కబుర్లుచెపుతూ వేళాకోళంచేస్తూ గడిపేవాడు; ఈ రోజు రఘూ నాతో లైబ్రరీ బిల్డింగ్‌దాకాకూడా రాలేదు!

నా మనస్సు పాడయింది; పుస్తకంమీద ధ్యాస నిలవలేదు. రెండుమూడు పుస్తకాలు తెరచి పెట్టుకుని వరుసగ పేజీలు తిరగేశాను. ఓ గంటసేపు ఈ విధంగా చదివేవాడిలాగా భావాభినయం చేస్తూ కాలంగడిపి బయటికొచ్చాను. సరస్వతీ మహల్‌కి ఎదురుగ్గావున్న మరాటీలకాలంనాటి సభా మంటపంలోని పెద్దపెద్దస్తంభాల్లో ఒకదానికి జారగిలబడి రఘూ గట్టిగా ఆలోచిస్తున్నాడేమో? అక్కడా కనిపించలేదు రఘు.

కథ రాయటానికి ఏవైనా వింతవిషయాలు దొరకాలి. నిజమే! కాని నా స్నేహితుడు రఘు పడుతున్న బాధ త్వరగా మాసిపోవాలి; వాడి విరక్తి భావం నశించాలి. పాతరఘులాగా మామూలు ప్రకారం వాడు నాతో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ గడపాలి. ఇదే ఇప్పుడు నా మొట్టమొదటి కోరిక.

ఎలాగూ నేను వాణ్ణి వెతుక్కుంటూ వెళ్లి కనిపెట్టేస్తానేమోఅని, అలా సులభంగా పట్టుపడకూడదు అనుకుని రఘు బుద్ధిపూర్వకంగా, ఎక్కడికో వెళ్లిపోయాడని ఊహించుకున్నాను. నా ఊహే నిజమయితే నేను రఘూని వెదుకుతూ వాడివెంట పడటం ఏమంత మంచిదికాదు. భోజనాలవేళకి ఎలాగూ వచ్చేస్తాడుగదా, అనుకుంటూ కొంతసేపు బయటనిలబడి మళ్లీ లైబ్రరీలోకి పోదామనుకుని వెనక్కి తిరిగి వెళ్లాను.

సరస్వతీమహాల్ వరండాలో చివరమెట్టుమీద నిలుచున్న నేను అకస్మాత్తుగా తలెత్తిచూశాను. ఎదురుగావున్న ఆ గోపురం ఏడో అంతస్తుపై డాబా మీద — ఓ మనిషి ఆకారం కనిపించింది. రెండుసార్లు జాగ్రత్తగా చూసినతర్వాత ఆ వ్యక్తి రఘు అయుండొచ్చునని లీలగా తోచింది. అంతఎత్తున నిలబడివున్న ఆ వ్యక్తి స్పష్టంగా కనిపించటం లేదు — మనిషేఅన్న నమ్మకంమాత్రం కుదిరింది. ఆ మనిషి రఘూతప్ప వేరే ఎవరూకాదు. ఎవరో అని సందేహించనక్కర్లేదు.

రెండు నిమిషాలు నిలుచున్నచోటే కదలకుండా నిలబడ్డాను. ఎత్తుగాలేచిన ఆ మంటపం ఏడో అంతస్తుపై డాబామీద రెండు అడుగుల ఎత్తు ప్రహరీ గోడ కానుకుని నిలబడిన ఆ వ్యక్తికేసి చూస్తూ నిలుచున్నాను. ఆ రెండు నిమిషాలసేపూ, మాటల్లో వివరించరాని ఓ విధమైన భయం, అధైర్యం నన్ను పూర్తిగా ఆక్రమించుకున్నాయి. ఈ మమ్మేలియార్లు — ఎవరో దౌర్భాగ్యులు — ఓ ముష్కరుల ముఠా తయారై నా ప్రాణ స్నేహితుడు రఘూని ఈ లోకంలోంచి వెళ్లగొట్టాల అని ప్రతిజ్ఞ చేసుకున్నారా! ఏ విధంగానూ తప్పించుకుని బయటపడనీయకుండా రఘూని బెదిరిస్తూ, వెంటతరుముతున్నారా? అకారణంగా ఇటువంటి భావాలేవో తలెత్తాయి నాలో!

ఇలా ఎందుకు తోచాలి నాకూ!

బోధపడటం లేదు!

ఆ ఎత్తైన గోపురం, ఏడో అంతస్తుపై డాబామీదనుంచి రఘు ప్రయత్నపూర్వకంగానో, ప్రమాదవశాత్తుగానో హఠాత్తుగా కిందపడి

పోతున్న దృశ్యం నా కళ్ల ఎదుట ఒక్కక్షణం ప్రత్యక్షమై వెంటనే మాయమైంది. ఒక్కక్షణం కళ్లకి కనిపించిన ఆ ఘోరదృశ్యం నా శరీర మంతా జలదరింపజేసింది; ఒక్కకుదుపు కుది పింది. ఆ క్షణంలో నా మనస్సు ఎలా, ఎంతగా తల్లడిల్లి పోయిందో నా కొక్కడికే తెలుసు.

మళ్లీ వెంటనే. 'ఛీ! ఇదంతా నా పిచ్చి ఊహే!' అని నాలో నేను గొణుక్కుంటూ ఎలాగో సంబాళించుకున్నాను. ఆ గోపురంకేసి మళ్లీ తలెత్తి చూడటానికి మరో రెండుమూడు నిమిషాలదాకా నాకు ధైర్యంచాల్లేదు. ఎలాగో ధైర్యంతెచ్చుకుని తలెత్తి చూసేసరికి నా స్నేహితుడు రఘు అక్కడే నిలబడి ఉన్నట్టు,–కంటికి స్పష్టంగా కనిపించాడు. వాడి భుజంమీది కండువాగాలిలో మెల్లగా కదులు తూంది. కొన్నిక్షణాలక్రితం నేను భ్రమపడిన ప్రమాదమేమీ జరగలేదు. ప్రహరీగోడని ఆనుకుని రఘూ స్వచ్ఛమైన చల్లనిగాలి పీలుస్తూ ప్రశాం తంగా నిలబడిఉన్నాడు.

తీవ్రంగా అలజడినొందిన నా మనస్సుకి హాయిగా అలాంటి స్వచ్ఛమైనగాలి పీల్చడం ఎంతైనా అవసరమనిపించింది. రఘూతో కులాసాగా గడపటానికి వాణ్ణి వెతుక్కుంటూ ఆ గోపురంపై డాబామీదికి వెళదాంఅనుకుని రెండడుగులు ముందుకు వేశాను. స్నేహితుడు రఘు ఏకాంతంగా గడపాలను కుని అటు వెళ్లాడని వెంటనే జ్ఞాపకం తెచ్చు కున్నాను. నా సాన్నిహిత్యం, నా సంభాషణా రఘూకి రుచించకపోవచ్చు. అంచేత ఆ గోపురంపై డాబా మీద నిలబడి ఒంటరిగా కాలం గడుపుతున్నాడన్నది స్పష్టమే! వెంటనే అటుకేసి తలెత్తిచూడకుండా గబగబా సరస్వతీమహాల్లోకి వెళ్లికూచుని ఏదో పుస్తకం తెరిచి పేజీలు తిరగేశాను.

(సశేషం)



# ప్రేమ లేఖ*

## శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

మేఘదూతము ఒక చిరంతన ప్రేమికుని మొట్ట మొదటి ప్రేమలేఖ. దానికి ముగింపు లేదు. ప్రేయసీప్రియుల హృదయముల నిరంతర స్నేహ ధారతో ప్రేమజ్యోతి వెలుగుచున్నంత కాలమును, వారి మనఃపుష్పములనుండి యెడతెగని మాధుర్య రసము జాలువారుచున్నంత కాలమును యుగయుగములవరకు ఆ లేఖ కొనసాగవలసినదే. అది నిత్య హరితము. ఆ లేఖను సాహసించి మొదట రచించిన మహారసికుడు కాళిదాసు. జీవితపు టంచులవరకును ఒక రమణీమణి ప్రేమమాధుర్యముతో నిండి ఆమె విరహముతో విలపించినవాడు, అట్టి గొప్ప రచనను చేయజాలడు. కనుకనే నాటికిని నేటికిని ఆ రచనము ఏకైకమై, సంస్కృత సాహిత్యములో తన విజయవైజయంతికను ఎగురవేసినది. ఆ సుదీర్ఘ విరహగీతమునకు జాలిగొల్పు మందాక్రాంత వృత్తమును, నీరవగంభీరపర్వతారణ్యసీమలును, మేఘావృత వినీలప్రకృతియును, ఎనలేని పటిమను తెచ్చినవి. ఆయన రసికభావన, సుదూర భారత సుందర భూములను దాటి కైలాస శిఖరము నధిష్ఠించినది.

మేఘదూతనాయికానాయకులు ఆ కైలాస దివ్యనగమునకు చేరువైనవారు. స్వాధికారప్రమత్తుడైన నాయకుడు అభిశప్తుడై భూలోకమున రామగిరికి వచ్చిపడినాడు. ఆతడెన్నడును చవిచూడని ప్రియావిరహ విషపాత్రము పెదవుల వద్దకు వచ్చినది.

ఆతని లోకమున ప్రణయ కలహముకంటె విప్రలంభము లేదు. పడుచుదనముకంటె వయస్సు లేదు.

> నాప్యన్యస్మాత్ ప్రణయ కలహా
> ద్విప్రయోగోపపత్తిః
> విత్తేశానాం న చ ఖలు
> వయో యౌవనా దన్య దస్తి ॥

అట్టివాడు రామగిరియందు విరహఖేదమున ఆరునెలలు గడిపినాడు. శాపావసానము ఇక నాల్గు నెలలున్నదనగా ఆషాఢము వచ్చినది. కొండకొమ్మున తొలకరిమబ్బు కాన్పించినది. మేఘదర్శనమైనంతనే సుఖవంతుని మనస్సునందే వికారము పుట్టునుగదా! ఇక వియోగిమాట చెప్పవలసినదేమున్నది?

> 'మేఘాలోకే భవతి సుఖినో
> ప్యన్యథావృత్తి చేతః
> కంఠాశ్లేష ప్రణయిని జనే
> కిం పున ర్దూరసంస్థే'

పాపమాతడిదివరకే క్రుంగి కృశించి యున్నాడు. ఆతని ముంజేతి బంగరుకడియము మోచేతివరకు జారిపోయినది. గిర్యాశ్రమములందు, ఒకచో కాలునిలువక మతిపోయి తిరుగుచున్నాడు.

శ్రావణము చేరువకు వచ్చుచున్నది. తన కుశలవార్త తెలుపకున్నచో ఆ దయనీయురాలు అలకానగరమునందలి హృదయేశ్వరి ప్రాణములు నిలుపగల్గునా?

---

* కాళిదాస కళామందిరము — 4.

ఏమి సాధనము?—

అప్పుడు ఆర్ద్రచిత్తుడు మేఘుడు పొడగట్టి నాడు. ఆ దివ్యక్షణమున మేఘసందేశము పుట్టి నది. అనుపదమువనే 'శ్రోత్రపేయ'మయిన సందేశము, యక్షుని ఆర్ద్రాంతరంగమునుండి జాలువారి నది. ఇందు యక్షుడనిన 'సందేశం మే తదను జలద శ్రోష్యసి శ్రోత్రపేయమ్' అన్న వాక్యము లోని 'శ్రోత్రపేయమ్' అను మాట నిజమున కాతనిది కాదు. ఆ మాట కవిది. ఈ రచనము నందలి ఆత్మవిశ్వాసము గుండెపై చేయివేసికొని తనిచే నట్లు చెప్పించినది. భవభూతి 'ఉత్తర చరితము' తుదిని పలికిన 'పరిణతప్రజ్ఞస్య వాణీ మిమాం' అను మాటకు ఇది దీటయినది.

మహాకవి ఉద్దేశమున సంయోగ శృంగారము నందుకంటె విప్రయోగమునందే ప్రేమ రాశీ భూతమై సహస్రముఖముల వెలుగును. కొందఱు విరహమున అనురాగము నశించునందురు. అది వమ్మరానిమాట.

'స్నేహా నాహుః కి మపి విరహే
ధ్వంసిన స్తే త్వభోగాత్
ఇష్టే వస్తు న్యుపచితరసాః
ప్రేమ రాశీభవంతి'

ఇది ఆతని ప్రేమసిద్ధాంతము. ఆతడు ఈ ప్రేమదీప్తిని చిత్రించుటకై మేఘకావ్యమును ప్రత్యేకించెను. ప్రవాసియక్షుడు రామగిరిప్రాంతమున ప్రతిసుందరవస్తువునందును తన ప్రేయసీరూప మును అన్వేషించు తీరునందును, అలకలో విరహిణి యైన తన కులవధువును మనసులో చిత్రించు కొన్న విధమునందున్ను, వియోగవేదనతో స్వీయభవ నమున ఆమె సాగించు జీవయాత్రను తలంచుకొను పద్ధతియందును, తన విప్రయోగక్లేశమును మేఘుని ద్వారమున తెలుపు రీతియందును, కవి విప్రలంభరస పోషణము 'పరాంకోటి' నందుకొన్నది.

'శ్యామా స్వంగం చకితహరిణీ
ప్రేక్షణే దృష్టిపాతం
వక్త్రచ్ఛాయాం శశిని
శిఖినాం బర్హభారేషు కేశాన్ ।
ఉత్పశ్యామి ప్రతనుషు
నదీవీచిషు భ్రూవిలాసాన్
హంతైకస్మిన్ క్వచి దపి
న తే చండి సాదృశ్య మస్తి.'

ఆ ప్రవాసి, పోలికగల ఏవస్తువునందైనను, ప్రియురాలి సాదృశ్యము కాన్పించునేమోయని అన్వేషించి నిరాశ చెందినాడు.

'సఖీ! ప్రియంగులతలందు నీ శరీరమును, బెదరిన వేడిచూపులందు నీ చూపును, చంద్రునందు నీ ముఖశోభను, నెమలిపింఛములందు నీ కేశపాశమును, నదుల కదలు చిన్నితరగలందు నీ కనుబొమ్మ సాగ సునను, ఊహించుకొని చూతునుగాని, అయ్యో! ఎక్కడను నీ పోలిక కాన్పింపదు.'

ఇక నేమిచేయగలడు? తానే శిలాఫలకమున ఆమె ప్రతిరూపమును వ్రాసికొని వినోదింపదలచి అందును దైవవంచితుడైనాడు.

'త్వా మాలిఖ్య ప్రణయకుపితాం
ధాతురాగైః శిలాయాం
ఆత్మానం తే చరణపతితం
యావ దిచ్ఛామి కర్తుం ।
అస్రై స్తావ న్ముహు రుపచితైః
దృష్టి రాలుప్యతే మే
క్రూర స్తస్మి న్నపి న సహతే
సంగమం నౌ కృతాంతః'॥

'చెలీ! శిలాఫలకమున ధాతురసముతో పాల యలుక జెందిన నీ రూపము చిత్రించి, ఆ ప్రణయ కోపమును పరిహరించుటకై, నీ పాదములంటి వేడుకొనవలెనని తలచుచుండగనే, కన్నులనిండ నీరుపొంగి నా దృష్టియే లోపించిపోయినది. అట్లు

బొమ్మతో కలసికొనుటకైనను క్రూరదైవము సహింపలేదు.

ప్రత్యక్షముగ కాకున్నను కలలోనైన కాన్పించిన ప్రియురాలిని మనసారా కౌగిలించుకొన దలచి, తడవుకొనుచు, శూన్యములోనికి చేతులు చాచిన దీనయతువని యువస్వామి జాలినొందిరి పాపము! స్థలదేవతలు విడచిన కన్నీటిబొట్లు పెద్దముత్తెము లంతవేసి, ఎన్నిపారులు చెట్ల చివుళ్లపై నిలిచినవోగదా!

'మా మాకాశప్రణిహితభుజం
నిర్దయాశ్లేషహేతోః
లబ్ధాయాస్తే కథ మపి మయా
స్వప్నసందర్శనేషు.
పశ్యన్తీనాం నఖలు బహుశో న
స్థలీ దేవతానాం
ముక్తాస్థూలా స్తరుకిసలయే
ష్వశ్రులేశాః పతన్తి.'

ఇట్లు ఆతడు భావగమ్యమైన అలకలోని ప్రేయసీరూపమును భావించియే ఇట్లు తృప్తి పడుచున్నాడు.

'తన్వీ శ్యామా శిఖరి దశనా
పక్వ బింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకిత హరిణీ
ప్రేక్షణా నిమ్ననాభిః
శ్రోణీభారా దలస గమనా
స్తోక నమ్రా స్తనాభ్యాం'.
యా తత్ర స్యా ద్యువతి విషయే
సృష్టిరాద్యేవ ధాతుః'

'ఆమె సన్నని తీగెవంటి సొగశరీరము గలది. యౌవన మధ్యస్థురాలు. కొనలుదేలిన పలువరుస గలది. పాలిండ్ల బరువున కొంచెము వంగినది. సన్నని నడుముకలది. జఘన భారమున నెమ్మదియైన నడక గలది. వేయేల—బ్రహ్మదేవుని స్త్రీ శిల్పమునందలి మొదటి కల్పనము.'

ఈ శోభనాకృతి వారి సంయోగ కాలము నందలిది. అట్టి సర్వాంగసుందరి ఇపుడెంతవాడి వత్తలయ్యెనో అని ఊహించుకొని దురపిల్లును.

'తాం జానీథాః పరిమితకథాం
జీవితం మే ద్వితీయం
దూరీభూతే మయి సహచరే
చక్రవాకీ మివైకాం
గాఢోత్కంఠాం గురుషు
దివసే ష్వేషు గచ్ఛత్సు బాలాం
జాతాం మన్యే శిశిర మథితాం
పద్మినీం వాన్యరూపాం.'

'సహచరుడనైన నేను దూరముకాగా, ఒంటరి చక్రవాకివలె ఉన్నట్టి ఆమెను నా బహిః ప్రాణముగా నెరుగుము. బరువైన ఇన్ని విరహదివసములు గడువగా ఆమె ఎట్లుండునో'?

శిశిరంపు దెబ్బతిని రూపరిపోయిన పద్మినివలె రూపుమారి కాన్పించు నముకొందును? ఆ విరహిణిరూపమును ఇట్లు సజీవచిత్రముగా లిఖించి మన ఎదుట పెట్టును.

'నూనం తస్యాః
ప్రబలరుదితోచ్ఛూన నేత్రం ప్రియాయాః
నిశ్వాసానా
మశిశిరతయా
భిన్నవర్ణాధరోష్ఠం
హస్తన్యస్తం ముఖ మసకలవ్యక్తి
లంబాలకత్వాత్
ఇందోర్దైన్యం
త్వదనుసరణక్లిష్టకాంతే ర్బిభర్తి.'

'ఆ నా ప్రియురాలి కన్నులు తెగనేడ్చుటచే వాచియున్నవి. వెచ్చని నిట్టూర్పులచే పెదవిరంగు మారిపోయినది. మబ్బుకప్పిన చంద్రునివలె ముంగురులు కప్పిన ముఖమును అరచేతియందు దానించుకొని కూర్చున్నది.'

మిత్రమా, జలదా! నీవు నా యింటికిపోయి చూచినపుడు విరహిణియగు నా గృహిణి నీకిట్లగపడ వచ్చును.

'ఆలోకే తే నిపతతి పురా సా
బలివ్యాకులా వా
మత్సాదృశ్యం విరహ తను వా
భావగమ్యం లిఖన్తీ
పృచ్ఛన్తీ వా మధురవచనాం
శారికాం పంజరస్థాం
కచ్చి ద్భర్తుః స్మరసి రసికే
త్వం హి తస్య ప్రియేతి.'

'ఆమె దేవతారాధనములందు వ్యగ్రురాలై గాని, మనసునందు తోచు నా విరహరూపమును చిత్రించుచుగాని, పంజరములో తీయగాపలుకు శారికను— నీవు నా పతికి ఇష్టురాలైనదానవుగదా, అతని నెప్పుడైన స్మరింతువా— అని యడుగుచుగాని, నీ కంటబడును. ప్రియుని విరహమునందు సాధారణముగ విరహిణుల వినోదము లిట్టివేగదా!' అని సవిశేషముగ అనేకప్రియావిరహచేష్టితములను ఊహించుకొనిచెప్పి, తుదకు మేఘునితో నిట్లనును.

'జానే సఖ్యా స్తవ మయి
మనః సంభృత స్నేహ మస్మాత్
ఇత్థం భూతాం ప్రథమ విరహే
తా మహం తర్కయామి
వాచాలం మాం న ఖలు
సుభగం మన్య భావః కరోతి
ప్రత్యక్షం తే నిఖిల మచిరాత్
భ్రాత రుక్తం మయా యత్.'

'నా ప్రేయసి మనస్సు స్నేహముతో నిండియుండునని నాకు తెలియును. కనుకనే ఈ విరహమున ఆమె ఇట్లుండునని ఊహించితిని. నేను గొప్ప ప్రేమశాలి నను భావము నన్నిట్లు వాగించుచున్నదనుకొనకుము. అన్నా, నేను చెప్పినదంతయు నీవు పోయి చూచిన ప్రత్యక్షము కాగలదు. కనుక నా ఈ సందేశమును తెలియుంచి ఆమెకు వినిపింపుము.

'తా మాయుష్మన్
మమచ వచనా
దాత్మన శ్చోపకర్తుం
బ్రూయా ఏవం తవ సహచరో
రామగిర్యాశ్రమస్థః
అవ్యాపన్నః కుశల మబలే
పృచ్ఛతి త్వాం వియుక్తః
పూర్వాభాష్యం సులభ విపదాం
ప్రాణినా మేతదేవ॥

'పరోపకార పరాయణుడవై నామాటగా ఆమె కిట్లు చెప్పుము. 'నీ సహచరుడు రామగిర్యాశ్రమమునుండి విరహ దుఃఖము ననుభవించుచు ఎట్లో తన ప్రాణము నిలుపుకొని నీ కుశల మడుగుచున్నాడు'. సులభముగ విపత్తులకు పాల్పడు ప్రాణులకు ముందు చెప్పవలసిన మాట ఇదియే గదా!'

అన్నా! ఇక తుది మాట—

'ఏ త త్కృత్వా ప్రియ మనుచితం
ప్రార్థనా దాత్మ నో మే
సౌహార్దా ద్వా విధుర ఇతివా
మయ్యనుక్రోశబుద్ధ్యా
ఇష్టాన్ దేశాన్ జలద విచర
ప్రావృషా సంభృతశ్రీః
మా భూ దేవం క్షణ మపి చ తే
విద్యుతా విప్రయోగః

'స్నేహ భావముచేగాని, వియోగియనిగాని, లేక నాయందలి దయచేగాని ఈ పని నీకు తగనిదైనను నా ప్రార్థనము మన్నించి నెరవేర్చి, ఈ వర్షాశోభావేళల ఇష్టము వచ్చిన దేశములందు తిరుగుము. నావలె నీకు—విద్యుత్కాంతతో క్షణమైనను వియోగము లేకుండుగాక!

ఇట్లు దర్శించిన మేఘసందేశపు టంతరంగమున యక్షప్రవాసిగుండెదెబ్బ ప్రతిపద్యమునందును మన వీనులకు విన్పించును.

ఈ మేఘమాత్రమునకు పూర్వరంగముగా కవి నిర్మించిన ఆవరణము కల్పనామహితమై రసజ్ఞ హృదయముల నాకట్టుకొనుచున్నది.

యక్షుడు నిల్చినది రామగిర్యాశ్రమము. అందలి జలములు జానకీ స్నానపరిపూతములు. ఆ పర్వతకటకములు రఘుపతి పదాంకితములు. ఈ విరహకథకు ఉపాధిగా సీతారాముల నామస్మరణము ఒక దీప్తిని, నిర్మలమధుర దాంపత్యావాసనను కల్పించినది. యక్షుని హృదయము ఎంతటి గాఢ ప్రేమవేదనా పరితప్తమో ఇచటి శ్రీరామ కథా సంస్మృతులు కొలిచి చూపగలవు. అలక లోని యక్షిణి విరహదైన్యమును 'ఇత్యాఖ్యాతే పవనతనయం మైథిలీ వోన్ముఖీ సా' అను మాటలు అశోకవనము నందలి సీతావిరహదశాస్ఫోరకములై భాసించును. కాగా—కాళిదాసకవి ఆర్ద్రచిత్తమున రామాయణవస్తువు భావితమై యక్షయక్షిణీకథకు ఉదాత్తప్రణయమాధుర్యమును జేకూర్చినది.

రామాయణమున జరిగిన హనుమద్దౌత్యము లోకసాధారణము, 'పటుకరణ లగు' దూతలు వియోగులమధ్య దౌత్యము జరుపవచ్చును. వారి యన్యోన్య వార్తలను ఒండొరుల కెఱింగించి పుణ్యము కట్టుకొనవచ్చును. ఇట్టి సామాన్యదౌత్య కథాంశము కవి హృదయమున అపూర్వవిరహకావ్యముగ పరివర్తనము జెందినది. కళాత్మకముగ జూచినచో కాళిదాసుని విరహకావ్యపువిలువ రామాయణకథా ఘట్టమునకు అతీతమైనది.

మేఘదూత మొక మధురభ్రమ—
కళాస్వప్నము —
సుందరేంద్రజాలము—

ప్రకృతికృపణుడు, ప్రేమార్తుడు అగు ప్రవాసియక్షునకు కొండకొమ్మన తొలకరిమబ్బు కాన్పించినది. అది సంచారశీలము. ఆనాటి ఋతుపవనములు దానిని ఉత్తరదిశకే నడిపించునవి అతనికి లీలగా తెలియును. మబ్బులో చరాలున ఒక మెఱపు మెరసినది గాబోలు! అతని నల్లని హృదయాకాశమునందును, ఒక వచ్చనియాశ తళుక్కుమన్నది. చూడచూడగా ఆ మబ్బు అతనికి అచేతనముగ కాన్పింపలేదు. మఱి, సచేతనముగానే కన్పట్టినది. దానిపేరు మేఘుండు. అతడు సుప్రసిద్ధ పుష్కలావర్తకవంశమున బుట్టిన వాడు. కామరూపి. మఘవుని మంత్రి. బహిరంగముగా నాతని అంతస్థు ఇది. అంతరంగమున జూచినచో అతడు తపశ్శరణ్యుడు. పర్వత ప్రియసఖుడు' అది ఏమి వివేకము?

పొగయు, నిప్పును, నీరును, గాలియును, కూడిమాడిన కరిమబ్బు కాంతకు కబురందీయ జాలునా? ఇంతమాత్రము వానికి తెలియదా? అవును. కొంత తెలియదు—కొంత తెలియును. ఆ భ్రమలోనే అతని కానందమున్నది. దుఃఖప్రదమైన యథార్థజ్ఞానముకంటె, సుఖదమైన ఆ భ్రమ ఎంత ప్రియమైనది! ఎంత రుచిరమైనది!

ఆ మధురవిభ్రాంతిని కాళిదాసు కళాపరముగా, చక్కగా సొమ్ముచేసికొని, తరతరములకు సరిపోవు అద్భుతకావ్యముగా మలచికొన్నాడు.

గిరిప్రవాసి ఉన్మత్తుడు కాడు. అతడు కామి. కామియైనవాడు ప్రత్యంశమును తన కనుకూలముగ సమన్వయించుకొనును. చీమ చిటుకన్నను తన ప్రియురాలే వచ్చుచున్నదనుకొనును. అట్టివాడు కదలు మేఘమును జూచి అది తన ప్రేయసికి దౌత్యము నెరపునదియే భావించును. అంతవరకే అతని భ్రమ. తక్కిన విషయమునందు అతని వివేకము భ్రష్టము కాదు. అతడు తన దూతకు సలక్షణముగ మార్గమును బోధింపగలడు. మార్గమునందలి పర్వత, పట్టణ, నదీసౌందర్యములను తరచితరచి వర్ణింపగలడు. తన విరహవేదనను తీర్పుగ వివరింపగలడు. తన ప్రాణసఖికి ప్రత్యాశ

గొల్పి ఊరార్పగలడు. ఇట్టి విచారధార కవి హృదయమున గాఢముగ పనిచేయుటచేతనే **పూర్వమేఘము**ను అంత సర్వాంగసుందరముగ తీర్చి దిద్దగల్గెను.

విరహకాతరుడగు యక్షుడు సంగ్రహముగ గంతవ్యమార్గమును జెప్పి వక్తవ్యాంశమునకు బోవుట ఉచితముగాని మధ్యభారతమునందలి పర్వత పట్టణ నదీ సౌభాగ్యములను చిలువలు వలువలుగా వర్ణించుట సహజమేనా? అను ప్రశ్న మొకటి యున్నది. ఈ ప్రశ్నమునకు సమాధానము చెప్పవలసినవాడు కాళిదాసు. ఆతనికి భారతదేశ సంస్కృతి సౌందర్యములు ప్రాణాధికములు. కథలో ప్రసక్తి తెచ్చి వాని ప్రాభవమును వర్ణించుట కాతడు ఉత్సుకుడగును. రఘువంశపు చతుర్థ, షష్ఠ సర్గములందు వరుసగా దిగ్విజయ, స్వయంవర సందర్భములందు భారతాంచలములను తత్తద్రాజ వర్ణనములను జేసి కొంత తృప్తివడెను. కాని తన కాత్మీయమగు మధ్యభారత సౌభాగ్యమును వర్ణించుట కంతగా పట్టు దొరుకలేదు. ఆ లోపము నిందు తీర్చుకొనెను. దూత కంత వివరముగా చెప్పకున్నచో ఆతడు నిస్సంశయముగ గంతవ్యము నెట్లు చేరగలడు?' అని తన కావ్యనాయకుని సమర్థించుటకు ఆతడు సిద్ధముగ నున్నాడు.

మహాకవి దృష్టిలో భారతమాతృమూర్తిని 'సుజలాం, సుఫలాం, మలయజశీతలాం, సస్యశ్యామలాం' అనుట చాలదు. 'సుషమాభరితాం, సుదేవనిలయాం, నవరసరసికాం' అనికూడ అనవలయును. వాచ్యములైన ఈ పాడిమాటలును చాలవు. వ్యంగ్యసుందరమైన కావ్యగౌరవముతో వీనికి రూపచిత్రణముచేసి చూపవలెను. అపుడే ఆతనికి భారతదర్శనమున పరిపూర్ణతృప్తి కలుగును.

కవిహృదయమువలెనే సరసమైన మేఘముతో మనముకూడ పయనించినచో ఆ దివ్యసౌందర్యమును చూడగల్గుదుము.

రఘుపతిపదాంకితములైన రామగిరినితంబ సీమలను వీడినవెంటనే పచ్చని మావిపండ్లబరువుతో మొట్టమొదట శుభప్రదముగ ఆమ్రకూటపర్వతము దర్శన మిచ్చును. దానిని దాటినవెంటనే నర్మదానది ఆర్ద్రముగ్గిన వేరేడుపండ్లకొమ్మలు ఆ నదీప్రవాహమున జీరాడుచుండును. ఆవెనుక మొగలిపూల కంచెల్ల దశార్ణదేశము. దాని రాజధాని విదిశ. దాని చెంతనే వేత్రవతీనదీ విలాసము. ప్రక్కనే నాగరుల ఉద్దామ యౌవనక్రీడలను ప్రకటించు నీచైర్గిరి.

కొంచెము చుట్టుత్రోవయైనను ఉజ్జయినీ నగరమునుం జూడకుండపోగలమా? పోయినచో కవి 'అరసికులు' అని బొమలు ముడువగలడు! ఆ నగర సౌధోపరిభాగముల సొగసులు చూడకున్నచో ఆపుర స్త్రీల చంచలాచకితనేత్రశోభల పరికింపకున్నచో ఏమి జన్మము?

త్రోవలో నిర్వింధ్యానది ఒయ్యారములు! ఉజ్జయినిలో మహాకాళదేవాలయమున సాయంసేవలో నృత్యసుందరులశరీరములపై తొలిమబ్బు చినుకులు. ఆ చల్లదనమును మెచ్చి దానిపై వరచువారి ఓర చూపులు.

ఇంకను ముందులకు పోయితిమా అదిగో! అదియే దేవగిరి. ఇచ్చట వేంచేసియున్న కుమారస్వామిపై మేఘుడు తనలో చల్లని పువ్వులను కల్పించి భక్తితో వెదజల్లుచున్నాడు. ఆపైని కన్పట్టునట్టిదే బ్రహ్మవర్తదేశము. అర్జునుడు గాండీవ మెక్కువెట్టి నిశితబాణాసారములు కురియించిన వీరభూమి కురుక్షేత్రమల్లదియే. పరికించి చూడుడు. పిదప కనఖల పర్వతముచెంత హిమవంతమునుండి నేలకు దిగుచున్న గంగానది సోయగము.

భూలోకమునుండి చివ్వన హిమగిరికి వచ్చితిమి. ఆ నీహారశిలాఫలకముపై సాక్షాత్కరించునది యేమియో తెలియునా? అదియే పరమేశ్వరుని పవిత్ర పాదముద్ర. దాని దర్శన మొనరించుట ఎంత సుకృతము? సిద్ధులు దానిని దివ్యపుష్పములతో పూజింతురు. దానిని దర్శించినవారి భవబంధ

ములు తెగిపోవునట! అచటి గిరిరాజ రామణీయక విశేషములు తనివితీర చూచి అటుపైని పరశురాముడు కొట్టిన క్రౌంచరంధ్రపు ద్వారమున ఉత్తర దిశగా పోయితిమేని, అచ్చటనే అచ్చరల అందమున కద్దము పెట్టు కైలాసపర్వతమును కనుగొందుము. ఆ కైలాసమున నొక విచిత్రము చూడగలము!

నీరునిండిన మేఘుడు అచట నలవోకగా కొంతసేపు నిలుచును. సురసుందరీమణులు చేతి కంకణపు టంచులతో ఆతని శరీరమును గీతురు. జిల్లున జలయంత్రమువలె నీరు చిమ్మును. వారు నవ్వుచు నీళ్ళు చిమ్ముకొందురు. మేఘుడు గట్టిగా ఉఱిమి బయటపడును.

ఆ కైలాసపు టొడిలోనే మేఘునకు గమ్యమైన అలకాపురి కన్నులకు పండువు సేయుచు నిలిచియున్నది.

సృష్టిలీల, ప్రకృతిహృదయము కాళిదాసునకు సాక్షాత్కరించినంతగా మఱి యే సంస్కృతకవికిని దర్శనమిచ్చినట్లు కాన్పించదు. ఈ ప్రకృతితోడి ఆత్మీయత మేఘదూతములో సర్వాంగీణముగా వికసించి దర్శనమిచ్చును.

మేఘదూతమునందలి పర్వతములు—పర్వతములు కావు. అవి కృతజ్ఞతతో తను కుపకృతిచేసిన మిత్రులను శిరసావహించు మిత్రులు. నదులు—నదులుగావు. విరహకృశాంగులై తమ ప్రియుని యెదుట విభ్రమములు చూపు రమణీమణులు. నగరి—నగరికాదు. పర్వతప్రియు నొడిలో ముదుఱ్ఱుగుఱ్ఱు మోహనాంగి. మబ్బు మబ్బుగాదు, అది సంతప్తజనులకు నేకైక శరణము, విరహిణులైన నదీప్రేయసులను వలచి వలపించు రసజ్ఞశిఖామణి.

ఈ గుణవిశేషములచేతనే మేఘదూతము ఖండకావ్యజగత్తులో అనన్యసాధారణమైన పీఠము నాక్రమించి రాణించుచున్నది.

మల్లినాథుడు దీనికి వ్యాఖ్య వ్రాయుచు 'సీతకు రాముడు హనుమంతుని ద్వారా పంపిన సందేశము మనస్సున కదలి కవి ఈ కావ్యమును రచించెననియు అక్కడక్కడ అద్రి, నగర నదీసముద్రాది వర్ణనము లుండుటచే ఇది మహాకావ్య మగుననియును' వ్రాసెను. పరిశీలింపగా ఈ మాటలు స్థూల దృష్టితో పల్కినవిగాని సూక్ష్మాంశములు పరికించి చెప్పినవిగా కన్పట్టవు.

రఘు, కుమార, కావ్యములకు పురాణకథలు మాతృక లయినట్లే మేఘదూతమునకును బ్రహ్మవైవర్తపురాణమునందలి యొక కథ ఆధారమైనట్లు కన్పట్టుచున్నది. ఆ కథప్రకారము –

మేఘదూత కథానాయకుని పేరు హేమమాలి. ఆతని భార్యపేరు విశాలాక్షి. యక్షప్రభువైన కుబేరునొద్ద హేమమాలి యుద్యోగము, ప్రతిదినము ప్రాతఃకాలముననే శివపూజకు మానస సరస్సునుండి సువర్ణకమలములు దెచ్చుట.

ఒకనాడు హేమమాలి యథావిధిగా స్వర్ణపద్మములుతెచ్చి మనసు పట్టలేక భార్య విశాలాక్షి కేశబంధములో నలంకరించెను. శివపూజకు కాలాతీతమై కుబేరుడు పూలకై కబురంపెను. హేమమాలి చట్టున భార్య తలనుండి పువ్వులు తీసి శివపూజకు సమర్పించెను. కుబేరుడు పూజ చేయుచుండగా ఆ సరోజములలో నొక శిరోజము గన్పించెను. వెంటనే యక్షరాజు మండిపడి యతనకు నిరవధిక భార్యా వియోగమును, కుష్ఠరోగమును ప్రాప్తించునట్లు శపించెను.* దానితో

---

* 'రే పాప, దుష్ట దుర్వృత్త
కృతవాన్ దేవహేళనమ్
అతో భవ శ్విత్రయుక్తః
వియుక్తః కాంతయా సహ।
అస్మాత్ స్థానాత్
అపధ్వస్తః
గచ్ఛ స్థాన మధాధమమ్॥

—బ్ర. వై. పురాణము

యకుడు తన మహిమల నన్నియు నుడిగి భూలోకమునకు వచ్చి పడెను. అంత నాతడు మతిచెడి అడవులవెంట తిరుగుచు మార్కండేయాశ్రమము చేరి ఆతని యుపదేశమున ఆషాఢ బహుళ ఏకాదశి నాడుపవసించి పరమేశ్వరునారాధింపగా భగవదనుగ్రహమున ఆతడు వియోగరోగముల రెండింటి నుండియు విముక్తుడై పూర్వస్థితి నందెను.

కాళిదాసు ఈ కథలోని రసహీనములైన నిరవధిక వియోగ కుష్ఠరోగ వృత్తాంతములను పరిహరించి ఇందలి కావ్యానుకూలమగు వస్తువును గ్రహించి మేఘదూతమును రచించెనని ఎంచవచ్చును.

ఈ కావ్యమున అక్కడక్కడ కొంచెము నగర నదీ సముద్రాది వర్ణనము లున్నంతమాత్రముచే మహాకావ్యమనుట సరికాదు. విశాలమైన ఇతివృత్తముగాని, పాత్రచిత్రణముగాని ముఖ్యరస సన్నివేశముగాని లేని లఘు కావ్యమును బట్టుకొని శాస్త్రసిద్ధికై మహాకావ్యమనుట యుచితము గదు. సాహిత్య దర్పణకారుడు చెప్పినట్లు దీనిని ఖండకావ్యమనుటయే లెస్సయైన మాట.*

మేఘదూతపు ముగింపులో నొక చమత్కారమున్నది. తెలుగులిపిలో ముద్రితమైన మేఘదూత ప్రతులలో 'ఏతత్కృత్వా' అను శ్లోకమునకు తర్వాత మఱి రెండు శ్లోకము లున్నవి. వానిలో మేఘుడు వెళ్లి సందేశమును జెప్పినట్లును, ఆ వృత్తాంతము విని కుబేరుడు దయదలచి శాపము నుపసంహరించి, ఆ దంపతులను కలిపెననియు ఉన్నది. ఈ ముగింపు సుఖాంతచ్ఛాందసులు కల్పించినదిగాని మహాకవిరచనము గాదు. జడమైన మేఘముచే సందేశము చెప్పించుటయే కవి ఉద్దేశమైనచో 'ధూమజ్యోతి' అను ప్రతిపాదనము నిరుపయోగము. అంతియేకాక తుదిని పల్కిన 'ప్రత్యుక్తం హి ప్రణయిషు సతా మీప్సితార్థక్రియైవ' అను మాటలో 'నీ ప్రత్యుత్తరము నేను కోరను' అనియే భావము గదా!

రఘు, కుమారకావ్యములవలెనే మేఘకావ్యము కూడ అనూహ్య పరిసమాప్తి గనుటలోనే చమత్కారాతిశయమున్నది. ఇట్లు కావ్యము ముగించుటయే కాళిదాసు పరిపాటి. మంగళాంతము కావలయునన్నచో సమాప్తి శ్లోకమందలి 'మాభూ దేవం క్షణమపిచ తే విద్యుతా విప్రయోగః' అను మాటలోనే ఆ యర్థము సిద్ధించును.

ఇంతవరకు కాళిదాసమహాకవి రెండు మహాకావ్యముల రెండు ఖండకావ్యముల కథానిర్వహణ రసవిన్యాసవైఖరులలో కౌశలమును, విహంగవిలోకనప్రాయముగా చూచినారము. ఈపైని అతని ప్రకృతిదర్శన వర్ణనాచాతుర్యములను, రచనారామణీయకమును, తత్కాలీన సామాజిక రాజకీయవ్యవస్థలను, కవీంద్రుని వ్యక్తిగత జీవనవిశేషములను పరిశీలింపగలము.

---

* ఖండకావ్యం భవేత్కావ్య స్యైకదేశానుసారి చ — సా. ద.

# చలిమంట!

శ్రీ ఇలపావులూరి శేషగిరిరావు

ఇంకా వర్షం కురుస్తోంది!
శంకల శీర్షం తడుస్తోంది!
ఎన్నడో మొదలైన యీ జడివాన
ఇన్నాళ్లూ వుండవలసిందేనా?

ఎప్పుడు తగ్గుతుం దీ మంటల దలి!
తిప్పలు పెడుతున్నది నేటి వలి।
గుడిసెలోకి నీరు వచ్చేసింది!
గూటాన నిలువ లేకున్నది వంది!
పొడిగావున్న కాస్త పొయ్యిలో
పడుకోనుంది, పిల్లి పాడుది!

చేటలోని నూకల నిండా
చెదలు రాలిపడి నిండింది!
చిదుగులన్నీ చెదరి చెల్లాచెదరై
చెడువానకు తెగ తడిసినై!

మూడుకాలాలనూ గుత్తకు గొన్న
మొనగత్తె ఆకలి పెరుగుతున్నది!
బయటి కశ్మలాన్ని చూచిన, మూసినకళ్ళకు
లోపలి చిచ్చులతో వాతలు పడుతున్నాయి!

చీకటిని చీల్చటం చేతగాని యీ చేతిదివ్వె
కండ్లులేని కబోదిగా బ్రతుకలేక –
అద్దమరేతిరి కాడ నిద్దరోయింది।

## చలిమంట!

అసలు సిసలు చీకటిలో కురిసే యీ చినుకులు
సగటు మనిషి ఆశల అంగీమీద పడ్డ చినుగులు

దిశలకు తెలివి చూపే యీ యీదరగాలి
మొగుణ్ణి తన్ని మొర్రో అనే మగనాలి।
పేగులు పోట్లాడుకుంటున్నాయి హుందాగా!
రేగులు కొట్లాడుకుంటున్నాయి సరదాగా?
రోగం నయమయే దెప్పుడు?
దుర్యోగం ముప్పు తప్పే దెప్పుడు?

చందమామ నందుకొంటున్నా
వందిమాగధం కొనసాగుతున్నా
పందిరికి గుంజలు చిక్కనే లేదు!
సుందరికి కోక కొనిపెట్టనే లేదు।

వరదల్లో చిక్కుకున్న గుడిసెకు
వానలో తడుస్తూన్న మడిసికి
తోడుగా కావలసింది చలిమంట।
అదే ఈ గుండెల్లో కొలుములజంట।

ఇంకా వర్షం కురుస్తోంది!
ఎప్పుడు తగ్గుతుందీ చలి!
కాలం కంకాళం వగరుస్తోంది।
ఎప్పుడు పోతుందీ నరబలి!।

---

# కాటమరాజు కథాచక్రము

డా. తంగిరాల వెంకటసుబ్బారావు

తెలుగు వీరగాథాసంపదలో పల్నాటివీరగాథల తరువాత పేర్కొనదగినవి 'కాటమరాజు కథలు'. వీనికి 'యాదవరాజుల కథలు, యాదవ భారతము, యుద్ధశాస్త్రము' అను నామాంతరములు గలవు. ఇవి ఆంధ్రదేశమునందంతటను పాడబడుచున్నప్పటికిని, నెల్లూరు మండలమున – అందునను దర్శి, కనిగిరి, కందుకూరు, ఉదయగిరి ప్రాంతములందు ఈ కథలకు విశేష ప్రచారమున్నది. గుంటూరు, కడప, కర్నూలు మండలములందును కాటమరాజు కథల కాదరము మెండు.

పల్నాటి వీరకథల వలెనే యివియును చారిత్రక వీరగాథలు (Historical Ballads). పల్నాటి వీరకథలు క్రీ. శ. 12 శతాబ్దమున జరిగిన సంఘటనలు కాగా, ఈ కాటమరాజు కథలు 13 వ శతాబ్దము నాటివి. ఇవి మొత్తము ముప్పది రెండు కథలున్నవని, యాదవగాథాకారుల వలన తెలియుచున్నది. ఈ కథలన్నియు కాటమరాజునకును, అతని సోదరసోదరీమణులకును, పితృపితామహులకును సంబంధించిన ప్రశస్త సాంప్రదాయక వీరగాథలు. ఈ ముప్పదిరెండు వీరగాథలును చక్కని వరుసక్రమమున నొక పెద్ద కథాచక్రముగా నేర్పడియున్నవి. దీనిని 'కాటమరాజు కథాచక్రము' అనవచ్చును. ఈ కథాచక్రము ఐతిహాసిక దశకు మిక్కిలి దగ్గరలో నున్నది.

'కాటమరాజు కథ—కాటమరాజు కథ' అనుటయేకాని, దీనిని గూర్చిన సంపూర్ణ విషయములేవియును తెలుగు సాహిత్య లోకమునకు నేటివరకును తెలియవు. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున ఆరు కథ లున్నవి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనవలన ఇందలి కథలు నాలుగు ముద్రింపబడినవి. ఇవితప్ప తక్కినవేవియును ఆంధ్రసాహిత్య సంసేవ్యులకు తెలియవు.

'కాటమరాజుకథ' అను ఏకవచన ప్రయోగము తప్పు. ఏలయన –ఇది ఒకేఒక్కకథ కాదు; ముప్పదిరెండు కథల సువిశాల చక్రము. ఈ చక్రములోని ప్రధాన వ్యక్తి కాటమరాజయినను, ఈ ముప్పదిరెండు కథలలోను ఏ కథకును 'కాటమరాజు కథ'అనిపేరు లేకపోవుట ఆశ్చర్యకరము. ఇవి వీరగాథాచక్రమని సూచించుటకే కాబోలును, జానపదులు 'కాటమరాజుకథలు'అను బహువచన రూపమునే వాడుచున్నారు. పల్నాటివీరకథలును, కాటమరాజు కథలును వీరగాథావృత్తములని తెలిసియే కాబోలును, బ్రౌనుదొరగారు వీని చివర 'చరిత్ర' అను శబ్దమును చేర్చి ప్రయోగించినారు. ('పల్నాటి వీరచరిత్ర', 'కాటమరాజు చరిత్ర'). వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'కాటమరాజుకథ'అనుపేరుతో సంగ్రహితము చేసినది నిజమునకు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'అను నొక్కవీరగాథ మాత్రమే! వేటూరి వారి ఛాత్రులు డాక్టర్ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు ఈ 'కాటమరాజుకథ' కాటమరాజు చరిత్రను సంపూర్ణముగా నభివర్ణించు గ్రంథమని ప్రశంసించిరి. (చూ. వారి 'కాటమరాజుకథ'అను వ్యాసము, ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక, 1953–54, పుటలు 33—56.) ఇది ప్రామాదికము. వేటూరివారిచే పరిష్కరింపబడి 'కాటమరాజుకథ'గా ప్రకటితమైన ఆకథ కాటమరాజు కథాచక్రమున నొకభాగము మాత్రమే! ఈ కథా

చక్రము, కాటమరాజు పితామహుడగు 'వల్లురాజు కథ'తో ప్రారంభమై, కాటమరాజు సోదరుడగు 'భక్తిరన్నకథ'తో నంతమగును. ఈ రెండు కథలకును మధ్య అనేక కథలున్నవి వానిలో 'ఎఱగడ్డపాటి పోట్లాట' యొకటి. ఇదియే కాటమరాజు 'వృత్తాంతమును దొలినుండి తుదివాక నభివర్ణించు' చున్న దనుట పొసగదు.

ఈ కాటమరాజు కథాచక్రమున ముప్పది రెండు కథలున్నవని చెప్పుటయేకాని, ఆ ముప్పది రెండు కథల నామములను వరుసగా చెప్పగల గాథాకారు డెవ్వడును నాకు తటస్థపడలేదు. మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయమున పల్నాటి వీరకథ లెక్కువగా నున్నవికాని, కాటమరాజు కథలుమాత్రము చాల తక్కువగ నున్నవి. ఇందున్న మొత్తము కథలు ఆరు మాత్రమే. గురువర్యులు డాక్టర్ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచికలో మద్రాసు గ్రంథాలయమునగల ఈ ఆరు కథలనుగూర్చి విపులముగా చర్చించియున్నారు. వేటూరివారు పరిష్కరించిన 'కాటమరాజు కథను' 1953 లో మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయమువారు ప్రకటించియున్నారు. దీనికి మల్లంపల్లి సోమశేఖర శర్మగారు పీఠిక వ్రాయుచు, ఈ కథా చక్రమున నింకను మరికొన్ని కథలు ఉండియుండుననియు, అవి మదరాసు గ్రంథాలయమునందు సహితము లేవనియు, ఒక చక్కని ఊహను వెల్లడించియున్నారు.

'The story proper or the section, dealing with the original agreement and the cause of the quarrel, is not found here in this work. Hence, it seems, that there should be some more sections in this work which even the Government Oriental Library does not possess.'

(—కాటమరాజుకథ, ఆంగ్లపీఠిక, పుట vii.)

సత్యాన్వేషణము పరిశోధకుల లక్ష్యము. అట్టి అన్వేషణమున నూటికి నూరుపాళ్లను కృతార్థులైనవారు మల్లంపల్లివారు. వారు పైన వెలిబుచ్చిన ఊహయే నాకు కరదీపికకాగా ఈ కథాచక్రమునందలి తక్కిన వీరగాథలను సంపాదించుటకు నడుముకట్టి ఆంధ్రదేశమంతయును శోధించితిని. యాదవవృద్ధుల ననేకులను సంప్రదించితిని. ఆంధ్రదేశమున వివిధప్రాంతములందు గల గాథాకారులను (Minstrels) కలసికొంటిని. సుమారు ఇరువదివరకును తాళపత్రగ్రంథములను సంపాదించితిని. ఈ త్రివిధపరిశీలనముతో ఈ కాటమరాజు కథాచక్రమునగల ముప్పదిరెండు వీరగాథల నామములను చాలభాగము నిర్ణయింపగలిగితిని. నాకు తెలిసినంతవరకును కాటమరాజు కథాచక్రమున ఈ క్రింది వీరగాథ లున్నవి:—

1. 'వల్లురాజుకథ' (లేక 'వలురాజుకథ' లేక 'ఆవుల వలురాజుకథ.')
2. 'పంపాద్రికథ.'
3. 'పెద్దిరాజుకథ.'
4. 'సింహాద్రిరాజుకథ.'
5. 'ఎఱనూకరాజుకథ.'
6. 'నలనూకరాజుకథ.'
7. 'పోలురాజుకథ' లేక 'శివపురాణము'; దీనిలో ఆరు 'చాటువలు' (అనగా కాండములు) కలవు:

(౧) 'చంద్రగుప్తుని చాటువ.'
(౨) 'మల్లికాదేవి చాటువ.'
(౩) 'ముక్కంటిచాటువ' లేక 'బ్రాహ్మణ చాటువ.'
(౪) 'జంగాల చాటువ.'
(౫) 'కపోత చాటువ.'
(౬) 'గయుని చాటువ.'

8. 'బల్లికురువ పోట్లాట.'

9. 'కతియావులరాజుకథ.'

10. 'కాటమరాజుకు పట్టంకట్టినకథ' (లేక 'కాటమరాజు పట్టాభిషేకము.)

11. 'పాపనూకకథ.'

12. 'ఆవులమేపు' : దీనికి మూడు నామాంతరములు గలవు : 'ఉత్తరాది ఆవులమేపు'; లేక 'కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు'; లేక 'ఆవులమేపులు—ఉత్తరకాండము'. (ఇక్కడ 'ఉత్తర' అనగా 'ఉత్తర దిక్కు' అని అర్థమేకాని, 'తరువాతది' అనెడి అర్థముకాదు. అందువలననే దక్షిణదిశలో ఆలను మేపిన కథకు 'ఆవులమేపులు—దక్షిణకాండము' అని పేరుపెట్టినారు.)

13. 'పాలేటికథ' లేక గంగతర్కము' లేక 'గంగ—కాటమరాజు తరకవాదము.'

14. 'ఎఱ్ఱయ్య తరకవాదము.'

15. 'జన్నినాడకథ'—దీనికి నాలుగు నామాంతరములు : 'చదరంగంకథ' 'పుల్లరికథ'; 'దక్షిణాది ఆవులమేపు'; 'ఆవులమేపులు—దక్షిణకాండము'.

16. 'భట్టు రాయబారము' లేక 'కల్లి రాయబారము.'

17. 'కోటపాటి తాటివృక్షంతెచ్చే కథ.

18. 'బొంగరాల కథ' — దీనికి మూడు నామాంతరాలు : 'ముమ్మయ్య—పోచయ్య బొంగరాలు' 'వేడుక బొంగరాలకథ'; 'అలుగులపోలు.'

19. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' — దీనిలో ఏడు కాండలున్నవి :

(అ) 'చల్లావారి జగడము' లేక 'తిక్కనామాత్యునికథ' లేక 'ఊర్లమానికథ'

(ఆ) 'బొల్లావు జగడము.'

(ఇ) 'బీర్నీడు యుద్ధము.'

(ఈ) 'కతియావులరాజు యుద్ధము.'

(ఉ) 'బాలరాజుల యుద్ధము.'

(ఊ) 'ఆవుల యెద్దుల జగడము' 'ఎఱ్ఱయ్యల యుద్ధము.'

(ఎ) 'కాటమరాజు యుద్ధము.'

20. 'అగుమంచికథ.'

21. 'భక్తిరన్నకథ.'

పై కథలలో 'సింహాద్రిరాజుకథ', 'ఎఱనూకరాజుకథ', 'నలనూకరాజుకథ'—అను మూడు వీరగాథలు తప్పతక్కినవన్నియును నాకు లభించినవి. ఈ మూడు కథలకును ప్రచారము తక్కువ. అందుచే లభించుట కష్టము ఇంకను 'అగుమంచి వలపోత'; 'పాపనూక వలపోత'; 'గంగ పుట్టుక'; 'పల్లికొండ పుట్టుక'—అను మరి నాలుగు వీరగాథ లున్నవని తెలియుచున్నది. ఇవి నిజముగా లోకమున నున్నవో లేవో చెప్పలేను. కాటమరాజుకథలతో బాటు యాదవగాథాకారులు తరచుగా పాడుచుండు 'కంసుడు కథ' లేక 'కృష్ణభాగవతము' ('విష్ణుభాగవత' మనియు దీనికి పేరున్నది.) అను పౌరాణిక వీరగాథనుగూడ దీనికి చేర్చవలెనని కొందరు చెప్పుచున్నారు. కాటమరాజు విష్ణుమూర్తి యవతారమే కావున 'కృష్ణభాగవతము' కాటమరాజుయొక్క పూర్వజన్మకథ యగును.

ఈ విధముగా పైన తెల్పిన 21 కథలకు 'అగుమంచి వలపోత, పాపనూక వలపోత, గంగ పుట్టుక, పల్లికొండ పుట్టుక, కంసుడు కథ'—అను నైదు వీరగాథలను జేర్చినచో మొత్తము 26 వీరగాథ లగును. ముప్పదిరెండుకు ఇంకను ఆరు కథలు తగ్గుచున్నవి. 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'లోని ఏడు కాండ లను ఏడు ప్రత్యేక వీరగాథలుగా భావించినచో ఈ చిక్కు తొలగిపోవును. (ఈ కాండ లేడును ప్రత్యేక వీరగాథలవలెనే పాడబడుచుండును.) అప్పుడు కాటమరాజు కథాచక్రములోని మొత్తము వీరగాథలు ముప్పదిరెండగును. లేదా 'అగుమంచి వలపోత' మొదలగు నాలుగు కథలను ఈ కథాచక్రమున లేవనియు,

'కన్నెనికథ' దీనికి చేర్చరాదనియు భావించినచో, 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'ను ఏడు ప్రత్యేక గాథలుగా నిర్ణయించుటతోబాటు 'పోలురాజుకథ'నుగూడ ఆరు ప్రత్యేక గాథలుగా తలంపవలెను. అప్పుడు కాటమరాజు కథాచక్రమున ముప్పదిరెండు కథల సంఖ్య సరిపోవును. 'బొంగరాలకథ'లోను, 'భక్తిరన్నకథ'లోను వచ్చిన ప్రసక్తినిబట్టి 'భైరవకురువయుద్ధము' అను వీరగాథ కలదను అనుమానము వచ్చుచున్నది. ఇది సింహాద్రిరాజు అల్లుడగు 'కల్లందుల పోల్నీడు' (చిట్టినూకభర్త) చేసిన యుద్ధక్రమమును తెలుపుకథయై యుండును.

1909 లో బత్తుల లక్ష్మయ్యగారు రచించిన 'రాజవంశప్రదీపిక'యను గ్రంథమును బేతపూడి జోగిసూర్యప్రకాశరావుగారు (తెనాలి) ప్రకటించినారు. ఇందు కాటమరాజు కథాచక్రమున వచ్చు యాదవవీరుల ప్రసక్తి కొంత కలదు. 1917 లో 'కాటమరాజుకథ'అను ద్విపదకావ్యము ముద్రింపబడెనని ఆంధ్ర వాఙ్మయసూచి (పుట 94.)ను బట్టి తెలియుచున్నది. ఇది 'నందుల కాటమరాజు'అను కవిచే రచింపబడి, యం. సంజీవకవిచే పరిష్కరింపబడినదట. ఇది నేడు అలభ్యము. 1926వ సంవత్సరమున ఆంధ్ర యాదవసంఘము వారు (ఏడవూరు.) గుఱ్ఱముకొండ భక్తవత్సలకవి రచించిన 'కటియావుల కాటమరాజు చరిత్ర'ను పద్యకావ్యమును ప్రకటించిరి. ఇందు పెద్దిరాజు కథ మాత్రమే చెప్పబడినది. ముదిగొండ వీరభద్ర కవి తన పద్యకావ్యమున పల్నాటి వీరచరిత్ర నంతటిని వ్రాసినట్లుగా ఈ కవి కాటమరాజు సంపూర్ణ చరిత్రను తన పద్యకావ్యమున వ్రాయకపోవుట విచారకరము.

1947 జనవరినెలలో శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు క్రీ. శ. 1000–1500 మధ్యకాలమున ఆంధ్రదేశమును పాలించిన సామంత రాజవంశములచరిత్రనుగూర్చి పరిశోధించి, ఆ పరిశోధనావ్యాసమును మద్రాసువిశ్వవిద్యాలయమునకు సమర్పించిరి. అందు 'ఎఱ్ఱగడ్డపాడు, అలవలపాడు'లను పాలించిన యాదవులనుగూర్చియు, నెల్లూరు నేలిన తెలుగు చోడులనుగూర్చియు చక్కగా వివరించిరి.

శ్రీహరి ఆదిశేషువుగారు మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారములోని కాటమరాజుకథలను గూర్చి 1953 లో కొంత విమర్శచేసిరి. (చూ. వారి 'జానపదగేయ వాఙ్మయపరిచయము', పుటలు 23–29.) ఇందు వీరు ఖడ్గతిక్కనయుద్ధమును మాత్రమే ఎక్కువగా చర్చించినారు. ఈ కథ క్రీ. శ. 1170 లో జరిగినదనియు, ఇది పల్నాటి యుద్ధముకన్న ప్రాచీనమైనదనియు వీరు వ్రాయుట సహేతుకముగాలేదు. ఇదే సంవత్సరము డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు మదరాసులోని కాటమరాజుకథాప్రతులనుగూర్చియు, ఇతర విశేషాంశములనుగూర్చియు నొక అత్యుత్తమవ్యాసమును ప్రకటించిరి. ఇందు 'కాటమరాజుకథ, భట్టురాయబారము, కోటపాటి తాటివృక్షంతెచ్చేకథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, వల్లురాజుయుద్ధము, అగ్గమంచి కథ'–అను నారు వీరగాథలనుగూర్చి వీరు సాకల్యముగా చర్చించిరి. (మదరాసు గ్రంథాలయమునగల కథ లియారు మాత్రమే ఇందలి చివరి రెండు కథలను నేడు తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనాసంస్థవారి లిఖితపుస్తక భాండాగారమునకు తరలింపబడినవి). మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమువారు వేటూరివారు పరిష్కరించియుంచిన 'కాటమరాజు కథ'ను మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పీఠికతో 1953 లోనే ప్రకటించిరి. ఇందులో ఒక ప్రధాన కథ, మూడు అనుబంధకథలును గలవు. ప్రధాన కథకు 'కాటమరాజుకథ'అని పేరిడిరి. కాని యిది నిజమునకు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'; అనుబంధ కథలలో 'భట్టురాయబారము', 'కోటపాటి తాటివృక్షంతెచ్చేకథ', 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'–అను మూడు కథలున్నవి. ఈ లనుబంధమందలి ఎఱ్ఱగడ్డ

పాటి పోట్లాటకును, ప్రధాన కథకును సంబంధము లేదు. ఇవి రెండును భిన్నకవుల రచనలు. ప్రధాన కథారచయిత కొమనాలగోత్రమునకుచెందిన, గంగుల పినయెల్లయ. ఇతని తండ్రి యెల్లయ్య, సోదరుడు సర్వన. అనుబంధములోని కథలను రచించినవారి పేర్లు తెలియుటలేదు. జానపదగేయములపై పరిశోధన సలిపిన డా॥ బి. రామరాజుగారు ఏలనో ఈ ముద్రితగ్రంథములోని నాలుగు కథలను మాత్రమే ముచ్చటించి యూరకొనిరి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పుత్రుడు శ్రీ ఆనందమూర్తి 1955 లో పరిశోధన సంచికలలో (5, 6, 7) 'అగుమంచి కథ'ను ప్రకటించిరి. ఇది కాటమరాజు కథాచక్రమున చివరి భాగమునకు చెందినది.

1962 లో గోవుల నాగేశ్వరకవి 'మదన కుంభినీ యుద్ధము అను పెద్దిరాజు నాటకము'ను రచించెను. దీనిని కనిగిరికి చెందిన మద్దెబోయిన రోశయ్యగారు ప్రకటించిరి. ఇదికూడ భక్తవత్సల కవి పద్యకావ్యమువలెనే పెద్దిరాజు కథనుమాత్రమే వర్ణించుచున్నది. (ఇందు 'పంపాద్రికథ'లోని చివరి భాగముకూడ కొంత ప్రసక్తమైనది)

1967 లో (10—5—'67) ఆంధ్ర యాదవ సంఘ ప్రధాన కార్యదర్శియు, ఉత్తమ సంస్కారియు, వృద్ధయాదవుడునగు శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు (తెనాలి తాలూకా, ఎడవూరు గ్రామము) 'వలురాజు చరిత్ర' అను వీరగాథను ప్రకటించిరి. ఇది కాటమరాజు కథాచక్రమున మొట్టమొదటి వీరగాథ. దీని రచయిత 'మద్దులేటికవి' అని తెలియుచున్నది. మదరాసు గ్రంథాలయమున 'వల్లురాజు యుద్ధ'మను పేరుగల కథ నిజమునకు వల్లురాజుకథకాదు. అది ఆద్యంత రహితమైన పోలురాజుకథ మాత్రమే. ఈ సంవత్సరములోనే—అనగా 19—7—1967 న శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు 'బల్లికురువ యుద్ధము'ను గూడ ప్రకటించిరి.

ఈ కాటమరాజు కథలలోని చారిత్రకాంశములను గూర్చియు, ఇతర విశేషములను గూర్చియు వేరొక వ్యాసమున వివరింతును.

---



# తెనుగు నవల తెన్నులు

కుమారి జి. లలిత

[తెనుగు నవలల్ని సౌలభ్యం కొరకు మూడు తరాలుగ విభజించాను. శ్రీ కందుకూరి వారి దగ్గరనుండి 1935 సం. ప్రాంతాలవరకు తొలి తరముగ, అప్పటినుండి 1960 సం. వరకు మలి తరముగ, అక్కడనుండి ఇప్పటివరకు ఇప్పటి తరముగ విభజింపబడినది. నవలలను గురించి ఇంతకు ముందున్న విమర్శకుల అభిప్రాయాల్ని పొందుపరుస్తూ, వాటితో నా అభిప్రాయాల్ని జతపరచాను.]

కథలు మనకు క్రొత్తకాదు. మానవుడు దినమంతా శ్రమించి చల్లని సాయంసమయాన్నో, లేక తెల్లనివెన్నెలవెలుగులోనో సేద తీర్చుకునేటప్పుడు అతని మనసు ఈ లోకబంధాల్ని తెంపుకొని ఊహాప్రపంచంలో విహరించేది. ఆ భావనా జగత్తులో అతడు తనకు సుఖదాయకమని తోచిన వానినెల్ల ఊహించటమేకాని ఇది సాధ్యమా కాదా అన్న ఆలోచనకే అక్కడ తావులేదు. అందుచేత ఈ కథలు కథకుని కల్పనాశక్తిని, భావనాబలాన్ని అనుసరించి రసమయంగా ఉంటాయి. పిన్నలూ, పెద్దలూ అన్న తారతమ్యం లేకుండా కథలతో వినోదించి, ప్రొద్దుపుచ్చుతారు. కథ ఎంత అద్భుతంగా ఉంటే అంత ఆనందం, ఎంత దీర్ఘంగా వుంటే అంత ఓపిక, ఎంత చిక్కగా ఉంటే అంత ఉత్కంఠ కలుగుతై. అయితే పేదరాసి పెద్దమ్మ కథలకిన్నీ, మనమిప్పుడు ప్రస్తావింపనున్న నవలలు అనే వాటికిన్నీ సామ్యం కన్న భేదమే అధికం. నవలకుండవలసిన ప్రధాన గుణం వాస్తవిక జీవిత చిత్రణ. కథలయొక్క వేళ్ళు కల్పనాజగత్తులో పాతుకొని ఉంటే, నవలయొక్క మూలాలు సంఘంలో నాటుకొని వుంటై. కథలోని ఔత్సుక్యంతో పాత్రపోషణని మేళవించి సమకాలిక నాగరికతను ప్రతిబింబిస్తూ వ్రాయబడేదే నవల. అందుచేతే తదితర వాఙ్మయ ప్రక్రియలకన్నా నవల సాంఘిక జీవితానికి సన్నిహితంగా వుండి, వాస్తవికంగా సమాజాన్ని చిత్రిస్తుంది. అత్యద్భుతమైన మానవ జీవితంలోగల సంచలన ఆవేగాల్ని అవగాహన చేసుకుందామని ప్రతివ్యక్తికీ, ప్రతిదేశంలోనూ ఉండే ఆసక్తే నవల ఉత్పన్నం కావడానికి బీజం. మనదేశంలోని సాంఘిక జీవితం సంప్రదాయబద్ధంకావటం, క్రొత్తకు, మార్పుకు ఆట్టే అవకాశం లేకపోవటం, స్త్రీ పురుషుల కలయికకున్నా ఆ రెండు జాతులు సాధ్యమైనంత దూరంగా మసలుకోవటం, ఇత్యాదికారణాలవలన, 'నవల' అన్న ప్రక్రియ మన భారతీయ వాఙ్మయాలలో అధునాతనంగానే ఆవిర్భవించింది. వ్యక్తిగత గౌరవం హక్కులు గుర్తించగలిగిన సభ్యసంఘం ఉంటేనే నవల రాణిస్తుంది. అందుకే తదితర భారతదేశంలాగే ఆంధ్రదేశంకూడా పాశ్చాత్యవాఙ్మయ ప్రభావం ప్రసరించేవరకు నవల కొరకు వేచి వుండవలసి వచ్చింది.

అది రాజులు, రాజ్యాలు సమసిపోతున్నకాలం. క్షణక్షణం ఖండఖండాంతరాల్లో మానవుడు మానవుడుగా మసలడానికి పాటుపడుతున్నకాలం. ఆనాటి ప్రపంచంయావత్తూ స్వాతంత్ర్యంకొరకు తపించిపోయింది. సంఘంలోనూ, జాతిలోనూ, దేశంలోనూ, ప్రభుత్వంలోనూ పిపీలికాది బ్రహ్మ

పశ్చిమము ఆనాడు విప్లవమే దృగ్గోచరమైనది. స్వాతంత్ర్యం లభిస్తేనేగాని ఆ మహావేశం చల్లారేలా కనుపించలేదు. ఈ విప్లవంకారణంగా ప్రపంచమంతటా ధనికవర్గాల దౌర్జన్యం, ధాష్టీకం అపహతం అవుతూ అట్టడుగునవున్న ప్రజల అంతస్తు గుర్తింపబడసాగింది. ఈ రెండువర్గాల అంతరాల్ని అదృశ్యంచేస్తూ మధ్యతరగతి ఒకటి వంతెనకువలె ఆవిర్భావం చెందింది. ఈ మధ్యతరగతే 'నవల'అన్న ఈ నూతనప్రక్రియకు వెన్నెముక.

సాహిత్యానికి సదా సమాజమేకదా ఆలంబనమౌతున్నది! కాని ప్రాచీనకవికి కావలసింది ఒక్క కృష్ణదేవరాయలు; ఒక సంఘంకాదు. ఒక్కఆస్థాన పండితమండలి; అతని కవితను ఆలకించి, అర్థం చేసుకొని ఆనందించవలసింది సమాజంకాదు. ఒక్క విద్వద్బృందం. అందుచేత ఆనాటి కవిదృష్టి సామాన్యమానవునిపై పడలేదు. మొదటినుండి నవల నాకర్షించింది సామాన్యమానవుడే.

ఆనాడు ఆంధ్రదేశంకూడా ఈ స్వాతంత్ర్య పిపాసతో అట్టుడికినట్లుడికింది. అద్యతన భావ ప్రపంచంతో, ఐరోపీయనభ్యతతో సంపర్కం కలిగిన తరువాత మనలోకూడా స్వతంత్రతావాంఛ పెరిగి, సంఘంలో కదలిక పుట్టింది. ఈ స్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తున్న నినాదాలతో కంఠం కలిపి పాడడమే కవుల, రచయితల విధ్యుక్తధర్మంగా అవభాసించింది. ఈ మహావేశంలోనే, ఈ స్వాతంత్ర్యదాహంలోనే తెలుగు తొలినవలకు పునాదులు పడ్డవి

తొలి తెలుగునవల సంఘసంస్కారోద్దేశంతో అవతరించటం హర్షింపదగ్గ విషయం. అప్పటివరకు సంప్రదాయంగా భావింపబడుతున్న బాల్యవివాహాలు, వర్ణాశ్రమధర్మాలు, విధవలపాట్లు, విగ్రహారాధన ఇత్యాదులు విమర్శకు గురియైనవి. స్త్రీ పునర్వివాహం, ప్రౌఢావివాహం, విగ్రహపూజానిరసనం వంటి సంస్కరణలు పురుషయత్నంవలన ఆరంభమైనవి...స్త్రీజాతి చదువుకొని స్వాతంత్ర్యం పొందాలనీ, కులభేదాలు పనికిరావని, వర్ణాశ్రమధర్మాలు అసహజమనీ, వ్యక్తిస్వాతంత్ర్యస్ఫోరకాలైన నూతన భావాలు బయలుదేరినవి. ప్రత్యక్షమే ప్రమాణమని, ఎవరికివారు స్వతంత్రవిచారణచేసి తమ అంతఃకరణ కనుగుణంగా నడచుకోవాలనీ సంస్కర్తలు ప్రబోధింపసాగారు. అప్పటివరకు పరమ ప్రమాణాలుగా పరిగణింపబడుతున్న శాస్త్రాలు హుళక్కి అవేసరికి సంఘంలో గగ్గోలు పుట్టింది. సాంఘికమైన ఈ విప్లవంలో సాహిత్యంకూడా చేయి కలిపింది. అనుకూల ప్రతికూల ప్రబోధాలు సాగాయి. తమ ప్రహసనాలతో ఈ సంస్కారబోధను ప్రారంభించిన శ్రీ వీరేశలింగం పంతులుగారు క్రమంగా, సాహిత్య రంగస్థలంలో ఈ నవల అనే కావ్యభేదాన్ని ప్రవేశపెట్టారు. ధర్మశాస్త్ర నిర్ణయాలుచేసే పండిత పరిషత్తులు మూలబడి, ఆంగ్ల విద్యాసంపన్నులు ఆంధ్రసాహితీ ప్రచారంలోనికివచ్చి నవల అనే ఈ నూతన సాధనం చేబట్టబడింది. అప్పుడప్పుడే మొనలెత్తుతున్న నగరవాసులకి క్రొత్తతరం ప్రజకు నవలలుచేసే ఉపదేశమే రుచింపసాగింది. అప్పట్లో సంఘ సంస్కారాన్ని ఉపదేశించటానికి నవలలే శరణ్యమైనాయి. పాతకాలపు ప్రజకు ఇవి రుచింపకపోయినా, నూత్న భావప్రపంచబుద్ధులైన ప్రాయగాండ్రుమాత్రం ఈ నవలలకు మంచినీటికి చేపలలాగ ఎగబ్రాకసాగారు.

శ్రీ వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రతో ప్రారంభమైన ఈ నవలల్లో స్వేచ్ఛను కోరే స్త్రీ పురుషులు తమ అంతఃకరణమే ప్రమాణంగా భావించి, సంఘం గీచిన గిరిలోనుండి విడివడి స్వసుఖాన్ని ఆశించటం కనిపిస్తుంది. బాల్యంలోనే భర్తల్ని పోగొట్టుకున్న నిర్భాగ్యురాండ్రు పుట్టినిళ్లల్లో పడే బాధల్ని, ముక్కుపచ్చలారని పసితనంలోనే పెండ్లయిన దంపతుల అననుకూల దాంపత్యంలోని అనర్థాల్ని హృదయవిదారకంగా వర్ణిస్తవి నవలలు. 'విద్యావిహీనులై సంప్రదాయబద్ధులైన

స్త్రీ పురుషుల సౌహార్ద్యాన్ని, ఆ సౌహార్ద్యం మూలంగా జీవనం సాగించే దంభాచారులనీ అవహేళన చేస్తవి. స్వేచ్ఛనుకోరే పురుషులకు, వారిని అరికట్టజూచే సంఘానికి సాగే పోరాటమే ఈ నవలల్లో ఇతివృత్తము. పంతులుగారి నవలల్లో సంస్కార ప్రియత్వమే ద్యోతకమౌతుంది.

ఆ తొలితరంలో పంతులుగారి అడుగుజాడల్లో నవలా రచన కొనసాగించినవారు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు. వారి రామచంద్ర విజయము, కర్పూరమంజరి, గణపతి మొదలగా నవలలతో రచనాపద్ధతిలో, వస్తుపరిగ్రహణలో మార్పు వచ్చింది. రామచంద్ర విజయం సామాన్య మానవుని జీవితం. జీవిత పోరాటంలో మానవుడు విజయాన్ని సాధించడం అందులోని ఇతివృత్తం. శ్రీ చిలకమర్తి వారు తెలుగు నవలల్ని ఒక్కవెలుగు వెలిగించి చెప్పుకో దగ్గ మరొక మలుపు త్రిప్పారు. ఆ కాలంలో ప్రతిమానవుడి హృదయం దేశభక్తితో తొణికిసలాడింది. బానిసత్వ శృంఖలాల్ని విదల్చడానికి ప్రబోధాత్మకంగా మన పూర్వపు ఔన్నత్యాన్ని, మహోజ్వల చరిత్రను వేనోళ్ల చాటసాగారు, కవులు, రచయితలు. చిలకమర్తివారు తమ 'హేమలత' నవలతో చారిత్రకనవలకు నాంది పలికారు. అప్పటికి తెలుగు నవలారచన పికాన పడింది. ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల, సరస్వతీ గ్రంథమాల, వేగుచుక్క గ్రంథమాలల వారి నవలలు తెలుగుదేశాన్ని కొత్తఊపుతో ముంచెత్తినవి. పాఠశాలలకుకూడా నవలల అవసరం కలిగింది 'పత్రికలు విశేషంగా బయలుదేరి సశేషంగా' నవలల్ని ప్రకటింప సాగాయి. ఆదినుండి తెలుగు నవలారచన ఇతోధికంగా ప్రోత్సహింపబడ్డమాటమాత్రం వాస్తవం.

అప్పుడప్పుడే పరిశోధనలు చరిత్రలో ప్రారంభించారుగనుక అప్పటి చారిత్రకనవలల్లో కాల్పనిక విషయమే అధికమవాలి. యథార్థత తక్కువ. అప్పటి ప్రజాభిరుచికనే అపురూపంగా, ఆప్యాయంగా అగుపించినై. చారిత్రికసత్యం కొరవడినా, తమ భావనాబలంతో అసంభవాలకి 'చరిత్రరంగు'పూసి నవలల్ని రచించినవారు శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు. వారి వసుమతీవసంతం, ప్రమదావనం మున్నగు నవలలు ఈ కోవకు చెందుతవి. శ్రీ నోరి నరసింహశాస్త్రి, అడవి బాపిరాజుగారలు గతించిన ఆంధ్రతేజస్సును, మేధను; విజయాన్ని, వైభవాన్ని; కళల్ని, శిల్పాన్ని; మన కనులముందు నిల్పి భవిష్యత్తులో ముందున్న కర్తవ్యాన్ని ప్రబోధించారు. శ్రీ నోరివారి నవలల్లో కవిత్రయ కవిసార్వభౌముల యుగాలు పునర్జీవాన్ని పొందాయి. శ్రీ బాపిరాజుగారు శాతవాహనులనాటి కథతో 'హిమబిందు'ను, కాకతీయులనాటికథతో 'గోనగన్నారెడ్డి'ని రచించి ఆనాటి సాంఘికజీవితాన్ని మన కండ్ల యెదుట ప్రదర్శించారు.

మార్పుప్రకృతి సహజం. మానవనైజం. ప్రజలకు తాత్కాలికంగా చారిత్రకనవలలపై మోజుతగ్గి, అపరాధపరిశోధకనవలలమీద మనసు పోయింది. ఆంధ్రులది అనేకవిషయాలలో అనుకరణశీలం. ముఖ్యంగా వాఙ్మయములో, అనాదిగా సంస్కృతంతో సరసాలాడారు. ఇంగ్లీషు రావటంతో దానివెంటబడ్డారు. బెంగాలీని చూసి భ్రమసిపోయారు. మనవాళ్లు కొందరు శాంతినికేతనంలో విద్య నభ్యసించినకాలంలో ఆ బెంగాలీ అపరాధపరిశోధక నవలల్ని అనువదించారు. అప్పటి తెలుగు డిటెక్టివు నవలారచయితలలో దేవరాజు వెంకటకృష్ణారావుగారు, సోమరాజు రామానుజరావుగారు సిద్ధహస్తులు. 'వేగుచుక్క'వారి వాడేసేడు, నేనే, కాలూరాయిఅన్న మూడుభాగాల నవల అపరాధపరిశోధకనవలాకాశపథంలో నిజంగా వేగుచుక్కే' అన్నారు శ్రీ యస్వీజోగారావుగారు. చిలకమర్తివారి చారిత్రక నవలలతో, శ్రీ వేంకటపార్వతీశ్వర కవుల అపరాధపరిశోధకనవలలతో పంతులుగారు ప్రారంభించిన సాంఘిక నవలలు కొంతకాలం

మూలబడినవి. కాని అది తాత్కాలికమే. ఈ సాంఘిక నవలలకి మరల ప్రాణప్రతిష్ఠ చేసి ప్రచారం చేసినవారు శ్రీ కొవ్వలి, జంపనలు. వీరి కలం రోజుకొక నవలని సృష్టించినది అనినా సత్యదూరం కాదు. వీరు వ్యవహారిక భాషను సాంఘిక నవలల్లో ఉపయోగించి వాటిని మరింత సహజం, వాస్తవికంగా చేశారు. వీరి నవలల్ని 'రైల్వే సాహిత్యం' అని నిరసించినా ఆ నాడు ఆంధ్రదేశంలో అక్షరజ్ఞానమున్న ఆబాలగోపాలమూ చదివి ఆనందించారు. ఆ నవలలు కాలక్షేపపు నవలలక్రిందే జమకట్టబడ్డాయి. 'అట్టి సమయంలో సాంఘిక నవలలపై ఇన్ని శుభాక్షతలు చల్లినవారు వ్యుత్పన్నులైన శ్రీ ఉన్నవ, గుడిపాటి, విశ్వనాథ ప్రభృతులు.

ఉన్నవవారి ఉద్గ్రంథమైన 'మాలపల్లి', ఆంధ్రనవలావాఙ్మయచరిత్రలో నాక మైలురాయి అన్నారు విమర్శకులు. ఏ ఇతర వాఙ్మయ చ్ఛాయలు సోకకుండ స్వేచ్ఛగా తెలుగుదనాన్ని వంటబట్టించుకొని, తెలుగు జాతీయతను ఇంపుగ సొంపుగ చిత్రించిన మొదటి తెలుగునవల మాలపల్లి. ఇందులో గాంధీతత్వం లచలతత్వంగా రూపుదాల్చింది. గ్రంథమంతటా గ్రంథకర్త సంస్కార గరిమ పరిమళిస్తూంటుంది. పాత్రలన్నీ చైతన్యవంతమైన 'సజీవ' పాత్రలు. మతము, తత్త్వము, రాజకీయాలు, కారాగార స్థితిగతులు, ఒకటేమిటి సర్వవిషయాలు ఇందులో సాంగోపాంగంగా తర్కించబడ్డవి. ఇంతటి బృహద్గ్రంథం వ్యవహారిక భాషలో వెలువడడం అదే మొదటి పర్యాయం. తెలుగు జాతీయ నుడికారం తెలుసుకోవాలంటే మాలపల్లి చదవవలసిందే. రష్యన్ వాఙ్మయానికి అలెగ్జాండరు పుష్కిన్ ఎటువంటివాడో ఆధునికాంధ్ర వచన రచనకు లక్ష్మీనారాయణగారు అంతటివారు.

అతిప్రతిభాశాలులైన చలంగారు పంతులుగారు చూపిన సంస్కారంతో తృప్తిపడలేదు. చలంగారి చేతిలో సాంఘిక నవల విలక్షణమార్పు పొందింది. ప్రబంధాలలోని శృంగారం పచ్చిగావుంటుందన్న నిరసనాన్ని ప్రక్కకునెట్టి, ఆ శృంగారాన్ని వన్నెచిన్నెలతో వర్ణిస్తేగాని తనివి చెందని స్థితికి తెచ్చింది చలంగారి అమోఘలేఖిని. శ్రీ వీరేశలింగంగారితో ప్రారంభించిన సాంఘిక సంచలనం వీరి రచనలతో మరింత తీవ్రరూపాన్ని దాల్చింది. చలంగారి సంస్కారమే వేరు. తెలుగులో నవలల్ని, లైంగిక విషయ ప్రధానమైన నవలలుగా రూపొందించి, ప్రచారానికి తెచ్చి, పఠనయోగ్యంగాచేసిన గౌరవం వారికే దక్కుతుంది. వీరి నవలల్లో పాశ్చాత్య శాస్త్రకారుడు సిగ్మండ్ఫ్రాయిడ్, నవలాకారులైన డి. హెచ్. లారెన్స్, మొపాసా మున్నగు వారెందరో ఇమిడిపోయారు. వివాహసంస్థకు ఎసరుపెట్టే స్వేచ్ఛావిహారాన్ని ప్రబోధిస్తున్నారా అనిపించే కామక్రియాకలాపాన్ని చిత్రవిచిత్రంగా చిత్రించారు చలం. స్త్రీజాతి ఉద్ధరణకి కలంపట్టిన రచయిత చలం అన్న ప్రశంసల నందుకున్నారు. వీరి మధుర రచనలనుచూచి మంది మంత్ర ముగ్ధులైనా 'మర్యాదస్థులు' అనబడేవారుమాత్రం కన్నెర్ర చేశారు. అట్టివారి నోటిని గట్టిగా నొక్కారు శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు ముప్ఫయి ఏండ్లనాడే. 'లోకం ఆమోదించనిదీ, లోకం జాగ్రత్తగా కప్పిపెట్టుతున్నదీ వెంకటచలంగారు చాలా బయటపెట్టదలంచుకున్నారు. అది కాగితంమీద పెట్టి తీరాలి గత్యంతరంలేదు. సంఘంలోఉన్న కుళ్ళు సారస్వతంలోకి రాకుండాచేసి ఎవరి కళ్ళు కప్పుదామని? ఇదంతా నిజంగా కుళ్ళుకాదేమో! దీనికి కాస్త గాలి తగలనిస్తే ఇదంతా పరిశుద్ధమైన పదార్థంగా పరిణమిస్తుందేమో. మన హృదయాలూ, అందులోఉన్న భయంకరదృశ్యాలూ మనకు చూపటమే ఆయన పని. ఆదర్శాలను ప్రకటించటం కాదు.'

ఇక విశ్వనాథవారిది విశ్వరూపం. వారు ఆద్యంతాలూ ఆక్రమించి స్వర్గానికి నిచ్చెనలు

వేశారు. పంతులుగారు ప్రారంభించిన సంఘ సంస్కారం ఇలా చలంగారి కలంలో పరవళ్ళు తొక్కితే, విశ్వనాథవారి 'వేయిపడగలు' పూర్వాచారానికి, సంప్రదాయానికి ఎత్తిన ధ్వజమై నిలిచింది. పురుషుని స్వేచ్ఛను అదుపులో పెట్టి అరికట్టకపోతే దాని వికారాలు సంఘవిచ్ఛిత్తికి కారణమవుతవని నిరూపిస్తూ, స్వేచ్ఛపేర జరిగే అన్యాయాలకూ, అక్రమాలకూ చెలియలికట్ట వేయ చూచారు వీరు. శాస్త్రప్రామాణ్యాన్ని అంగీకరించని హేతువాదం నిస్సారమనీ, తుదకది గోతిలోకి దింపుతుందనీ వీరి ఉపదేశసారం. వీరి ప్రతినవలలో ధర్మధ్వని ప్రతిధ్వనిస్తూంటుంది. వేయిపడగలు వారి Magnum Opus అన్నారు పెద్దలు. విశ్వనాథవారి రచన విజ్ఞానమయకోశాన్ని స్పృశించటానికి ఎక్కువ ఉబలాటపడుతుందని, అందుచేతే వేయిపడగల సందేశాన్ని ఆంధ్రజాతి అందుకోలేకపోయిందని, అందులోని ధర్మఘోష నూతిలోనిగొంతుకైపోయిందని విమర్శకాభిప్రాయం. శ్రీ అబ్బూరివారు 'వేయి పడగలలో పడగేకాని పామెక్కడా కనిపించ'దన్నారు. ఏమైనాను కవిసమ్రాట్టు కలం నవలారచన కుపక్రమించటం ఆంధ్రుల అదృష్టమనాలి. ఎందుచేతనంటే తెలుగు నవలకు కావ్యత్వాన్ని ప్రసాదించినవారు శ్రీ విశ్వనాథవారు. వారి కావ్యాలెంత బలిష్ఠమైనవో వారి నవలలంత పటిష్ఠమైనవి.

సిద్ధాంతాలలో చలంగారిది ఉత్తరధ్రువం. విశ్వనాథవారిది దక్షిణధ్రువం. వీరిరువురికి మధ్యస్థంగా శ్రీ అడివిబాపిరాజుగారు కనిపించుతారు. నిగ్రహరహితమైన విశృంఖలవలన వచ్చే హానిని అంగీకరించుతూ మానవమాత్రుల బలహీనతలని సానుభూతితో చిత్రించిన నవల వీరి 'నారాయణరావు'. శ్రీ మునిమాణిక్యంగారి 'తిరుమాళిగ' ఉప్పలవారి 'అతడు—ఆమె' ఇటువంటివే. శ్రీ రావూరివారి నవలలుకూడా ఈ తరగతికిందకే వస్తవి. హాస్యప్రధానమైన నవలారచనలో అందెవేసినచేయి శ్రీ మొక్కపాటివారిది. వారు సృష్టించిన బారిస్టరు పార్వతీశంవంటి పాత్రలు అరుదు. గురజాడవారి గిరీశమే గిరీశం! మొక్కపాటివారి పార్వతీశమే పార్వతీశం అన్నారు. ఈ కాలంలో డాక్టర్లు ఇంజనీరులకుమల్లే ఆ కాలంలో బారిస్టర్లు అంటే వేలం వెర్రి. మనవారి చాదస్తాన్ని ఎత్తిచూపించే నవల 'బారిస్టరు పార్వతీశం'

ఈ మొదటి తరంవారి నవలల్లో సంఘ సంస్కార ప్రియత్వం ప్రధానంగా కనిపిస్తుంది. వీరి సంస్కార ప్రియత్వం స్వేచ్ఛాప్రేమను ప్రబోధించింది. అప్పటి భావకవిత్వంకూడా అదే ప్రబోధించింది. అందుచేతే 'ఇక్కాలమున ముఖ్యముగ ప్రచారములో నున్నవి భావకవిత్వము, నవలలు. 'ఈ రెంటియొక్క పరమాదర్శము ప్రణయ గాథలను వర్ణించుటదప్ప వేరొండు కాన్పించుట లేదు' అని విమర్శించారు. కాని దానిని పాక్షికమైన విమర్శ అనవచ్చు. ఈ నవలలు స్వతంత్ర భారత దేశానికి వలసిన మార్పులన్నిటిని విశదీకరించి, పాతపద్ధతులు ఎలా వర్జితాలో చక్కగా నిరూపించినవి. మనకు స్వాతంత్ర్యంవస్తే అప్పుడున్న అనర్థాలన్నీ పటాపంచలై దేశం మూడు పువ్వులు ఆరుకాయలుగ వికసించగలదన్న విశ్వాసం వారి నవలల్లో కనిపిస్తుంది. అప్పటి బ్రిటీషుప్రభుత్వంపై దెబ్బతీయడానికికూడా ఈ నవలల్ని సాధనంగా వాడుకున్నారు. జాతీయోద్యమం కారణంగా వచ్చిన సంఘసంస్కారాన్ని రాజకీయ దృక్పథాన్ని వెక్కిరిస్తవి శ్రీ విశ్వనాథవారి నవలలు. సమాజంలో అట్టడుగునపడిన స్త్రీని ఉద్ధరించే రచనలు శ్రీ చలంగారివి. తరగతుల అంతరం అస్పృశ్యం కావాలనే నవల శ్రీ బాపిరాజుగారిది. హరిజనోద్ధరణకు కంకణం కట్టిన నవల శ్రీ ఉన్నవవారిది. ఇలా ఆ తరం నవలల్లో కొన్ని అభ్యుదయ నవలలు. కొన్ని ఛాందసపు నవలలు.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం రచింపబడ్డ తెలుగు నవలల్లో సామ్యవాద సిద్ధాంతం ప్రతిఫలిస్తున్నది. కులమత విభేదాలు రూపుమాయ

టమే కాకుండా తరగతుల అంతరంకూడా పోవాలని ఆ నవలలు గట్టిగా చాటినై. ఇటువంటి రచనలు చేసిన వారిలో శ్రీ కరుణ కుమార, కొడవటిగంటి వారు ముఖ్యులు. మధ్యతరగతి మనస్తత్వాన్ని, ఆ తరగతి సమస్యల్ని, అచటి వాతావరణాన్ని జీవవంతంగా రూపించుతారు శ్రీ కొడవటిగంటి. ఈ కాలంలో వెలువడిన నవలలు సమకాలిక జాతీయ జీవనానికి దర్పణాలనటంలో సంకోచం లేదు. శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శివశంకరశాస్త్రి వారి నవలల్లో మరల నవ్యసంస్కృతి ప్రభావమే ప్రకాశించింది.

అప్పటికి తెలుగు నవలారచయితలు ఆశించిన, ప్రబోధించిన మార్పులు సంఘంలో కొంతవరకు వచ్చినవనే చెప్పాలి. రెండో ప్రపంచ మహా సంగ్రామం ముగిసింది. మన నవలాకారులు కోరిన కోరిక స్వాతంత్ర్యం భారతావనికి సిద్ధించినది. ముందుతరంవారు ఊహించిన ఊహలన్నీ నిజాలు కావని, వారు కనిన కలల్లో కొన్నైనా కరగిపోగలవని ఈ రెండోతరం నవలాకారులు తెలుసుకున్నారు. ప్రేమపట్ల, వివాహంపట్ల మొదటితరంవారిలో కనిపించే ఆత్మవిశ్వాసం ఈ రెండోతరం తెలుగు నవలాకారుల్లో లోపించింది మొదటితరంవారికి దూరపు కొండలు నునుపుగా తోచినై. వాటిని సమీపించిన రెండవతరంవారికి అవి అనుకున్నంత నునుపు కాదనిపించింది. అప్పటి సంఘంలోని అస్తవ్యస్తస్థితిని, అప్పటి వ్యక్తుల్లోని సంఘర్షణని చిత్రించినవారు శ్రీయుతులు బుచ్చిబాబు, గోపీచంద్, వి. డి. ప్రసాద్ ప్రభృతులు. వీరు స్వేచ్ఛాప్రేమకే ప్రాధాన్యాన్ని ఇవ్వాలా, లేక సంప్రదాయానికి ప్రాధాన్యాన్ని ఇవ్వాలా అన్నది తేల్చుకోలేక యధార్థంగా జరుగుతున్న విషయాలనే చిత్రించారు. తరతరాలుగా వస్తున్న జాతిసంస్కారానికి, నూతన సంస్కారం వలన కలిగిన స్వతంత్రప్రవృత్తికి జరిగే పోరాటాన్నే వీరు చూపారు. ఈ పోరాటంలో వీరి పాత్రలు హతాశులై, నిస్పృహను చెందుతాయి. వీరి పాత్రలు నీతి అవినీతులమధ్య నలిగిపోతాయి. బలహీనతలకు లొంగిపోతాయి. తాము చేసినది మంచిదా, చెడ్డదా అన్నది ఇదమిత్థంగా తేల్చుకోలేవు. జీవనప్రవాహంలో కొట్టుకుపోవటమేగాని తాము చేయగలిగింది ఏమీలేదన్న వైరాగ్యం అచ్చట కన్పిస్తుంది. ప్రవృత్తికి ప్రాధాన్యం ఇచ్చిన రచనలు వీరివి. శ్రీ రాచకొండవారి 'అల్పజీవి' ఈ తరంవారి నవలలకు చక్కని నిదర్శనం. ఈ తరంవారి నవలల్లో అవిశ్వాసంపాలెక్కువ. సమాజంపట్ల అసంతృప్తి ద్యోతకమౌతుంది. వీరు విదేశీయ నవలాకారుల్ని ఎక్కువగా అనుకరించారు. బాహ్యంకన్నా అంతరంగాన్ని పరిశీలించాలన్న ఉబలాటం మానసికప్రవృత్తిని మధించాలన్న దుగ్ధ ఈ నవలల్లో విద్యమానమౌతుంది. వీరు కేవలం సమాజాన్ని ఫోటో తీయటంతో తృప్తిపడలేదుగాని, మానవుని మనస్సును X-Ray తీయడానికి ప్రయత్నించారు. ఇది గుర్తించదగిన మార్పు.

స్వాతంత్ర్యసమరసమయంలోనూ, స్వాతంత్ర్యం సంక్రమించిన అనంతరమున్నూ దేశంలో ఆశించిన శాంతి కలగలేదు. అనుకోనిరీతిగా పాకిస్థాన్, హిందూస్థాన్ అని దేశం రెండు చెక్కలుగా విభజింపబడటం, హిందూమహమ్మదీయ విద్వేషాలు, ఆ కారణంగా జరిగిన అమానుషచర్యలు, అంతంలేని కాందిశీకుల నిర్గమనములు, మహాత్ముని హత్య, రజాకర్ల రాక్షసకృత్యాలు, కనీవినీఎరగని క్షామం, వరదలూ, భూకంపాలు, ప్రాంతీయవైషమ్యాలు, చైనీయుల దాడులు, పాకిస్థాన్ దురాక్రమణ, నక్సల్‌బారీ ఇవన్నీ ఒకటివెంట ఒకటి ఊపిరి సలపనీయకుండ జరిగినై. భాషపేర, మతంపేర, రాష్ట్రంపేర జరిగే నిష్కారణ దుండగాలు, అరువు తెచ్చుకున్న సిద్ధాంతాలు, మానవుని హేతువునే సవాలుచేసినై. ఈ సంఘటనలు దేశాన్ని కలగుండు పరచినై. ఈ అల్లకల్లోలానికి మన తెలుగు నవలాకారులు మూగవోయారేకాని కలం పట్టి ఈ

చరిత్రకు శాశ్వతత్వాన్ని కావ్యత్వాన్ని ప్రసాదించలేకపోయారు.

ఈ రాజకీయాలలో కొన్నింటిని ప్రతిఫలించే నవలలు కొన్ని తెలుగులో లేకపోలేదు. శ్రీ మహీధర రామమోహన్‌గారి 'మృత్యువు నీడల్లో' శ్రీ పి. లక్ష్మీకాంత మోహనంగారి 'సింహగర్జన' శ్రీ బొల్లిముంత శివరామకృష్ణగారి 'మృత్యుంజయులు' అన్న నవలలు రజాకర్ల దురంతాల్ని కండ్లకు కట్టినట్లు చిత్రించినవి. తెలంగాణాలో జాగీర్దార్ల అమానుష చర్యలను చిత్రించిన నవల శ్రీ వట్టికోట అళ్వారుస్వామిగారి 'ప్రజల మనిషి'. నేటి గ్రామకక్షలూ, రాజకీయవాదుల దురంతాలూ ప్రతిబింబించే నవల శ్రీ జి. వి. కృష్ణారావుగారి 'కీలుబొమ్మలు'. సంఘంలో దళితవర్గాలకు చెందిన మానసిక పరిస్థితిని ఉత్తమస్థాయిలో తగినంత పాటవంతో చిత్రించిన నవలాకారుడు శ్రీ శారద.

జాతీయోద్యమం స్థానంలో సామ్యవాద సిద్ధాంతం స్థావరమేర్పరచుకొన్నది. శ్రీ కొసరాజు శేషయ్యగారి 'తారుమారు' 'సారాబట్టీ' మొదలైన నవలలు సామ్యవాదాన్ని చాటే నవలలు. అప్పటికి ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు సిద్ధాంతాలు ప్రేళ్ళూని మోసులెత్తుతున్నాయి. అప్పటివరకూ కాంగ్రెసే పరమావధిగ భావించిన వారి దృక్పథం మారసాగినది ఈ కమ్యూనిస్టు సిద్ధాంతాలను ప్రచారంచేసే నవలలు కూడా వెలువడినవి. 'రథచక్రాలు' నవలలో కాంగ్రెసుపార్టీకి, కమ్యూనిస్టుపార్టీకిగల తారతమ్యం అతిచక్కగా కథతో మేళవింపబడినది. ఈ నిరీశ్వరవాదులమీద మరోదెబ్బతీయ సంకల్పించిన శ్రీ విశ్వనాథవారు 'భగవంతునితో వైరం' అన్న నవలతో ప్రారంభించి ఓ పదహారు నవలలు వ్రాశారు. వారు 'వెనకపడితే వెనకేనోయీ' అన్నదానిని ఒప్పుకోరు. వారి దెప్పటికి వెనకమూపేగాని ముందు చూపుకాదనిపిస్తుంది. అందువేతే వారి నుద్దేశించే కాబోలు శ్రీ శ్రీ గారు ఉన్నచోటు చాలునుమీకు ఇంకా వెనక్కి పోతామంటారు కూడా మీలో కొందరు - అన్నారేమో ననిపిస్తుంది. దేశవిభజనను గురించిన ఇతివృత్తంతోగాని, మహాత్ముని హత్యకు గురించిన ఉదంతంతోగాని తెలుగులో నవలలు లేకపోవడం చింతనీయం. జాతీయోద్యమంలో హోరాహోరీగాత పోరాడినవారు ఆంధ్రులు. మహాత్ముడంటే ప్రత్యేకాభిమానం, పూజ్యభావం కలవారు తెలుగువారు మన తొలితరం నవలాకారులందరూ జాతీయోద్యమంలో పాల్గొని, సహాయ నిరాకరణచేసి శ్రీకృష్ణజన్మస్థానానికి వెళ్ళివచ్చినవారే. ఈ స్వాతంత్ర్య సమరదీక్షలో ఆంధ్రులు చేసిన నిర్విరామ కృషిని చూపించే నవల, శ్రీ మహీధర రామమోహన్‌గారి 'కొల్లాయిగట్టితేనేమి?'; స్వాతంత్ర్యపు పోరాటపు నాటి తెలుగుదేశపు రాజకీయ సామాజిక, ఆర్థిక పరిస్థితుల్ని చిత్రించిన నవలలు 'చదువు' 'ఇంతకీ నేనెవరు?' అన్నవి.

1960 సం|| ప్రాంతాలవరకు వెలువడిన నవలలు యథాతథంగా సంఘంలోని మాలిన్యాన్ని ఎత్తిచూపినవి కొన్ని. తాము తటస్థంగావుండి ఉన్నది ఉన్నట్టు చిత్రించినవి కొన్ని. సమస్యలకు కారణాల్ని ప్రశ్నించినవి కొన్ని. సమాధానం చెప్పకుండా ఊరుకొన్నవి కొన్ని. పరిష్కారమార్గాన్ని సూచించినవి కొన్ని. ఈ నవలలన్నింటిలో నిగ్రహపూర్వకమైన ఉపదేశంకన్నా రజోవశమైన ఆవేశమే ఎక్కువగావున్నదన్నారు శ్రీ కాటూరివారు. ఏవిధంగా చూచినా తెలుగు నవల తెలుగుదేశంలో సమకాలీన జీవితాన్ని వైవిధ్యంతో చిత్రిస్తూ, చర్చిస్తూ పరిస్థితులపట్ల తీవ్రమైన అసంతృప్తినీ, పాతపడిన ఆదర్శాలపట్ల అవిశ్వాసాన్ని వ్యక్తీకరించిందనటంలో సందేహం లేదన్నారు శ్రీ సుదర్శనంగారు. ఆరంభంలో వెలువడిన నవలల లక్ష్యం ప్రబోధము, ప్రచారమున్నూ. స్వాతంత్ర్యానంతరం వెలువడిన నవలల లక్ష్యం తద్భిన్నమైనది. వీనిలో పరిశీలన, జిజ్ఞాస, యథార్థాన్వేషణ కనిపిస్తవి.

ఒకపది, పన్నెండేడులుగా తెలుగు నవలా రచన నూతనశక్తిని పుంజుకున్నదనిపిస్తుంది. ఆదిలో భావకవిత్వపు రోజులలో కథానికకే ప్రచార మెక్కువ. అయినా నవల తచ్చ్లాడుతూ తప్పటడుగులు వేసుకుంటూవచ్చింది. ఉగాది నవలల పోటీలతో మరల నవల నిలద్రొక్కుకొని తల యెత్తిందనవచ్చు. ఈ మాటనే తెలుగు కథాసాహిత్యాన్ని సమీక్షిస్తూ కుటుంబరావుగారన్నారు 'చిన్నకథను వెనక్కునెట్టి నవల ముందుకురావటం జరుగుతున్నట్టు కనబడుతుంది.' అంతేకాకుండ తెలుగు నవలల్ని కొంతవరకు నవలలు రక్షించారనడం సత్యదూరంకాదు. ఈ చల్లనితల్లుల ఆలనాపాలనతో తెలుగు నవల కొంత ఎదిగింది 'తన చరిత్ర ప్రథమ పాదములోనే నవలారచన ఆడంగులనుకూడ ఆకర్షించినది'అని కొంత పరిహాసంగా శ్రీ యస్వీ జోగారావుగారు అన్నారు. నిజమే తెలుగమ్మల హృదయాలు ద్రవించేలా రచయిత్రులు మొదటి నుండి నవలలు వ్రాస్తున్నారు. ఈ రచయిత్రులు తమకు అందని విచిత్రకల్పనలజోలికి పోకుండా తమకు నిత్యపరిచయమైన సామాన్యగృహవాతావరణాన్ని గ్రహించి మధ్యతరగతి మనస్తత్వాన్ని, సమస్యల్ని ప్రధానంగా చిత్రిస్తున్నారు. వీరి నవలల్లో ఎక్కువగా చర్చింపబడుతున్నది వర్ణాంతర వివాహాలు, ప్రేమలు, పెళ్ళిళ్ళూ, గయ్యాళిభార్యలు, గడ్డుభర్తలు ఇత్యాదులు. సవర్ణవివాహమైనా, వర్ణాంతరవివాహమైనా, స్వమతవివాహమైనా, మతాంతర వివాహమైనా, ప్రేమించి పెండ్లిచేసుకున్నా, పెండ్లిచేసుకొని ప్రేమించినా, పెండ్లికి ప్రేమ అన్నది ప్రధానము, అది లేకపోతే సంసార మహాసాగరంలో ఉప్పెన తప్పదనీ, సంసార రథం సాఫీగా సాగాలంటే భార్యాభర్తలు ఒకరినొకరు అర్థం చేసుకోవటం, ఇద్దరిలో కొంత పట్టువిడుపూ ఉండడం, ఇద్దరిలో కొంత త్యాగశీలం ఉండడం అవసరమన్న పరమసత్యాన్ని చెప్పడానికే వీరు ప్రయత్నిస్తున్నారు. ఈ నాటి సమాజంలో స్త్రీకి ప్రేమ, పెండ్లి - ఇవి రెండూతప్ప ఇంకేమైనా ఉన్నదా అన్న ప్రశ్నకు కొంతవరకు శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారు తమ 'స్త్రీ' నవలలో, శ్రీమతి విశాలాక్షిగారు తమ 'మారిన విలువలు' అన్న నవలలో సమాధానమిచ్చారు. ఈ నవలల నవలల్లో చెప్పుకోదగ్గ సుగుణమేమిటంటే వీరు ఆశావాదినులు. వీరి రచనల్లో నైరాశ్యం, నిస్పృహ గోచరించదు. పాపభీతి దైవభక్తి పుష్కలంగా వుంటుంది. వీరు క్రొత్త సంస్కారాన్ని చేపట్టినా, పూర్తిగా పాతసంప్రదాయాన్ని కాలదన్నే ధైర్యం లేదు. నూతన సంస్కారంలో పాత సంప్రదాయానికి స్థానాన్ని కల్పించి సమన్వయాన్ని చేకూర్చ ప్రయత్నిస్తున్నారు. స్త్రీల సున్నిత హృదయాల్ని, ఆడవారి ఆవేదనల్ని, ప్రస్తుత సమాజంలో స్త్రీ స్థానాన్ని చిత్రించటంలో వీరు కృతకృత్యులైనారనవచ్చు. సూటిగా సమస్యని చెప్పడం, సరళంగా సహజంగా వర్ణించటం, సాంసారికంగా, స్వాభావికంగా వివరించటంలో వీరు సిద్ధహస్తులు .

ఉన్నమాట అనుకోవాలి ఉన్నవూరు అచ్చి రాకపోయినాను. రచయిత్రులు రచనలైతే చేస్తున్నారుగాని, శిల్పదృష్ట్యా అవి అంత బరువైనవని చెప్పలేం. వానిలో అనేక రచనలు దూదిపింజల్లా తేలిపోగలవు. తేలికగా పాఠకులనందర్ని చదివించగలశక్తి వీరి నవలలకున్నది. కాని ఆలోచనాత్మమైనవి, మనస్సును మథించి నిలిచేవి చాలా తక్కువ. ఆ మాటకొస్తే ఈ విషయం తెలుగు నవలల కన్నింటికి అన్వయిస్తుంది. భావుకత, స్వాతోన్మీలన, మనస్తత్వ విశ్లేషణ, హృదయ దఘ్నత - మున్నగు లక్షణాలని ప్రస్ఫుటంగా ప్రతిఫలించే రచనలని మున్ముందు వీరు చేయగలరని ఆశిస్తున్నాను.

తెలుగులో వందలాది నవలలు వెలువడుతున్నై. EMESCO వారి పుణ్యమా అంటూ నెలకు నాలుగు క్రొత్త నవలలు వెలుతురు చూస్తున్నవి. ప్రేమ, వివాహం, ఈ రెండింటి తరువాత నవలల్లో ప్రాధాన్యాన్నివహించిన విషయాలు ఆర్థిక

రాజకీయ పరిస్థితులు. వీటిపట్ల కొన్ని ఆదర్శాలను ఆశాభావంతో ప్రబోధించారు తొలితరం నవలాకారులు. ఈ ఆదర్శాలు స్వాతంత్ర్యం తరువాత సంతృప్తిని కలిగించలేదన్న విషయం మలితరం నవలలు ప్రదర్శించినై. ఈ తరం నవలలు ఈ ఆదర్శాలపట్ల అశాభావాన్నే వెల్లడిస్తున్నవి. వీనిలో 'సీరియస్' నవలలకన్న 'సీరియల్' నవలలే ఎక్కువ. ఇప్పటి నవలలు రాజకీయంగా సామాజికంగా ఎటువంటి సంచలనాన్ని కలిగిస్తున్నవి అన్న ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టమే. రాజకీయాలపై నవలల ప్రభావం లేకపోయినా, ఇప్పటి రాజకీయాల ఒత్తిడిమాత్రం నవలలపై కనిపిస్తున్నది.

ప్రస్తుతం వెలువడుతున్న నవలల్లో ప్రేమాయణాలు కొన్ని, టీన్‌ఏజర్సుకొరకే ఉద్దేశింపబడినవి కొన్ని, 'ఇంగ్లీషుచదువులు చదివి తెలివి మీరామా? తెలుగు మీరామా?' అని ప్రశ్నించేవి కొన్ని, పల్లెటూళ్ల వాతావరణాన్ని, పల్లెకుటుంబాల ఆత్మీయతని, రైతుల రైతాంగాన్ని పుష్కలంగా వర్ణించిన నవలలు కొన్ని, తెలుగుజాతికి, పల్లెజీవితానికి ప్రతిబింబాలైనవి కొన్ని. తరతరానికి మార్పులు వస్తున్నవి. సమాజంలోని ఈ మార్పును ఈనాటి నవలలు చిత్రిస్తున్నవి అనడంలో సందేహంలేదు.

మలితరంవారి నవలల్ని సమీక్షిస్తూ శ్రీ శ్రీవాత్సవగారు 'నేటి పాశ్చాత్యలోకంలో మానవునిలో దానవత, సెక్సులోని విపరీతవాంఛలు చూడడం పరిపాటి. వానిని ఉన్నదున్నట్లు మన సంఘంలోకి దిగుమతిచేయడం—మన సంప్రదాయం కాదు. ఇంతకీ మన రచయితలు—ఎదురుగా కనిపిస్తున్న లోకాన్ని చూడలేకపోతున్నారు. ఎక్కడో జీన్‌పాల్‌సార్త్రే, ఆల్బెర్టోమొరావియా, డోస్టోవస్కీ ఇటువంటి యూరపియన్ రచయితల భావాలు ఎరువు తీసికొంటున్నారు. పరకాయప్రవేశం చేస్తున్నారు. దొంగరచనల ఎంగిలిమెతుకులు' అని ఘాటుగా ఈసడించారు. అది వర్తమానకాలపు నవలలకు ఎంతమాత్రం అన్వయించదు. ఈనాటి నవలల్లో ఎటువంటి 'Inhibitions' ఉండకపోవటం ముదావహము. పూర్వంలాగా ఏ ఇంగ్లీషు నవలకు అనువాదమో, అనుకరణమో కాకుండా, మన నవలాకారులు స్వేచ్ఛగా మనజాతికి దర్పణంగా రచనలు కొనసాగిస్తున్నారు. అలాగే ఇప్పటి నవలలు 'ఇజమ్స్' పిచ్చినుండి కూడా విడివడినట్లు తోస్తున్నది. దీనికి కారణం రచయిత్రులేమో! 22 రచయిత్రులు నవలారంగంలో నడయాడడం నిజంగా గర్వించదగ్గ విషయమే. ఈ తరం నవలాకారులకి మానవునిలోని మంచితనం మీద, మంచివిశ్వాసమున్నట్లు కనిపిస్తుంది. ఏనాటికైనా మానవుడు వైయక్తికంగా తనను బంధిస్తున్న ఈ కులమత విభేదాల్ని అధిగమించి పురోగమించగలడన్న విశ్వాసాన్నే ఈ నవలలు ఉద్ఘోషిస్తున్నవి.

'ఎల్లలోకము ఒక్కయిల్లై
వర్ణభేదములెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియాలి' అన్నది వీరి ఆశయం.

'ఈ స్వప్నం నిజమవుతుంది.
ఈ స్వర్గం రుజువవుతుంది
నిజంగానే నిఖిలలోకం
నిండుహర్షం వహిస్తుంది.' అన్నది వీరి విశ్వాసం.

ఈ తరం నవలాకారులందరూ ఇంచుమించుగా ఆస్తికత కలవారుగనుకే ఇప్పటి తెనుగు నవలల్లో Existentialist novels అట్టే కనుపించవు. అలాగే ప్రస్తుతం అమెరికను నవలల్లో ప్రచారం చేయబడుతున్న 'God is dead' అన్న సిద్ధాంతాల దరిదాపులకుకూడా మనవారు పోవటంలేదు.

ఒకప్పుడు పురాణ ప్రబంధ యుగాల లాగా తెలుగులో నవలాయుగమంటూ ఒకటిలేదని వాపోయిన రోజులున్నై. పురాణాంధ్రీకరణయుగం పోయింది. ప్రబంధయుగం పటాపంచలైనది. అవధానాల

యుగం అంతరించినది. నాటకాలయుగం నడచి పోయినది. నవలాయుగం నామమాత్రావశిష్టమే అయినదిఅని ఒకప్పుడు అన్నారు. అయితే ఆ అపవాదు ఇప్పుడు రుద్దమైపోయినది. ఇది ప్రాయికంగా నవలలయుగం. ఇప్పుడు వెలువడుతున్న అసంఖ్యాకమైన నవలల్ని గుణవిభాగం చేయటంకూడా దుస్తరమే. కాని యిందులో సాంఘికాల పాలే ఎక్కువని చెప్పవచ్చు. వానిలోనూ హెచ్చుగా మధ్యతరగతి, విద్యావంతులు, బస్తీనాగరికుల సమస్యలే కథావస్తువులుగా ఉంటున్నవి. మన నవలాకారులు ఇప్పటికీ ఆంధ్రజాతీయజీవితంలో తడమకుండా వదలివేసిన విశేషాలు అనేకం ఉన్నై. తెలుగు సారస్వతంలో కథాసాహిత్యం చేరుకున్న ఉన్నతస్థాయికి నవలారచన చేరుకోలేదు. అందుకు రచయితల బాధ్యతకన్న, ప్రతిబంధకాలుగావుండిన సమస్యలే ఎక్కువ. తెనుగు సాహిత్యంలో నవల సర్వాంగసుందరంగా సాక్షాత్కరింపకపూర్వమే నాటకం, సినిమా, రేడియో ఇత్యాదులు Mass Media అయి నవలను వెనక్కునెట్టినవి. అదీగాక నవల విద్యాగంధంగల సంస్కారయుత సమాజంమీదే ప్రభావాన్ని చూపగలదు. అటువంటి Literate Society తెలుగుదేశంలో ఇటీవలే ఏర్పడినది గనుక నవల నవనవోన్మేషంగా ననలెత్తుతున్నది. ఈ మధ్య పాఠకులు ప్రచురణకర్తలు ఈ నవలల్ని అభిమానిస్తున్నారు. అందుచేత నవలాకారులు తమ బాధ్యతను కొంత గుర్తించి నిర్వహించగలిగితే నవలకు మంచిభవిష్యత్తున్నది.

తెలుగులో అనువాద నవలలకి కొరతలేదు. తొలితరంలో శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు ఇంగ్లీషు, బెంగాలీ, కన్నడ నవలల్ని అనేకం అనువదించారు. అనుకరించారు. అప్పట్లో తర్జుమాలు కుప్పలు తిప్పలుగా తెలుగు భాషలో బయలుదేరేసరికి నవలలు అంటేనే తెలుగువారికి మోహం మొత్తినది. అందువలననే ఆ రోజులలో నవలలు అక్కరలేదని కథానికలు వ్రాయడానికి శ్రీ శివశంకరశాస్త్రులవారు, ఇతరులు పూనుకున్నారు. తెలుగులో దాదాపు ప్రపంచ భాషలలోని ప్రసిద్ధ నవలల అనువాదాలున్నవి. 1940-1954 వరకు శరత్ నవలల అనువాదమే కనిపిస్తుంది. ఈ కాలాన్ని నవలల్లో అనువాదయుగం అన్నా తప్పులేదు. ఈ కాలంలో ఏ అనువాదమో, అనుకరణమో కాని స్వంత నవలల్ని ప్రచురింప ప్రచురణకర్తలు జంకేవారు. ఇదికూడ నవలలు ఎదగక పోవడానికి ఒక కారణ మనవచ్చు.

భారతీయ సంస్కృతికి నిధులైన భారత, భాగవత, రామాయణాలు తెలుగులో ఏకకవికృతం కాకపోవటం విచిత్రమే. భారతం కవిత్రయ కృతం. భాగవతం కవి చతుష్క ప్రణీతం. రామాయణం కవిపంచక విరచితం. ఈ సాంప్రదాయాన్ని నవలలో కూడా పాటింపదలచినట్లున్నారు కొందరు రచయిత్రులు. సాభిప్రాయంగా ఆ నవలకు 'షణ్ముఖప్రియ' అనిపేరు పెట్టారు. ఈ నవలలోని కథ కొంచెం 'గ్రహణం విడిచింది' నవలలోని కథను పోలి ఉంటుంది. కథను చెప్పినవారు శ్రీ వాత్సవగారు. దానిని ఆరు ప్రకరణాలుగా విభజించుకొని శ్రీమతి పి. సరళాదేవి, శ్రీమతి వాచస్పతి, శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ, శ్రీమతి వనం దుర్గాకుమారి, శ్రీమతి యం. సులోచనారాణి, శ్రీమతి కె. వి. యన్. అచ్యుతవల్లిగారలు రచించారు. పటిష్ఠమైన కథ, మనస్సును ఆకట్టే సన్నివేశాలు, ఆట్టే లేకపోయినా ఆరుగురు ప్రసిద్ధ నవలాకారిణులుకలిసి రచించడమే ఇందులోని అపూర్వ విషయం. మరి మూడు కొప్పులు కలవవనికదా లోకంలో రివాజు!

ఈ తరం తెలుగు నవలల నామకరణంలో కూడా చెప్పుకోదగ్గ మార్పువచ్చింది. ఆదిలో పంతులుగారి 'రాజశేఖర చరిత్ర'ను అనుసరించి హిరణ్మయి చరిత్ర, జయదిలారాం చరిత్రము, పురందరదాసు చరిత్రము, సుదక్షిణా చరిత్రము, పుష్పవేణి చరిత్ర' అంటూ అన్నీ చరిత్రలుగనే ఉండేవి. ఆ తరువాత 'హేమలత'ను అనుసరించి 'శృంగారవల్లి, మరకతవల్లి, కల్పవల్లి, కనకవల్లి'

అంటూ నాయికల పేరులుగా ఉండేవి. అయితే ఇప్పటి నవలల పేరులే ఆకర్షణీయంగా ఉన్నవి. 'తొణికిన స్వప్నం, తొలగిన స్వర్గం; చేదునిజాలు; వెన్నెల కాటేసింది; బ్రతుకుజోడు; చీకటివారి; చిన్నవదినె; వెలుగులో వెలది ఇత్యాదులు. మరికొందరు మరోమెట్టుముందుకుపోయి 'స్వీట్‌హోం, హాట్‌హోం, లేడీడాక్టరు' అంటూ పేర్లు పెడుతున్నారు. ఇప్పటి నవలాకారుల్లో పరిశోధన తక్కువనే అనాలి. కొన్ని ప్రయోగాత్మక నవలలు వస్తున్నవి. శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావుగారి 'హౌస్ సర్జన్' శ్రీమతి కోమలాదేవిగారి 'ఆరాధన' వైద్యుల చిత్తశుద్ధిని, లక్ష్యసాధనని వివరించడమేకాకుండా ఈ వైద్యవృత్తిలోని సాధకబాధకాలని ప్రజానీకానికి చక్కగా వివరించినవి. శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారి 'ముత్యాలపందిరి' చేనేతపనివారి జీవితాన్ని చిత్రీకరించినది. ఈ నవలనిగూర్చి పేర్కొనదగిన మరొక విశేషం, ఇది తెలంగాణా జానపదవరి భాషలో రచింపబడిన తొలి నవల కావటం.

ఆంధ్రదేశానికి ఇరవైయేండ్లక్రితంవరకూ చెప్పుకోతగ్గ మహానగరాలు లేవు, విజయవాడ, రాజమండ్రి ఇత్యాదిపట్టణాలుతప్ప. ప్రత్యేక రాష్ట్రానంతరం సంక్రమించిందో భాగ్యనగరం. ఈ మహానగర జీవితాన్ని నవలల్లో చిత్రింప కొందరు నవలాకారులు ప్రయత్నించారు శ్రీమతి లతగారి 'మహానగరంలో స్త్రీ'అన్న నవలలో, శ్రీ పన్యాల రంగనాథరావుగారి 'గద్వాలచీర'అన్న నవలలో, శ్రీ నండూరి విఠల్‌గారి 'దిగంతాలు'అన్న నవలలో, శ్రీ పోతుకూచి సాంబశివరావుగారి 'అన్వేషణ'లో, శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావుగారి 'హారతి'లో, శ్రీమతి య. సులోచనారాణిగారి 'సెక్రటరి'అన్న నవలలో, మరికొన్ని నవలల్లో ఈ మహాపట్టణపు జీవితం చిత్రింపబడ్డది. ఈ నవలల్ని చదివిన పాఠకునికి ఈ ముఖ్యపట్టణాన్నిగురించి విభిన్నమైన అభిప్రాయాలు కలుగుతవి. లతగారి, రంగనాథరావుగారి నవలల్ని చదివి పాఠకుడు ఈ రాష్ట్రకేంద్రపట్టణంలో 'కాక్‌టైల్'పార్టీలకు కొదువఉండదనీ, కోరిన కలికితో కులకవచ్చుననీ, పేవ్‌మెంట్సుమీద స్త్రీపురుషుల నగ్నచిత్రాలు వివిధభంగిమలతో ప్రదర్శింపబడుతున్నవన్న అభిప్రాయానికి గురవుతాడు తదితరనవలల్లో తద్భిన్నమైన చిత్రం కనిపిస్తుంది ఈ రెంటిలో ఏది వాస్తవం, ఏది యథార్థంఅన్నప్రశ్న పాఠకుని ఐకముకపెట్టకపోదు. ఇంగ్లీషులో లండన్ మహానగరాన్ని, ఫ్రెంచిలో ప్యారిస్‌ను ఆధారంగాచేసుకొని ఎన్నో నవల లున్నవి. వాటిని చదివితే అంత దూరం ప్రయాణంచేసి వెళ్లకుండానే ఆ మహానగరాల జీవితాన్ని మూలమూలకు, కోణకోణానికి T. V. లో చూచినట్లు చూడవచ్చు. అటువంటి యథార్థ సజీవచిత్రణల్ని తెలుగు నవలాకారులు కూడా చేయగలరని ఆశిస్తున్నాను

శ్రీమతి సులోచనారాణిగారి 'ఆరాధన'లో కథానాయిక మూగది. మూగవారి మూగబాధను ముచ్చటగా ఊహించి నవల వ్రాసినందుకు వారెంతైనా అభినందనీయులు. కాని వారొక విషయం విస్మరించినట్లున్నది. మూగవారు వినలేరు. వారు సర్వదా చెవిటివారే. అన్నపూర్ణ మాటలాడలేదుగాని వినగలదన్నదానిని ఆధారంగాచేసుకొని నవల ఆద్యంతం సాగింది, అన్నపూర్ణ మూగదికాకుండా 'Tongue-Tied' అని సరిపెట్టుకోవచ్చుకాని అలా నవలలో ఎక్కడా సూచింపబడలేదు. ఇటువంటివానిలో మన నవలాకారులు శ్రద్ధ చూపగలిగితే ఇంకా రాణించగలరు.

పట్టణాలలో పుట్టగొడుగుల్లా పుడుతుంటవి Slums. ఆ slums లో నివసించే వ్యక్తుల జీవితాలు ఎటువంటివో అన్నది తెలుసుకోదగ్గ విషయమే. ఆ కుతూహలంతో కొంత పరిశోధన జరిపి ఆ అట్టడుగు మానవుల జీవితాన్ని ఇతివృత్తంగాజేసి ఆ పరిభాషలోనే రచింపబడిన నవల 'బజారు బిడ్డలు'. బెజవాడ పట్టణాన్ని, ఆ పట్టణంలోని వాస్తవ దృశ్యాల్ని కండ్లకు కట్టించారు శ్రీ పోలవరపు శ్రీహరిరావుగారు.

స్వరాజ్యంవచ్చిన భారతదేశం ఎలా వున్నది? ప్రగతి సాధించిందా అంటే సాధించినట్లే వున్నది. పతనమయినదా అంటే అయినట్లే ఉన్నది. ఎలా అనుకుంటే అలా కనుపించే ఇప్పటి భారత దేశపు స్థితిగతుల్ని యథార్థంగా, చమత్కారంగా, చిత్రించి చూపించారు శ్రీ బలివాడ కాంతారావు గారు తమ 'పుణ్యభూమి'లో. భారతదేశపు ప్రగతికి సోపానాలైన ప్రాజెక్టుల, పారిశ్రామిక పట్టణాల పరిశ్రమనిగాని, 'కష్టజీవుల, కర్మవీరుల వ్యథార్త జీవిత యథార్థ దృశ్యాలుగానీ', ఆటవికుల అమాయిక జీవితాలుగాని, వివిధ వృత్తులకు సంబంధించిన విజ్ఞానాల్నిగాని, విజ్ఞానశాస్త్రవిస్మయాల్నిగాని, తెలుగు నవల ఇంకా చవిచూడలేదు. అక్కడక్కడ అప్పుడప్పుడు వీటిని back grounds గా చేసుకున్న నవలలు లేకపోలేదు. శ్రీ గండికోట బ్రహ్మాజీ రావుగారి 'పరుగిడే చక్రాలు, ప్రవహించే జీవవాహిని' రైల్వే వర్కర్సుకు సంబంధించిన నవల. శ్రీ శ్రీవాస మూర్తిగారి 'అల్పజీవులు' బ్రతకలేని బడిపంతులు జీవితాన్ని చూపించినది. వారి 'అబల' working Girls కు సంబంధించింది. హితశ్రీగారి 'సామ్యుడికామన' అన్న నవలలో సమ్మెలు, మిల్లులు, కార్మికులు ప్రధానపాత్ర వహిస్తారు. ఏమైనానూ తెలుగు నవలల్లో విషయ వైవిధ్యం తక్కువనే అనాలి. దానికి కారణం రచయితలందరూ ఇంచుమించుగా ఒక వర్గానికి చెందినవారు కావటంవల్లనేమో. తెలుగు జీవితపు ఒక్క Cross-section ని మాత్రమే వీరు సమగ్రంగా, సంపూర్ణంగా, చూపిస్తున్నారు. ఆయా వర్గాలకీ, ఆయా వృత్తులకీ సంబంధించినవారు నవలారచనకు పూనుకుంటే త్వరలోనే యీ కొరత తీరవచ్చు. లేదా ఇప్పటి నవలా రచయితలు నడుముకట్టి కొంత పరిశ్రమ చేస్తే ఈ లోపం పోవచ్చు.

'పాపాయిముద్దు రూపాయి ముద్దు
పాపాయి పలుకు, పాటా ముద్దు' అన్నారు.

అటువంటి పాపాయికి ఈ నాటి తెలుగు నవలల్లో చోటున్నదా అంటే చెప్పుకోదగ్గంతలేదనే అనాలి. ఈ చిన్నారుల చిరుగోమును నవలలుగ రూపొందింప ప్రయత్నిస్తున్నారు, శ్రీయుతులు దత్తాత్రేయగారు, చల్లా రాధాకృష్ణశర్మగారు, రావికొండలరావుగారు దిగవల్లి శేషగిరిరావుగారు. ఈ చిరుతలపట్ల మన నవలాకారులు ఇంకా కొంత శ్రద్ధచూపగలిగితే బాగుంటుంది.

ఆధునికుల నత్యంతం ఆకర్షించుతున్నది— సినీలోకం. ఈ సినీరంగాన్ని ఈస్ట్మన్ కలరుతో కాకపోయినా కొంత సహజంగానే మన నవలలు చిత్రిస్తున్నవి. అయితే ఈ సినీదేవత కటాక్ష వీక్షణాలకొరకు తహతహలాడుతూ మన నవలా కారులు చిత్తంచెప్పులమీద భక్తిశివునిమీద అన్నట్లు చేతులుకలంమీద దృష్టిసినీరంగం మీద ఉంచి నవలలు వ్రాస్తున్నారు. అలా వ్రాయటం వలన నవలాశిల్పం దెబ్బతింటున్నది. నవలలు సంవాదాత్మకముగా తయారవుతున్నవి. నవలల్లోని సంభాషణకు ఒక ప్రత్యేక ప్రయోజనమున్నది. నాటికొక ప్రత్యేక technique కూడా ఉన్నది. నవలని నాటకీయంగా మారిస్తే అయ్యవారిని కొయ్యవారిని చేసినట్లుగా ఉంటుంది. నవలాకారులు ఈ దృష్టిని తగ్గించుకుంటే మంచిది అని ప్రార్థన. మరొక్క విషయంలో ఇప్పటి నవలాకారుల్ని హెచ్చరించవలసి వస్తున్నది. కొందరు రచయితలు సమస్యాపరిష్కారంగా ఆత్మహత్యను ఉపాసించుతున్నారు. దీనిని గురించి 'తస్మాత్ జాగ్రత్త' అని రచయితలకు మనవి. ఇది ఆరోగ్యకరమైన లక్షణం కాదు. కోరదగినదంతకంటే కాదు అని వేరే చెప్పనక్కరలేదు.

తెలుగులో నవలలు విరివిగా వెలువడుతున్నవి. కాని యీ నవలల్లో రక్తమాంసాలతో సజీవతను పుంజుకున్న పాత్రలు మృగ్యాలనే అనాలి. 'శరత్' అన్నపేరు స్మరించిన వెంటనే ఆయన సృష్టించిన ఎన్నో పాత్రలు మన యెదుట తచ్చాడుతవి. దేవదాసు

పట్ల మనకెంతో సానుభూతి. అతడు మనకు సన్నిహితుడు. ఆప్తుడు. అటువంటి పాత్రల సృష్టి తెలుగు నవలల్లో విరివిగా జరగాలని కోరుతున్నాను.

శిల్పదృష్ట్యా తెలుగు నవలల్ని పరీక్షించితే, ఏ కొద్దో ఆ పరీక్షకు నిలవగలవు. ఈ నవలల్లో ఎన్ని, ఏటిలో నీటి పూవుల్లా తేలిపోకుండా, ప్రవాహాన్ని అడ్డుకొని, నిలద్రొక్కుకొని నిలవగలవు అన్నది కూడా ప్రశ్నే. భావవైఖరితో పరిణతబుద్ధి, సంభాషణ చమత్కృతి, ఉత్కంఠను కలిగించే కథాసంవిధానం, స్వయంసంపూర్ణమైన పాత్రచిత్రణ, అందమైన వాతావరణనిర్మాణం ఇత్యాది లక్షణాలతో కాలపురుషుడి పరీక్షకు నిలవగలిగే సర్వాంగ సుందరమైన నవలలు తెలుగులో వెలువడగలవని ఆశిస్తున్నాను.

తదితరభారతీయసాహిత్యాలతో పోల్చుకుంటే తెలుగు నవల తీసిపోయినదన్న ఓక్కువభావంతో కించపడనక్కరలేదు. తెలుగు నవలలు కొన్ని ఇతర భారతీయ భాషల్లోనికి అనువదింపబడ్డవి. అనువదింపబడుతున్నవి. మనవారు బెంగాలీ, హిందీ, మరాఠీ నవలలతోపాటు తోటిభాషలైన తమిళ, కన్నడ, మలయాళ సాహిత్యాలలోని నవలల పోకడల్ని పరిశీలించితే కొంత సహాయకారిగా వుంటుంది.

ఈ నవలల్లోని భాషాశైలుల్నిగురించి ఓచిన్న మాట. ఇప్పటి నవలల్లోని భాష సజాతీయంగా తెనుగు నుడికారంతో ఇంపుగా సొంపుగా ఉంటుంది. ఆయాప్రాంతీయభాషల ఏసలు ముచ్చటగా మురిపిస్తున్నవి. ఇంగ్లీషును యథాతథంగా వాడుతున్నారు. కొందరి నవలల్లో ఈ ఇంగ్లీషుకు పొందిక

ఉంటుంది. మరికొన్నింటిలో ఎబ్బెట్టుగా కొట్టు వచ్చినట్లుంటుంది. భావకవిత్వంలా నవలల్లోని కొన్నివర్ణనలు బుద్ధికందవు. 'చల్లటివేడి పెనవేసుకుంది.' ఇది ఎటువంటివేడి? 'నిద్రలో చూపు తెరచింది', ఇదెటువంటి చూపు? క్షీణయుగపు ప్రబంధాలలోని వర్ణనల్లాలా నవలల్లో ఇంచుమించు ఒకటే వర్ణన పాఠకునికి కొంతవిసుగును కలిగిస్తుంది. ప్రతినవలలోని కథానాయిక బుగ్గలు సిగ్గుతో గులాబిమొగ్గలు తొడగవలసిందే. పాదాలకు పసుపు, పారాణిపూసుకున్న శోభనపు పెండ్లికూతుండ్లనుండి, బుగ్గను చుక్కపెట్టుకున్న గర్భాదానపు పెండ్లికొడుకులనుండి పఠిత తప్పించుకోలేడు. ఎవరికో ఒకరికి 'ఆవేశకావేషాలు' రాక తప్పదు. ఎవరో ఒకరు 'పెద్దఆరిందాలా' బుద్ధి చెప్పటమూ తప్పదు. ఈ విషయాన్నిగురించికూడా రచయితలు కొంత జాగరూకత వహించితే మంచిది.

తెలుగు నవల అనతికాలంలోనే జవసత్వాల్ని ఇతోధికంగా పడసి తదితరభారతీయసాహిత్యాలలోనే గాకుండా, ప్రపంచవాఙ్మయంలో తానును సంపాదించి జీవితదర్పణమైన చక్కని కళానను ర్పణం కాగలదని ఆశిస్తున్నాను.

'కదిలేది కదిలించేదీ,  
మారేది మార్పించేదీ  
పాడేదీ పాడించేదీ  
మునుముందుకు సాగించేదీ  
పరిపూర్ణపుబ్రతుకున కిచ్చేదీ  
కావాలోయ్ నవకవనానికి'

అని శ్రీ శ్రీ గారంటే 'కావాలోయ్ తెలుగు నవలకి' అని నేనంటున్నాను.

ఇంతవరకూ తెలుగు నవలల తెన్నుల్ని, అవి పోయిన పోకడల్ని, వాటి వైభవాన్ని వైఖరుల్ని స్థాలీపులాకంగా సింహావలోకనం చేయటమయినది. కావ్యప్రక్రియలలో దేనినైనా సమీక్షింపవచ్చునేమోగాని ఈ నవలల్ని సమీక్షించటం నిజంగా అసిధారావ్రతమే. ఎందుచేతనంటేఆబాలగోపాలమూ వీనిని చదువుతారు. చదివిన ప్రతివ్యక్తికి ఒక్కొక్క అభిప్రాయముంటుంది. 'పుర్రెకొక్కబుద్ధి' అనటం వీటిపట్ల వాస్తవమే. ఏకవాక్యత అన్నది ఇందులో అసంభవమే. అయినా నాయీ సాహసాన్ని సహృదయులు మన్నిస్తారని ఆశిస్తున్నాను. 'The University of Wisconsin, U. S. A. లో బెంగాలీ నవలల్నిగురించి ఉపన్యసించుతూ Dr. Humayun Kabir గారు ఇలా అన్నారు: 'It has been suggested that the absence of a tradition of literary criticism is one reason why Tagore's novels often miss the highest peak of achievement. They are always interesting. Their plots and characters are at times brilliant but we are left with the feeling that something is missing. A genius can create a short story or a lyric out of his own experience. Even a genius needs social backing and criticism to produce a masterpiece in the drama or the novel and such social background or criticism was what contemporary Bengal could not provide.' అట్టి కొరత తెలుగు నవలకు కలగకూడదన్న ఆశయంతోనే తెనుగు నవలనుగురించిన అభిప్రాయాలను వ్యక్తంచేశాను

# పాంథుడు!

శ్రీ గంధం జోయెల్

ఒంటెలా ఒంటరిగా
మెడవంచి, బ్రతుకు
ఎడారిలో తడబడే
అడుగులు వేస్తూ,
నడుస్తున్నాను!
ఈ ఎడారిలో
మిల మిల మెరసే
ఇసుక తప్ప
ఇంకేముంది? చూడు!
పచ్చిక బయలు లేదు
నెచ్చెలి జాడ దొరకదు
ఏ కోనలో ఆనందం
ఒయాసిస్సుందో నని,
వేయి నయనాల్తో
వెదకి, తుదకు
వేసారుతున్నాను!
అక్కడక్కడ ఆశల
ఖర్జూరపు చెట్లు
నవ్వుతూ ప్రేమతో
స్వాగతం పలికాయి!
గాలికి కులికాయి!

మయూరాలు నాకు
నృత్యం నేర్పాలని
పురులు విప్పినప్పుడు;
అనుక్షణం
ఏమిటీ విపరీతం!
ఎందుకు నాకీ శిక్ష?
గోచీ పెట్టుకొని,
కొండల నడుమ
పశువుల మందల్ని
మేపిన వేదాంతినా?
నా కన్నీళ్ళను నేనే
త్రాగిన మహర్షినా?
కాదు నేను నరుణ్ణి!
మనస్సు శిలగా
మలచుకొన్న
మహా కఠినాత్ముణ్ణి!
అందుకే
నిన్న జన్మించిన
శిశువు నన్ను చూచి
జాలిగా నవ్వుతుంది!
వృద్ధాప్యం బ్రతుకు
వృథా అని వాపోతుంది
నీలాంబరం క్రింద
గాలికి రెక్కలుకట్టి
మసక చీకట్లకు
మమత దీపాలు పెట్టి
నడుస్తూ; జడుస్తూ
అలసి సొలసివాను!
బ్రతుకు అద్దాల మేడ
ఈర్ష్య రాళ్ళు విసురుతే
ముక్కలైపోతుంది;
మనస్సు వెన్నముద్ద
స్పందిస్తే కరుగుతుంధి!

---

# శ్రీ కుటుంబరావు పధ్నాలుగు కథలు

శ్రీ కె. ఇనాక్

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు కనబడే చిన్న రచనలు పధ్నాలుగుచేర్చి ఒక పుస్తకంగా ఇటీవల ప్రకటించబడింది.

మరి శ్రీ కుటుంబరావుగారు నలభై సంవత్సరాలనుంచి వందల కథలు వ్రాసిన సుప్రసిద్ధ రచయిత. ఇప్పటి ఈ కథల్లో కథ ప్రధానం కాదు. పాత్ర! వస్తుప్రాముఖ్యం లేదు. లక్ష్య నిర్దేశం ప్రముఖమయింది. పాత్రలూ తజ్జన్యలక్ష్యాలూ కలిసి ఈ రచనలు—కథలని పేర్కొన్నా ఫరవాలేదు.

ఈ కథలలోనుంచి ఏ పాత్రనయినా వెలికి తీసి సమాజంలో వదిలిపెడితే సజీవంగా బ్రతుకుతుంది. కొన్ని ఇతరేతర రచయితల కథలలోని పాత్రలు సంఘంలో బ్రతకలేవు. అవి సంఘం నుంచి రాకపోతే సంఘంలోకి పోలేవు.

కనకయ్యవంటి వ్యవహారదక్షులు, పట్టాభి, కాంతం, భాస్కరం, సావిత్రి, వర్ధని, స్నేహలతారావు, అమ్మమ్మ, పార్వతీశం అన్నీ జీవితంలోని పాత్రలు! ఆ పాత్రలవంటివి సంఘంలో లెక్కలేనన్ని పాత్రలు! ఒక్కొక్కపాత్ర కొన్నివందల, వేలపాత్రలకు ప్రతినిధి.

పెళ్లిచేయబోయేముందు, పిల్ల లేక పిల్లాడు అభిజాత్యం, సౌందర్యం, తెలివితేటలు, వయస్సు, ఆర్థికస్థితిగతులువంటి ఎన్నోవిషయాలు తెలుసుకొన్నతర్వాత సంబంధం స్థిరంచేయటమో త్యజించటమో చేసినట్లు పాత్రకు సంబంధించిన అన్ని సంగతులు చిన్నిచిన్ని అంశాలవరకు ఆరా తీయకుండా ఈ రచయిత పాత్రచిత్రణకు పూనుకోడు.

వాస్తవికత ఈ రచనలలోని మరొక మేలి గుణం. వాస్తవికత చాలావరకు సజీవపాత్రలవలన, వాటి ప్రవర్తన, సంభాషణలవలన కలిగింది. రంభ పాత్ర వాస్తవికంగా చిత్రించటమంటే ఏమిటో అర్థంకాదు. రిక్షావాడిపాత్ర వాస్తవికంగా చిత్రించటమంటే ఏమిటో తెలుసు. తెలియని, సంఘంలోలేని ఏ పాత్రను ఎవరూ పరిపూర్ణంగా వాస్తవికంగా చిత్రించలేరు. పోనీ చిత్రించినట్లు నమ్మించనూలేరు.

ఈ కథలు చదివే పాఠకుల్లో ఈ పాత్రలన్నీ వుంటాయి. మామూలు లోకంలోని ఈ "మరి మామూలు పాత్రలు ఈ కథలరోడ్డుమీద యథేచ్ఛగా తిరుగుతూ వుంటాయి. అందుకే అవి మాట్లాడితే వాస్తవికంగా వుంటుంది. నడిస్తే వాస్తవికంగా వుంటుంది. ఏంచేసినా, చేయకపోయినా వాస్తవికంగా వుంటుంది. మనిషి హృదయం అనేక భావాలకు అద్దంలా ప్రతిబింబిస్తుంది. ఆ ప్రతిబింబాలన్నీ పునఃప్రతిబింబితమయిన సంపుటి యిది.

మధ్యతరగతి మానవుడి జీవితం ఈ కథలన్నింటికీ ఇతివృత్తం. ఈ తెగ జనజీవితం ఎప్పుడూ ఎదుర్కొనే సమస్య ధనాభావం! అందువల్ల తిండి వుండదు. అప్పులుంటాయి. పెళ్లి—ఆడపిల్లల పెళ్లి అందువల్లే పెద్దగొడవ అవుతుంది. అబ్బాయిల చదువు ఇబ్బందిలో ఇరుక్కుపోతుంది. కన్నీళ్లు, కష్టాలు ఈ జనం యజమానులు!

ఈ రచనల్లో పాత్రలు పట్టణాలలో తిరిగినా, పల్లెల్లో జీవించినా వాటి తల్లివేళ్ళు మాత్రం, పల్లెభూమిలో బాగా లోతులకు చొచ్చుకుపోయి వుంటాయి. కొమ్మలూ రెమ్మలూ ఆకులూ చిగుళ్ళూ ఆ మూలా ఈ మూలా ఆకాశవు అవకాశంలో విహారం చేస్తాయి. ఆ పాత్రల ప్రవర్తన, వేషభాషలు, వాటిచుట్టూ వాతావరణం, అవి తిరిగే ప్రదేశాలు, వాటిమధ్య సన్నివేశాలు సంఘటనలు సంఘర్షణలు వాస్తవికతను - పట్టి చూపిస్తాయి.

పాఠకుల హృదయాలకు ఈ రచనలు చేరువ కావటానికి ఇంకో కారణం హాస్యం! ఆంధ్రులకు హాస్యం ఆవగాయలాగా గోంగూర పచ్చడి లాగా ఎంతో యిష్టం! తమమీద తాము జోక్ వేసుకోగల వాళ్ళు చాలామంది ఆంధ్రులు. ఈ కథలలో చాలా సున్నితమయిన హాస్యం వుంది. హాస్యం కేపిటలిస్ట్ సమాజ లక్షణం అని ఎవరో అన్నారు. ఆ మాట గౌరవింపదగిందికాదు. తింటానికి తిండి, కట్టటానికి బట్ట, ఉండటానికి యిల్లులేనివాళ్ళు హాస్యం అనుభవించటం కళ్ళారా చూచిం తర్వాత, అది కేపిటలిస్ట్ సమాజలక్షణం అనుకోవటం ఎలా కుదురుతుంది.

హాస్యం అందరూ అనుభవించేదే! తెలుగు రచయితలలో శ్రీ మునిమాణిక్యం హాస్యం ఉన్నంత సుకుమారంగా మరెవరిదీ – పూర్వం – శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు, శ్రీ పానుగంటి హాస్యంకూడా ఉండదేమో ననిపిస్తుంది. హాస్యంలో గుండుసూది, మరమేకు, గునపం గుచ్చుకోకూడదు. శ్రీ మునిమాణిక్యం హాస్యం వంటిదే శ్రీ కొడవటిగంటి, హాస్యం! ఎంత మనోహరంగానో వుంటుంది.

ఈ కథలనిండా బల్లపరుపుగా పరచుకొన్న సమాజ జీవితంలో హాస్యం ఉవ్వెత్తుగాలేచి పాఠకుడికి ఎదురయి, నిలిపి,నవ్వించి ముందుకు పంపుతుంది. ఈ కథలలో ఏ పేజీలో నయినా ఒక నవ్వు ఎదురుగా వస్తుంది. ఎవరోతప్ప, అసాధారణంగా ఆ నవ్వుకు ఎక్కువమంది పాఠకులు లొంగిపోతారు.

ఇంకో గుణం వచనం. అది వ్యావహారికం. తెలుగుదేశంలో పూర్వం పుస్తకాలలో కనిపించే వచనం వేరు, ఎక్కడో క్వాచిత్కంగాతప్ప, లోకంలో వినిపించే వచనం వేరు. ఇప్పుడు లోకంలో కనిపించే వచనమే పుస్తకాలలోనూ వినిపించాలని ప్రయత్నం. కొందరే ఆవిధంగా వ్రాయగలరు. అందులో శ్రీ కొడవటిగంటి అగ్రతాంబూలం అందుకుంటే ఆశ్చర్యంలేదు. ఈ రచయిత అన్ని ప్రాంతాలకు, పోనీ ఒక ప్రాంతంలోని అందరికీ (భిన్నవ్యవస్థలవారికి) ప్రాతినిధ్యం వహించే వచనం వ్రాయలేదు. ఒకప్రాంతంలో ఒకవిధమయిన వ్యక్తులు మాట్లాడే మాటలను ఉన్నవి ఉన్నట్లుగా వ్రాయగల నేర్పు రచయితకుంది. గురజాడ వచనంలో ఉన్నంత వైవిధ్యంకోసం ఈ కథలలో వెదుకనక్కరలేదు.

ఈ రచయిత ఈ కథలలో అక్కడక్కడా ప్రయోగించే కొన్నిపదాలు ఆధారంగాచేసుకొని కమ్యూనిస్టుతత్త్వం ప్రచారంచేసే దృష్టి ఉన్న రచయితఅని ఎవరయినా అనుకొనే అవకాశంవుంది. కథేతివృత్తాలు ఆధారంగా ఆ తత్త్వం ఏం వుందో పోల్చుకోవటం కొంచెం కష్టమే అవుతుంది. మధ్యతరగతి జీవితమే కమ్యూనిజంఅయితే ఆ తత్త్వం బాగా ప్రచారంచేసినట్లే భావింపవచ్చు. జూదమాడటం కేపిటలిస్ట్ సమాజ లక్షణమనీ రచయిత కంఠోక్తిగా చెప్పడం ఎదురవుతుంది. ఇది నిరభ్యంతరంగా అంగీకరింపదగ్గ సంగతి కాదు. ఉన్నవాడూ జూదమాడుతాడు. లేనివాడూ ఆడుతాడు. జూదమాడటమనేది ధనసంబంధికాదు. బుద్ధికి పుట్టిన–ఏదయినా అనవచ్చు—పోనివుండు. పిరికివాళ్ళు, బలహీనులు అన్నివ్యవస్థల మనుష్యులు జూదమనే చిక్కులో చిక్కుకోవటం, ఆ ధర్మసత్రంలో దాక్కోవటం, సమాజంచూచే ఎవరి

కయినా అవగతపూర్వమేకదా! అందువేత జూదం అనేది ఒక వ్యవస్థకు పరిమితంకాదు. అపరిమితం! ఈ కథలలో కథ్యాన్నిజం వస్తుగతం కాదు. సంభాషణల్లో వుంది. అదీ అరుదు

'పిల్లకు ఏ కిరస్తాని వాడో రాసిపెట్టి ఉందనుకోండి' — ఈ మాట చదివి ఈ రచయిత నిందార్థకమయిన కిరస్తానీపదం ప్రయోగించ డెందుచేతనో అని ఎవరయినా ఆలోచింపవచ్చు. క్రైస్తవుడు అని వ్రాయవచ్చు. అలా ప్రయోగం జనసామాన్యంలో లేదా! లేకపోతే వ్రాయటం అస హజంగా వుంటుంది కదా! కాబట్టి నిందార్థకం అనవసరంగా ప్రయోగించే కంటే త్యజించటం శ్రేయస్కరం మరోవిధంగా వాక్యం వ్రాసుకోవచ్చు. ఇంకోచోట 'క్రిష్టియన్‌లాగున్నాడు...అతను...— మాట్లాడేటప్పుడు పులిలాగో, పిల్లిలాగో తప్ప మధ్యస్థంగా కుక్కలాగని గేదెలాగని మాట్లాడనే లేదు'అనివుంది. హాస్యంకోసమా ఇలా వ్రాసింది? హాస్యంకోసమేఅయినాఅతను క్రిష్టియన్ కానవసరం లేదు. ఈ దేశంలో మతాలు చూచినన్ని రుచులు మరేమీ చూడలేదు. మతవిషయిక తాటస్థ్యం— మంచిని ప్రదర్శించకపోతే...మనో — కనీసం — వాక్కాయకర్మలవల్లనయినా వాంఛితం అను కొంటాను.

కథఅన్నా, కథనంఅన్నా చెప్పటల ప్రధాన లక్షణంగా కలవేకదా! సంభాషణలు సాగినకొద్దీ ఆ పద్ధతి అంతోయింతో నాటకందగ్గరకు చేరు కొంటుంది. కథలో సంభాషణలు ఉండవచ్చు. మంచికథలో ఎక్కువ సంభాషణలు మరీ ఎక్కువగా సాగవనుకొంటాను. ఈ రచనలలో కథ తక్కువ సంభాషణలు ఎక్కువ. ఒక పాత్ర కథ చెప్పట మయినా వుంటుంది. అందులోనూ సంభాషణలు.

ఈ కథలలోని రచనలన్నీ కథ లనుకొంటే తత్సమర్థన కొంచెం కష్టమయిన పనే! ఈ కథలు చదివి ముగించింతర్వాత పాత్రలు మనస్సులో మెదిలినంతగా కథలు మెదలవు. గుర్తుం డవు. కథ బలంగా లేకపోవటమే అందుక్కారణం. సామాన్యంగా కథల లక్షణాలు—కురుచదనం తప్ప—అరుదుగా కనిపిస్తాయి, ఈ రచనలలో. సమగ్ర ప్రారంభోపసంహారాలుగానీ, కథాకథనం గానీ, పాత్రలు కలిపి కుట్టుతూ సూదీదారంగానీ ఏవీగా మెరుపుల్లా కనిపెంచవు. ఈ రచనలు ఎక్క డయినా ప్రారంభింపవచ్చు. ఎక్కడయినా ముగింప వచ్చు. ఇక్కడే ప్రారంభం, ఉపసంహారం అన్న నియమాలు ఏవీగా లేవు.

కథకేకాదు, ఏ విధమయిన సృజన రచన కయినా ప్రధాన లక్షణం వస్త్వైక్యం. అది స్పష్టంకాదు ఈ రచనలలో. కథావస్తువుకంటే ఇతరపాత్రప్రాధాన్యం కథాభాగం మరుగు పరి చేంత విస్తృతంగా వుంటుంది పాత్రచిత్రణ. గట్టిగా ఇది కథ అనుకోదగింది మొదటి రచన 'పెళ్లి చెయ్యకుండా చూడు!'. మిగతా కొన్ని కథల్లో మాదిరిగా యువతీయువకులు స్వేచ్ఛగా పెళ్లి చేసుకోగలిగే మానసికౌన్నత్యం పొందితే వివాహ వ్యవస్థ బాధారహితమవుతుందని రచయిత చెప్ప బూనిన సత్యం. లక్ష్యం, కేంద్రం గౌరవ పాత్రలు. కనకయ్య కాఫీ వ్యవహారంలో జరిగిన పరిశీలన కథ కంతగా అవసరమా! కనకయ్య మంచిపాత్ర! అయితే ఆ పాత్ర అంత తేజ స్సుతో ఈ కథకు అవసరంకాదు. పాత్రబరువు కథబరువుకంటే ఎక్కువ. మీ అబ్బాయికి మా అమ్మాయినిచ్చి పెళ్లిచేయనుఅని 'అతడు' అనలేక పోవటానికి కారణం తను లంచాలు తీసుకొనేవాడు కావటం! లంచాలు తీసుకొన్నంతమాత్రాన, ఈ స్థితిలో 'అతను' కనకయ్యకు అంతగా భయ పడాలా? అంతగా తప్పించుకు తిరగటం ప్రధానమా! అమీతుమీ తేల్చి చెప్పవచ్చుకదా! తేల్చి చెప్పక పోవటం పిల్లలిద్దరికీ మార్గం కావచ్చుకానీ, అతని భయకారణం అనూహ్యంగానే వుండి

పోతుంది. అతడు డబ్బున్నవాడుఅనికదా కనకయ్య కాంతం సంబంధంకోసం తిప్పలు పడుతూవుంది! ఆ డబ్బు లంచాల డబ్బే కావాలా? సొంతం ఉండ కూడదా? కథ చివరిపేరాలో 'ఇటువంటి డబ్బు కమ్యూనిస్టుపార్టీ ఫండుక్రింద ఖర్చయిపోతుందో ఏమో' అనిఅనటం అంతకంటే భావ్యంగాలేదు అంటే పట్టాభిలో కమ్యూనిస్టు వాసన కొంచెం వుంది. కాంతమేమో ఒక్కతే కూతురు. ఆమెకే ఈ డబ్బు చెందితే ఆమె భర్త పట్టాభి ఈ డబ్బు స్వీకరించ కుండా కమ్యూనిస్టుపార్టీ కిచ్చేయ వచ్చుననికదా సూచన! ఇటువంటి డబ్బుతోనా పార్టీ ఫండు పెరుగుతున్నది? పార్టీకి ఏం తెలుసు ఇది ఎటు వంటి డబ్బో! ఎవరు పంపినా తీసుకొంటారు. అయితే పట్టాభిలో ఏ మాత్రం కమ్యూనిజం ఉంది ఇటువంటి డబ్బు—పవిత్రంగా, కర్షకులు కార్మి కులు చెమట బొట్లు ధనంగా ఏర్పడ్డ పార్టీ ఫండులో—పాపిష్టి డబ్బు—పార్టీ ఫండులో చేర్చ టానికి? అసలా రచనలో చివరపేరా లేకపోతే ఏం కొంప మునుగుతుంది!

విధవ అయిన సావిత్రికి 'మళ్లీ పెళ్లి' చేయటం గురించి వ్రాసిన కథ సమాజ ప్రోత్సాహ కారకం అవుతుంది. తదనుకూలవాతావరణం ఏర్పరచిన పెద్దలు అభినందింపదగినవారు. ఆలో చింపచేసి, ఆనందింపచేసే ముగింపు ఉన్న రచన.

'చెడిపోయిన మనిషి'లో పార్వతీశం వర్ధని చేసిన తప్పు క్షమింపలేకపోయాడు. స్నేహలతా రావు చేసిన తప్పును క్షమింపక తప్పలేదు. ముక్కూముఖం తెలియనివాడికి ఎవరయినా ఎందు కంత ఆదరణ, అభిమానం, గౌరవం చూపించాలో చూపిస్తారో హేతుబద్ధంగా ఆలోచిస్తే సమాధానం లేదు. పోనీ అది మిస్ రావు మంచితనం అని అంగీ కరించి వూరుకొన్నా, రచయిత చూపదలచుకొన్న వ్యవస్థను అంగీకరించటం సాధ్యమా? స్త్రీ పెళ్లి చేసుకోకుండా ఎవరో పురుషుడుతో శృంగారజీవితం అనుభవించి పెళ్లివ్యవస్థకు దూరంగావుండటం కొందరి విషయంలో తప్పుకాదు; తప్పేమి; ఒప్పే యగునేలంటే అంగీరింపవచ్చునా? ఇదీ రచయిత అభిప్రాయం. కథకు కేంద్రం. ఇటువంటి స్త్రీలు వుంటారా? లోకం విశాలమయింది. ఉండవచ్చు! సాధారణంగా ఏ స్త్రీ అయినా పెళ్లికోరుకొంటుంది. కొందరకు స్వేచ్ఛాశృంగారజీవితం పశుపక్షులకు లాగా ఇష్టంవుండవచ్చు. అంతవరకు రుచిగానే వుంటుంది. ఆపైనే అరుచి! ఈ వ్యవస్థను సమాజం భరింపగలదా! సమాధానం కష్టమే! పెళ్లికాకుండా వీళ్లకు కలిగే పిల్లలకు తండ్రె వరు? ఎవరో ఒకరు! ఎవరయితేనేం? ఎవరూ లేకుండా పిల్లలు పుట్టరుకదా! కనుక ఎవడో ఒకడు తండ్రి ఉన్నట్లే లెక్క! వాళ్లు తండ్రి ఉన్న పిల్లలే! తల్లి సంపాదిస్తుంది. పిల్లలు పెరిగి పెద్దవాళ్లవుతారు. వాళ్లకూ తల్లిలాగో తండ్రిలాగో ప్రవర్తించటం చేతనయిపోతుంది. అటువంటి స్థితిలో పెళ్లితంతు లేకుండా పోతుంది. శృంగార సంబంధం వివాహ వ్యవస్థకు భిన్నంగా వుంటుంది.

మరి, ఈ వివాహ వ్యవస్థ ఎందుకేర్పడింది? సృష్ట్యాదినుంచి మానవప్రయత్నఫలితం కాదా యిది! ఈ వివాహవ్యవస్థ స్త్రీకి ఆర్థిక, సామా జిక, రాజకీయ, మానసిక, స్వాతంత్ర్యం లేకుండా చేసి ఏర్పడింది. ఆ స్వాతంత్ర్యాలు అన్నీ స్త్రీకి ఇచ్చి ఈ వివాహవ్యవస్థ వదులుకొంటే ఏమి చింతలేదా?

పశు పక్ష్యాదుల్లో—మానవులు మినహా—వివాహ వ్యవస్థ లేదు; అవి హాయిగానే వున్నాయి. సంతానోత్పత్తి జరుగుతూ వుంది. ఏం కష్టం వచ్చింది? అలాగే మానవ జీవితం ఉండవచ్చు కదా! మిగతా జంతుజాలంకంటే మనిషికి ఆలోచించే శక్తి ఒకటివుంది. ఆలోచన మానవ జీవితాన్ని సుఖ మయం చేస్తుంది. ఆ ఆలోచనా ఫలితమే ఈ వ్యవస్థ. మనిషి ఆలోచన ఆనందసృష్టి చేయటానికి స్వేచ్ఛా

స్వాతంత్ర్యాలు ఎంతఅవసరమో నియమాలూ అంత అవసరం. సుస్థిరసమాజం మనిషిని మానవాభ్యుదయపథగామిగా చేస్తుంది. సుస్థిరసమాజం అంటే నియమబద్ధమయిన వ్యవస్థ. నియమాలు లేని స్వేచ్ఛ, పాశవికప్రాక్తనసమాజం తిరిగి నిర్మిస్తుంది. ఇది పురోగమనంకాదు, తిరోగమనం. ఈ తిరోగమనవాదం నా కిష్టంవుండదు. ప్రాక్తన మానవుడే — ఏ వ్యవస్థాలేనిదశలో — ఆనందంగా ఉన్నాడంటే అనడానికి ఏమివుండదు. ఎందుకంటే అది అనుభూతి ఆంతర్యంలో ఉన్న తేడా! నాకు నిన్నటికంటే ఇవాళ ఆనందం కలిగిస్తుంది. ఇవాళిటికంటే రేపు అధికానందం అందిస్తుందని నమ్ముతాను. గతం పునాదిమీద నిలిచిన వర్తమానమూ భవిష్యత్తూ ఈ మానవుడు. గతంలో ఉన్న తల్లివేరు తెంచుకోకుండా భవిష్యత్తులో ఆశలనుమాలు ఆనందఫలాలు పూచే కాసే సమాజ సజీవవృక్షంమీద నాకు అభిమానం ఎక్కువ. అందువల్ల నేటి వివాహవ్యవస్థ నాశనం ఇష్టం వుండదు. మార్పు సర్వదా సర్వథా అంగీకరింపవచ్చు; నాశనం కాదు.

'ఉభయ భ్రష్టుడే' అతడు; సోదరి సుశీల అభిమానంగాని, భార్య జానకి ప్రేమగాని పొందలేకపోయి. జానకిలోని ఉదాత్తత పిరికితనంలోంచి పుట్టిన మొక్క. మంచివాడు భర్తగా లభించినందుకు ఆమెకు ఆనందం లేదు. తను తనభర్త కిచ్చినకట్నంతో పెళ్ళాయి, ఆనందంగావున్న అతని సోదరి సుశీల, కృతజ్ఞత చెప్పలేదని దుఃఖపడుతుంది. తనచెల్లికోసం స్వసుఖం ఉండదని తెలిసి, కుంటిదయినా జానకిని పెళ్ళాడి, ఆమెవల్ల అవంతయినా సుఖం ఎరుగనిఅతడు చివరకు ఎవరో వో స్నేహితో 'శృంగార లాలూచీ' పడ్డట్లు సూచన ఇస్తే అతని ప్రవర్తనను రచయిత ఆమోదించినట్లా, తిరస్కరించినట్లా?

'పగటి కలలు'కన్న ప్రకాశానికి దుఃఖం. నిర్మలకు మంచి సంబంధం వచ్చిందని; తనకంటే గొప్పవాడితో— కుదిరిందని తెలిస్తే, తప్పదుమరి వెలికి ఉబికి వస్తుంది.

అతడు సినిక్. అందుకే దుష్టగ్రహం! రాధంటే అతడికి ఇష్టమని అతడికీ తెలియదు. అది సబ్‌కాన్షియస్ పని. అతడొక ఫ్రాయిడ్‌కేస్! రాధను రక్షిద్దామా దెయ్యాలకొంపను చిలనికాదు పెళ్ళి తప్పించింది. తన సొంతం చేసుకొందామని. అంతే అయింది మరి. ఆ తెలివి ముందే ఏమయింది. అందుకే అతడొక ఫ్రాయిడ్‌కేస్.

'అపార్థం' రెండుభాగాల రచన. మొదటి భాగం పాత్రచిత్రణ. రెండోది కథ. ఇటువంటి కథ రాయటం ఈ రచయితకు నైజంకాదు. ఫారిన్ ఎలిమెంట్. అందుకే గిరిచేత చెప్పించటం. రుక్మిణి గిరిని తిరస్కరించటానికి కారణం రచయిత దృష్టిలో 'ముస్పాతికమంది ఆడవాళ్ళు ప్రిమిటివ్‌గా ఉంటారు.' అయితే గిరి మోసగాడవి రుక్మిణి intuition. 'The intuition of woman is the result of millions of years of not thinking.' Intuition భంగ్యంతరంగా sub-conscious ఆలోచన!

'ఫోర్త్ డైమెన్షన్'లో మొదటి సగం వ్యాసం. మిగతాది కథ. కథలో విషయం అణచిపెట్టుకొన్న వాంఛ (Suppressed desire). ఇందిర రాజాకంటే మూడేళ్ళు పెద్దది. చిన్నతనంలో ఆమె సమక్షంలో ఆనందం, పరోక్షంలో బాధ రాజా అనుభవించాడు. కాలాతీత ప్రేమవాంఛా ప్రవర్శితమయిన కథ. రాజా, ఇందిర గతించిం తర్వాతకూడా భరింపరాని మనోవేదన అనుభవించటానికి కారణం! అణచిపెట్టుకొన్న వాంఛ! రెండు కొండ శిఖరాలు భయంకరార్భటితో విరిగి మీదపడుతున్నట్లు కలగని వణుకుతూ లేచికూర్చున్న టి. బి. పేషెంట్‌ను బాగుచేయటానికి ఫ్రాయిడ్ ఉపయోగించిన మానసిక వైద్యంలో రెండు కొండ శిఖరాలు స్త్రీ స్తనాలకు ప్రతీకలుగా భావించిన

విషయం ఈ కథాసందర్భంలో గుర్తుకువస్తే, ఈ రాజా మానసికస్థితి తెలుస్తుంది. 'ఇందిర నన్ను చేతోత్త గట్టిగా తనకేసి అదుముకొని నిద్రపోతున్నది... ఇందిర రొమ్ము నా చేతికి మెత్త మెత్తగా నొక్కుకొని ఉన్నది'. ఇందిరపై రాజాకువున్న వాంఛ వ్యక్తీకరింప బడలేదు, అది అగ్నిలాగా అతణ్ణి దహించింది. ఉన్మత్తుణ్ణి చేసింది. ఈ ఉన్మత్తత — నిజం — కాలాతీత మయిందే!

అత్తయ్య, ఆమె కూతురు రాధ, భాస్కరం అందరూ కలిసి అతనికి 'యావజ్జీవ శిక్ష' విధించారు, దిక్కులేనివాణ్ణి పిలచి. ఉద్యోగం ఇప్పించి పిల్లనిస్తామంటే 'యావజ్జీవ శిక్ష'గానే వుంటుంది— స్వేచ్ఛ లేకపోయినప్పుడు, తన యిష్టంలే నప్పుడు తను కోరుకోక పోయినప్పుడు, ఎంత అందమయిన జీవితం అయినా.

'ద్వైవాధీనపు జీవితం' శీర్షిక చూడగానే ఈ పుంపులేమిటి అనిపిస్తుంది. వేంకటేశ్వర్లు గోపాలం ముఖ్యపాత్రలు. ఇది కథ అయితే ఇతివృత్తాలు రెండు. వేంకటేశ్వర్లు వింత వ్యవసాయం. గోపాలం సంగీతం. ఉన్ననాలుగెకరాలలో లోకంలోని పంటలన్నీ పండించాలని కలలుగనే ఆశావాది వేంకటేశ్వర్లు. పిల్లాడికి ఏ విషయంలో అభిరుచి వుందో, ఆ రంగంలో అతణ్ణి పైకి తీసుకువచ్చే ప్రయత్నమే తండ్రి చేయవలసింది. వేంకటేశ్వర్లు ఆ పని చేయలేదు. సంగీతం అంటే చెవి కోసుకొనే గోపాలాన్ని చదువుకోమన్నాడు. అందుకే గోపాలం ఇల్లువదిలి పారిపోయాడు. బాగుపడ్డాడు. బాగుపడితే పడ్డాడుగానీ, అంతగా బాగుపడటం కల్పనలో కాబట్టి జరిగింది. నిజజీవితంలో అనుమానమే!

'వేంకటేశ్వర్లు జీవితంలో చెమటలు కక్కుతూ పోరాడటం అందరికీ కనిపిస్తుంది. కొందరు జీవితంతో నిశ్శబ్దంగా పోట్లాడతారు. కొందరు జీవితంతో ఆడాడే చాంపియన్లలాగా కనిపిస్తారు. మరికొందరు సరదువుగా వేటాడుతారు. ఇంకా కొందరు నిర్లక్ష్యంగా కూర్చుంటే జీవితమే వచ్చి వనమాలలు వేస్తుంది.'

ఇంతవరకు బాగానేవుంది. నిర్వచనప్రాయమయిన రచన. పై మాటలు పసిడి పలుకులని, అలా చెప్పటం బాగుండదని, పాఠకులు గుర్తిస్తారో లేదో తెలియదు కనుక పూర్తిగా పసిడిపలుకులు కాకపోయి, కొంతవరకయినా పసిడిపలుకులే కాబట్టి నాలుగు కేరట్ల పసిడిపలుకులని హాస్యంకోసం అన్నట్లుగా బ్రాకెట్లో వ్రాయటం పాఠకులు గమనిస్తారు.

అందుకే శ్రీ కొడవటిగంటి జాగ్రత్తగల రచయిత అనుకోవలసివుంటుంది. ఈ జాగ్రత్త 'ఫోర్త్ డైమెన్షన్'లోనూ కనబడుతుంది. ఫోర్త్ డైమెన్షన్ అంటే కాలం అని పాఠకులకు తెలియదని ఆ రచన మొదటిభాగం వ్యాసంగా రచయిత వ్రాయటం!

తల్లికి పిల్లలమీద, అందులోనూ ఆడపిల్లల మీద, ఇంకా బాధలోఉన్న ఆడకూతురుమీద ఎంత మమకారం వుంటుందో తెలిపే కథ 'అమ్మమ్మ కథ.' అమ్మమ్మ మంచిపాత్ర! స్త్రీ హృదయ కోమలత్వానికి, వాత్సల్యానికి ఈ కథ ప్రతీక.

'స్వర్గంలో బందీలు'లో పులులు బందీలే! వృద్ధదంపతులు బందీలే! ప్రకాశం బందీయే! కథానాయకుడు ప్రకాశం! ఇది ప్రకాశం చుట్టూ తిరిగే కథ అయితే పులులబోను కొంచెం అవసరం. వృద్ధదంపతులకథ అంతగా అవసరంలేదు.

ప్రకాశం బెజవాడ వచ్చాడు. పెద్దవాడయ్యాడు. మద్రాసు వచ్చాడు. మరీ పెద్దవాడయ్యాడు. బొంబాయి వచ్చాడు. చాలా పెద్దవాడయి పోవాలనుకున్నాడు. చాలా చిన్నవాడయిపోయాడు. తను 'డబ్'చేసి డబ్బు చేసుకొని సినిమాలో నటించిన హీరోచేత తిరస్కరింపబడి రేసుల్లో దగాలయి నిరుద్యోగిఅయి, కష్టాలెదుర్కొని గట్టెక్కలేక

బిక్కముఖం వేశాడు. ప్రకాశం పాత్ర జాలి కలి గిస్తుంది' అయినా అతను బొంబాయి నగరానికి బందీ!

'ఉద్యోగం' దొరకటం ఎంతకష్టమో తెలిపే కథ మంచి కాలక్షేపం. అతడు సరస్వతీ ప్రచు రణలలో పని చేయాలని పడిన తాపత్రయం ప్రయత్నం ఫలితం దుఃఖం కలిగిస్తాయి. ఇక్కడ రచయిత ప్రదర్శించిన హాస్యం కళ్లనీళ్లతో నవ్విస్తుంది. చివరకు ఏమవుతుంది! మంచికాలక్షేపం!

'పాత్రలు కావలెను.' అని వేసిన ప్రకటన చూచి జనం సినీమాలో నటించటానికి పాత్రధారులు కావాలి కాబోలు ననుకొని చేసిన ప్రయత్నం ఎంత నవ్వయినా తెప్పిస్తుంది. అయితే ఆ ప్రకటన ఉద్దేశం అదికాదు. ఏదయినా రచన చేయటానికి పనికివచ్చే పాత్రలు కావాలని అభిప్రాయం. నటీ నటులకంటే రచయిత్రి మంచి పాత్రగా పనికి వచ్చింది. అయితే ఆ రచయిత్రి రంగంలోకి క్రైసిస్‌లాగా వచ్చింది కాబట్టి పేరుకూడా అదేఅయి పోయింది.

ఆ క్రైసిస్‌లాగా ఏ రచయిత్రి అయినా మాట్లాడుతుంది తెలుగుదేశంలో. తన నవలలు గొప్పవంది. తను గొప్పరచయిత్రినని చెప్పుకొంది. ఆ నవలలు సినీమాగా రూపొందించమంది. ఆ పాత్ర మంచిసెటైర్! చక్కనిపాత్ర!

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు ఈ రచనలు కథలుగా — తృప్తికరమయిన కథారాహిత్యంవల్ల — ఆనందం కలిగింపలేకపోవచ్చు. వస్త్వైక్యం లేకనో, సరయినవస్తువులేకనో, కథాసూత్రంలేకనో, రచయిత గుర్తున్నంతగా రచన గుర్తుండకనో, పాత్ర గుర్తున్నంతగా కథ గుర్తుండకనో, ఇవి కథలుగాకంటే పాత్రచిత్రణలుగా కనిపిస్తాయి. ఈ రచయిత ఈవిధమయిన రచనలలో పాత్ర లున్నంత బలంగా కథ వుండదు. 'పాత్రలు కావలెను' అని కొని ప్రకటన 'కథలు కావలెను'అనికూడా కాదు. పుస్తకం మూసింతర్వాత పాత్ర హృదయంలో కదు లుతూవుంటుందిగాని కథకాదు. కథ బలహీనంగా, పాత్రలు బలంగా కనిపించే రచనలివి. చక్కని పాత్రలచుట్టూ అవసరార్థం ఏదో కథ అల్లుకు పోతుంది. అందుకే శ్రీ కొడవటిగంటి కుటుంబ రావు, 'ఉత్తమకథారచయితగాకంటే' ఉత్తమపాత్ర రచయితగా కనిపిస్తుంది.

మూడు శతాబ్దాల పూర్వం ముమ్మరంగాసాగి ఇప్పుడాగిపోయిన ఆంగ్ల పాత్ర రచన లేక పాత్రీ కరణ (charactery) ఒక సాహిత్యప్రక్రియ. పాత్ర రచయితలకు (character-writer) ఆద్యుడు క్రీ. పూ. మూడవ శతాబ్దికి చెందిన థియో ఫ్రాస్టస్ (Theaphrastus). F. H. Pritchard 'The Essays of All Nations,'లో చక్కని పాత్రీకరణలున్నాయి. ఆంగ్లంలో 17 వ శతాబ్ది లోని ఫిలిప్ బ్లిస్, థామస్ డెక్కర్, జోసఫ్ హాల్, థామస్ బవర్‌బరీ, జాన్ ఎరల్, జార్జి హెర్బర్ట్, నికొలస్ బ్రెటన్, థామస్ ఫుల్లర్ ప్రముఖులయిన పాత్ర రచయితలు.

సంఘంలో ఉన్న జీవిత వైవిధ్యంచూచి, తత్త్వం, గుణం, రూపం, ఆకారం, చేష్టలు, ప్రవర్తన, జీవితవిధానం, ఆచారవ్యవహారాలు, ఆహార విహారాలు, నీతినియమాలు ఇటువంటి వాటి ననేకం ఆధారంగా చేసుకొని మనుష్యుల్ని కొన్ని తరగతులుగా విభజించవచ్చు. ఒకళ్లనుగూర్చి చెబితే చాలమందినిగూర్చి చెప్పినట్లుగా అయి నప్పుడు ఆ చెప్పబడిన పాత్ర పాత్రీకరణ, ఆ వ్రాసిన వ్యక్తి పాత్రరచయిత.

న్యాయవాదులు అందరికి తుల్యమయిన గుణాలు చాలా వుండవచ్చు. తుల్యగుణక్రోడీకరణ చేసి పాత్రీకరణ చేయవచ్చు పాత్ర రచయిత, అలాగే వైద్యుల, రచయితలు, రచయిత్రులు, పంతుళ్లు, విద్యార్థులు. The conception of charactery as an art ఇంగ్లండులో ప్రాచీన

మయిందే అంటాడు హ్యూ వాకర్ (Hugh walker) అందుచేత పాత్రరచన సామాజికంగా సజీవమయింది. 'The conception of character is analytical and intuitive' అంటాడు హ్యూ వాకర్. 'Character books, which again popularised a type whose antecedents can be found as far back as Theophraotus in 300 B. C. Here a generalised type such as wife, a lawyer, a parliamantarian was analysed and dissected' అంటుంది Collier's Encyclopedia Vol. 7.

జోసెఫ్ హాల్ (1574–1658) Hypocrite ను గూర్చి చేసిన పాత్రీకరణ ఉదాహరణగా చూడవచ్చు. '...The stranger's saint, the neighbour's disease, the blot of goodness, a rotten stick in a dark night, a poppy in a corn-feild, an il-temepered candle with a great snuff, that in going out smells ill.'

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు పాత్ర రచయిత అనటానికి సృష్టింపబడిన పాత్రలే కారణం! ఆ సూచన 'పాత్రలు కావలెను'తో దృఢమవుతుంది. రచయిత్రి ఒక పాత్రీకరణ. అటువంటి పాత్రలు లోకంలో కోకొల్లలు! 'అమ్మమ్మ కథ'లో అమ్మమ్మ మంచి పాత్రీకరణ. కనకయ్య, పార్వతీశం ఏమీ తీసిపోరు. కాంతం తల్లి అచ్చంగా పాత్రీకరణ. సావిత్రి, గిరి, రాజా పాత్రలే! ఇటువంటివే సంపుటిలోని పాత్రలన్నీ. అందుకే ఈ రచయిత చక్కని పాత్ర రచయిత అనిపిస్తుంది.

సాధారణంగా ఉత్తమ రచయితకు ఒకలక్ష్యం— ఆ లక్ష్యం కేంద్రమై, ఆ కేంద్రం చేరుకోవటానికి పాత్రలు వాహిక (medium) లై, సన్నివేశాలు ఏర్పడి, కథగా సాగుతుంది.

ఈ రచయితకు పాత్రలు ఏర్పడి, పాత్ర చరించే పరిధి కథగాఅయి, తదనుగుణ సన్నివేశాలు ఏర్పడి లక్ష్యంవైపు పాత్రతో కథతో రచన సాగుతుంది. ఈ రచయితకు కథకంటే ముందు పాత్ర ఏర్పడుతుంది. సమాజానికి నకళ్ళయిన ఆ పాత్రల జీవితం సాధించే, లేక సాధించలేకపోయే లక్ష్యం, లేక లక్ష్యరాహిత్యం రచనకు కేంద్రమవుతుంది.

పాత్ర రచయితలు పాత్రగుణంచెప్పి విడిచి పెడతారు. ఆ గుణం సన్నివేశం మూలంగా తెలియజేసే పద్ధతి శ్రీ కొడవటిగంటి కుటుంబరావు ప్రత్యేకత. అందువల్ల ఈ విధమయిన రచన నవనవోన్మేషశాలిత్వం కూడే అవుతుంది.

ఒక పాత్రకు భిన్న లక్షణాలు ఉంటాయి. కథానిక ఒక పాత్రకున్న ఒక లక్షణమే ప్రధానంగా తక్కినవి అప్రధానంగా సాగుతుంది. కథానకలో పాత్ర విరాట్ స్వరూప ప్రదర్శనకు అవకాశం అంతగా వుండకపోవచ్చు. ఈ రచయిత పాత్రీకరణలో ఆ అవకాశం వుంటుంది. ఈ సంపుటిలో రచనలు పాత్రీకరణలు వెంటతెచ్చుకున్న కథలుగా సంపూర్ణ కావ్యానందం కలిగిస్తాయి. కథలుగా మాత్రంకాదు.

ఈ రచయితకు కథ ప్రధానంకాదు. పాత్రలు! పాత్రలు అనుసంధించటంకోటం కథ పుట్టుకు వస్తుంది. పాత్రల బలంవల్ల బలంలేని కథాంశం కూడా బరువు పెరగవచ్చు. అందువల్ల ఎవరయినా ఈ కథలు ఉత్తమమయినవని అనుకొంటే అనుకోనువచ్చు.

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు కథా రచయితగా ఉత్తములైన చాలామందిలో ఒక రచయిత. బహ్వల్పసంఖ్యగలపాత్రరచయితలలో ఉత్తమశ్రేణి రచయిత![1]

---

1. పెళ్ళిచేయకుండా చూడు, (పద్నాలుగు కథలు): రచయిత: శ్రీ కొడవటిగంటి కుటుంబరావు; ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ; మద్రాసు, మచిలీపట్నం; సికింద్రాబాదు. వెల— రు. 2 లు.

# ఎవరు పసివాళ్లు?

శ్రీ వి. వి. యస్. రామదాసు

'నా ప్రేమగురించి చెప్పానుకదా. ఇంక మీ ప్రేమ గాథ చెప్పండి, త్యాగరాజుగారూ' అని తన భర్త శివాజీ అన్న మాటలకు కార్నరుసీటులో కూర్చుని కునికిపాట్లుపడుతున్న నలభై ఏళ్ల అంబ ఉలిక్కి పడింది.

హైదరాబాదు - తిరుపతిబస్సు వేగంగా చీకటిని దూసుకుపోతోంది.

ఆమె కూర్చున్నది వెనుకవరుసలో ఉన్న మూల సీటు కావడంవల్ల బస్సులో ఉన్న ప్రయాణీకు లందరినీ ఆమె సునాయాసంగా చూడగలుగుతోంది.

రకరకాల సంభాషణలూ, పిల్లల ఏడ్పులూ ఆమెకు ఒకప్రక్కనుంచి ముంచుకువస్తున్న నిద్రను దూరంచేస్తున్నప్పటికీ ఆమె కునికిపాట్లుపడుతూనే ఉంది.

మధ్యాహ్నం అంతా

'ఈసారి తప్పకుండా జాక్‌పాట్ గెలిచి తీరుతాను' అనే ధోరణిలో సాగే సంభాషణా,

'ఎప్పటికయినా ఆ అమ్మాయినే పెండ్లాడు తాను' అనే తరహాలో సాగే మాటలూ,

'రాబోయే ఎన్నికలలో నన్ను నిలబడమని ప్రజలు బలవంతపెడుతున్నారు. ఈసారి గెలవడం ఖాయం' అనే బాణీలో సాగే సంభాషణా,

'మంత్రివర్గ విస్తరణలో ఛాన్సు కాస్తలో తప్పింది. మన గ్రూప్‌కిచెందిన ఆయన ముఖ్య మంత్రికాగానే మనకు మంత్రిపదవి యివ్వకతప్పదు' అనే ధోరణిలోసాగే సంభాషణా,

'రమ్మీ ఆటయొక్క రహస్యం ఆడినవాడికే తెలుస్తుంది. ఏమయినా వచ్చిన నష్టాన్ని పూడ్చుకుని, పైన లాభం సంపాదించి దానితోనే కూతురి పెళ్లి చేయాలి' అనే పంథాలో నడిచే సంభాషణా,

'తప్పత్రాగినవాడే తగు మనిషి' అనే ధోరణిలో రకరకాల మద్యాలను వివరిస్తూసాగే సంభాషణా,

'ఏమయినా యింక కొన్నినెలల్లో నాకు గెజిటెడ్ ఆఫీసరు ప్రమోషన్ రాకతప్పదు' అనే ధోరణిలో జరిగే సంభాషణా,

ఒకవంక వినివిని ఆమెకు విసుగెత్తింది.

మధ్యాహ్నంఅంతా మరొకవంక

'ఇప్పుడు నాకు జిలేబీ కావాలీ' అని మారాం చేసే వాడొక పిల్లవాడయితే

'నన్ను అమ్మమ్మ దగ్గరకు దిగబెట్టెయ్యి.' అని పేచీ పెట్టే పిల్ల మరొకతె.

'ఇవ్వాళ రాత్రి మనం తప్పకుండా సినిమాకి వెళ్లాలి' అని కోరే గొంతెమ్మ పిల్లొకత్తైతే

'ఐస్ క్రీం కొంటావా, కొనవా' అని మంకుపట్టు పట్టినవాడు మరొకడు.

'ఈ బొమ్మకు చెయ్యి విరిగింది. దానిని అతికించిపెట్టూ' అని శతంచేసే పిల్ల ఒకత్తైతే,

'ఈ విరిగిన చెరుకు ముక్కలు నాకొద్దు. మళ్లీ వాటిని క్రరగా అతికించూ' అని గోల పెట్టే పిల్లవాడు మరొకడు.

ఈ విధముగా పిల్లల ఏడ్పులతో, పేచీలతో, చికాకు కలుగుతున్నది మరొకవంక.

కర్నూలులో ప్రయాణీకులు భోజనాలు చేసిన తరువాత బస్సు బయలుదేరింది. కాసేపటికి చాలమంది పిల్లలు తల్లుల ఒడులలో నిదుర పోయారు. కాని పెద్దవాళ్లు నిద్రపట్టక మళ్లీ బాతాఖానీ మొదలుపెట్టారు.

వాళ్ల సంభాషణాసంగీతానికి శ్రుతి అన్నట్లు ఒక పిల్లవాడు ఏదో పేచీపెడుతూ చిన్న స్థాయిలో ఏడుస్తూనే ఉన్నాడు.

పెద్దవాళ్లు ఎవరి ధోరణిలో వారు కబుర్లు చెప్పుకుంటున్నారు.

అంబకు ఎదురుగా సీట్లలో నలుగురు ఇద్దరి కెదురుగా యిద్దరు కూర్చున్నారు వారిలో ఒకాయన అంబ భర్త శివాజీ. రెండో ఆయన త్యాగరాజు. అంబ యాభైయారేళ్ల త్యాగరాజును అతని ధోంతునుబట్టి, ఆకారాన్నిబట్టి పోల్చుకోగలిగింది గాని, త్యాగరాజు ఆమెను పోల్చుకో లేకపోయాడు. దానికి కారణం ఆమె కాన్పులవల్ల లావెక్కి ఉండడమూ, మశూచికంవల్ల ముఖమంతా స్ఫోటకం మచ్చలు తయారవడమూను. తక్కిన ఇద్దరూ అంబకు అపరిచితులు.

వారు ఆ మాటా ఈ మాటా చెప్పుకుని చివరకు ఎంతో పరిచయంగల వారిలా వారి సంభాషణ ప్రేమ గాథలలోకి దిగింది. వాళ్లు నలుగురూ యాభైదాటినవారే. తీర్థయాత్రకు పోతున్నామనే ధ్యాసయినా లేకుండా వారు తమ గతజీవిత ప్రేమస్మృతులలో పడ్డారు ఎవరైనా వినేవారుంటే ఒక రకం ప్రేమికుడు ఎంతయినా కవిత్వం అల్లి చెప్పగలడని వారి సంభాషణ వింటూన్న అంబకి అర్థం అయింది.

మొదటి అపరిచితుడు తాను ఏ విధముగా ప్రేమించి తల్లిదండ్రుల్ని లెక్క చేయకుండా కట్నం లేకుండానే పెళ్లి చేసుకున్నాడో చెప్పాడు.

రెండవ అపరిచితుడు తాను ఏ విధముగా ప్రేమకోసం సంఘాన్నెదిరించి వర్ణాంతర వివాహం చేసుకున్నాడో చెప్పాడు.

మూడవ ప్రేమికుడు అంబ భర్త శివాజీ. శివాజీ చెబుతున్న ప్రేమకథ అంబకు తెలిసినదే. అందుచేత మగతమగతగా వస్తున్న నిద్రలో విన్నది. శివాజీ ఈ విధముగా ప్రారంభించాడు.

'నేను నా ప్రేయసిని ఒక పెళ్లివారి పందిట్లో చూశాను. మా బంధువుల యింట్లో పెళ్లి చూడడానికి నేను బీయువిపట్నం వెళ్లాను. అక్కడ ఒక సర్వాంగసుందరిని చూసి ప్రథమ క్షణంలోనే ప్రేమించాను.'

'ఆమెతో మాట్లాడారా?' అన్నాడు మొదటి అపరిచితుడు.

'ఎలాగో వీలుచేసుకుని మాట్లాడాను. ఆమె నాతో నవ్వుతూ ఎంతో కలుపుగోలుగా మాట్లాడింది' అన్నాడు శివాజీ.

'ఆమె మిమ్మల్ని ప్రేమించిందో లేదో తెలుసుకున్నారా?' అన్నాడు రెండవ అపరిచితుడు.

'నేను ఆమెను సూటిగా అడగలేదుకాని ఆమె తలిదండ్రులెవరో తెలుసుకుని వారితో మాట్లాడవలసిందని మా తండ్రిగారితో చెప్పాను. మా నాన్నగారు మాట్లాడి మా యిద్దరికీ వివాహం జరిపారు.'

'మరి మిమ్మల్ని ఆమె ప్రేమిస్తున్నదో లేదో తరువాతనయినా తెలుసుకున్నారా?' అన్నాడు మొదటి అపరిచితుడు.

'ఆడవాళ్లు ప్రేమగురించి స్పష్టంగా చెప్పరు. వాళ్ల ప్రవర్తనద్వారా మనం తెలుసుకోవాలి ఆమె నాతో ఎప్పుడూ జగడం ఆడలేదు. మాకు ముగ్గురు మగపిల్లలూ ఒక ఆడపిల్లా కలిగారు'అని యింకా శివాజీ చెబుతున్న మాటలు వింటున్న అంబ చిరునవ్వు నవ్వుకుంది. 'మగవాళ్లు ఎంత అల్పసంతోషులు'అని తనలో అనుకుంది.

నిజం చెప్పాలంటే అంబకు వివాహం జరిగేనాటికి ఎవరినీ ప్రేమించలేదు. అయితే ఆమెకున్న నేర్పు అనండి లేక సహజమైనలజ్జవల్ల ననండి ఆమెకున్న భావాలను స్పష్టంగా చెప్పలేకపోయేది.

అంబ కాలేజీలో యింటర్మీడియేటు చదువుతున్న రోజులలో త్యాగరాజు అనే బి. ఎ. ఫైనలియరు స్టూడెంటు ఆమెను గాఢంగా ప్రేమించి ఆమె వెంబడి తిరిగేవాడు. నిజానికి అంబ అతనిని ప్రేమించలేదు. కాని అతని మనస్సును గాయపరచడం యిష్టంలేక అతనితో మామూలుగా మాట్లాడుతూ అతనితో ఒకటిరెండుసార్లు కాఫీ హోటలుకికూడా వెళ్లింది. అతడుకూడా ఎప్పుడూ తన ప్రేమను ఆమెతో చెప్పలేదు. ఆమెతో చెప్పడానికి అతడు ధైర్యాన్ని కూడగొట్టుకునే లోపలనే అంబకు పెళ్లయిపోయింది.

'నా ప్రేమగురించి చెప్పానుకదా. ఇంక మీ ప్రేమగాథ చెప్పండి, త్యాగరాజుగారూ' అని తన భర్త శివాజీఅన్న మాటలకు అంబ ఉలిక్కిపడింది.

త్యాగరాజు ఏమిచెబుతాడోనని కుతూహలంతో వింటున్నది.

'నేను మీ అంతటి అదృష్టవంతుణ్ణికాను, శివాజీగారూ. మీరు ముగ్గురూ ఎంతో ధైర్యంగా మీరు ప్రేమించిన కన్యలను వివాహంఆడి సుఖంగా ఉన్నారు' అన్నాడు త్యాగరాజు.

'మీరు ప్రేమించిన ఆమెను వివాహం ఆడకుండా దగా చేశారా!' అన్నాడు కోపంగా మొదటి అపరిచితుడు.

'నేను దగా చేసేవాడిలా కనిపిస్తున్నానా?' అన్నాడు త్యాగరాజు.

'అయితే ఆ అమ్మాయే దగా చేసిందంటారా?' అన్నాడు రెండవ అపరిచితుడు.

'ఆయన చెప్పేది ఏమిటో పూర్తిగా విననీయండి' అన్నాడు శివాజీ.

'ఆమెను మనసారా ప్రేమిస్తున్న నేను ఆమెపై నిందవేయలేను. అసలు ఏమి జరిగిందంటే నేను బి. ఏ. ఫైనలియరు చదువుతూ ఉండగా ఒకమ్మాయి ఇంటర్మీడియేటు జూనియరులో చేరింది. ఆమె ఎంతో చక్కగా ఉండేది. ఆమెను చూడగానే నేనామెను ప్రేమించాను.'

'ఆమెతో ఆ విషయం ఎప్పుడయినా చెప్పారా?' అన్నాడు మొదటి అపరిచితుడు.

'క్రమేపీ చెప్పాలనే అభిప్రాయంతో మొదట ఆమెతో స్నేహం చేయాలని ప్రయత్నం చేశాను.'

'ఆమె మీతో సుముఖంగా మాట్లాడేదా?' అన్నాడు రెండవ అపరిచితుడు.

'ఆమె నాతో ఎప్పుడూ సౌమ్యంగానే మాట్లాడేది. ఒక్కొక్కప్పుడు నేను నర్మగర్భంగా మాట్లాడినప్పటికీ ఆమె ఏమీ కోపగించుకోలేదు. రెండుసార్లు నాతో కాఫీ హోటలుకికూడా వచ్చింది.'

'ఆమె మిమ్మల్ని ప్రేమిస్తున్నది అంటారా?' అన్నాడు శివాజీ.

'మీరు యిందాక చెప్పినట్లు ఆడవాళ్లు తమ ప్రేమ విషయం స్పష్టంగా చెప్పరుకదా. నేను ఎప్పుడూ ఆమెను అడగలేదు. ఆమె ప్రవర్తనను బట్టి ఆమె నన్ను ప్రేమిస్తున్నదనే క్రమంగా నా ప్రేమను ఆమెకు తెలిపి వివాహానికి ఒప్పించాలని అనుకుంటూ ఉండగా ఆమె సగంలోనే చదువు మానేసింది.'

'ఎందుచేత?' అన్నాడు మొదటి అపరిచితుడు.

ఆమెకు వివాహం జరిగిపోయింది. అందుచేత కాలేజీ మానేసింది.' అన్నాడు త్యాగరాజు బరువుగా.

'మరి మీరు మళ్లీ ఆమెను చూడాలని ప్రయత్నం చేయలేదా?' అన్నాడు శివాజీ.

'లేదు. నేను ఆమెను ప్రేమిస్తున్నాను

కాబట్టే చూడాలని ప్రయత్నం చేయలేదు. పండంటి ఆమె సంసారంమీద నా పరిచయచ్ఛాయల్ని వేసి పాడు చేయడానికి నా కిష్టం లేదు...

'అయితే ఆమెను మీరింక ప్రేమిస్తున్నారా?' అన్నాడు మొదటి అపరిచితుడు.

'అవును...'

'మీరు వివాహితులై ఉండి, వివాహితురాలైన ఆమెను ఎట్లా యింకా ప్రేమిస్తున్నారు?' అన్నాడు శివాజీ.

'అక్కడే మీరు పొరబడుతున్నారు. నేను వివాహితుణ్ణికాను.'

'ఏమిటీ? అసలు పెళ్లే చేసుకోలేదా? మీరెంత గొప్పవారు.'

'అందులో నా గొప్ప ఏమీ లేదు. ఆమెను ప్రేమించిన తరువాత నేను వేరే స్త్రీని ఆమె స్థానంలో ఉంచలేకపోయాను. అది నా బలహీనత.'

ఆ మాటలు వింటున్న అంబ కళ్లు చెమర్చాయి.

'అయితే కేవలం ప్రేమలోపడి దేశానికీ సమాజానికీ మీకున్న కర్తవ్యాన్ని నెరవేర్చడం మరిచిపోయారా?' అన్నాడు శివాజీ.

'కేవలం వివాహం చేసుకోనంత మాత్రాన దేశంపట్ల నాకున్న కర్తవ్యాన్ని నెరవేర్చలేనను కోకండి. నేను దేవదాసులాగా, మజ్నూలాగ జీవితాన్ని నాశనం చేసుకోలేదు. కష్టపడి చదివి ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించి ఆఫీసరుగా పేరుపొంది ఈ సంవత్సరమే రిటైరయ్యాను.'

'మీరు మళ్లీ ఆమెను చూశారా?' అన్నాడు శివాజీ.

'లేదు. కాని రెండేళ్లక్రితం సరిగా ఆమె పోలికే ఉన్న ఒక యువకుడు ఉద్యోగంకోసం నా వద్దకు యింటర్వ్యూకి వచ్చాడు. అతణ్ణి చూస్తున్నంతసేపూ ఆమెను చూస్తున్నట్లే భావించాను. 'మీ అమ్మగారిపేరు ఫలానా కాదా?' అని అడిగితే ఆ యువకుడు కోపగించి, 'మా అమ్మపేరుకీ నా ఉద్యోగానికీ సంబంధం ఏముంది?' అన్నాడు. 'కోపగించుకోకు నాయనా. ఫలానా పేరుగల అమ్మాయి నాతో చదివారు. నీ మొహం మీ అమ్మగారి పోలిక అనుకుని అడిగాను. నీ కిష్టం లేకపోతే చెప్పనక్కర్లేదు. అంతమాత్రంచేత నీకు అన్యాయం జరగదు' అన్నాను. నేను సౌమ్యంగా చెప్పిన తీరు అతణ్ణి కదిలించి నట్లుంది, 'క్షమించండి సార్. అదే మా అమ్మ పేరు' అన్నాడు.'

'ఆ ఉద్యోగం ఆ అబ్బాయికి యిచ్చారా?' అన్నాడు మొదటి అపరిచితుడు.

'అవును, నా సర్వీసు అంతటిలోనూ నేను చూపించిన పక్షపాతం అది ఒకటే' అన్నాడు త్యాగరాజు.

ఆ మాటలు వింటున్న అంబ కంటివెంబడి కృతజ్ఞతాపూర్వకమైన కన్నీళ్లు రాలాయి.

'బాబుగాడికి ఉద్యోగం యిచ్చిన మహానుభావు డీయనన్న మాట. ఈ సంగతి వాడు నాకు చెప్ప లేదేం? ఆ ప్రసక్తి నాకు చెప్పవద్దని త్యాగరాజుగారు అని ఉంటారు' అనుకున్నది అంబ.

'ఇంతకూ ఆ పవిత్రురాలి పేరు తెలుసు కోవచ్చునా?' అన్నాడు శివాజీ.

త్యాగరాజు ఏమి చెబుతాడోనని పర్యవసానం ఏమవుతుందోనని అంబ ఊపిరి బిగబట్టుకుని వింటు న్నది.

'నేను ఆమె పేరు ఎవరికీ చెప్పదలచుకో లేదు. ఎందుచేతనంటే ఆ విషయం నాకూ ఆ పరమాత్ముని కీ మధ్య దాగి ఉండాలని నా అభిప్రాయం.' అన్నాడు త్యాగరాజు.

'అర్థమవును. మీరు ప్రేమిస్తున్నట్లు ఆమెకుకూడా తెలియదుకదా' అన్నాడు శివాజీ.

'ఇంతకాలం గడచినతరువాత ఇంకా ఆమెను ప్రేమిస్తున్నారా? ఇప్పుడు వెనుకకుతిరిగి చూసుకుంటే ఒక పొరపాటుచేశారని అనుకోవడంలేదా? ఏదో వెలితి కనిపించడంలేదా?' అని ప్రశ్నలవర్షం కురిపించాడు రెండవ అపరిచితుడు

'నేను యింకా ఆమెను ప్రేమిస్తున్నాను. నా కండ్లముందు ఆమె చక్కనిరూపం ఎప్పుడూ ప్రత్యక్షంగా ఉంటుంది. ఇక వెలితి అంటారా? నాకేమీ కనిపించడంలేదు. బ్రతికిఉన్న రోజులంతా తీర్థయాత్రలు చేస్తూ, పుస్తకాలు చదువుతూ తేలికగా గడిపేస్తాను. నాకు ఒకటే కోరిక ఉంది' అన్నాడు త్యాగరాజు.

'ఏమిటది?' అన్నాడు శివాజీ.

ఏమిచెబుతాడోనని అంబకూడా వింటున్నది.

'ఆనాడు ఉద్యోగంకోసంవచ్చిన అబ్బాయితో స్నేహంచేసి అవసానదశలో నాకేమైనా ఆస్తి మిగిలితే అతనికిచ్చి అతనిచేతనే అంత్యక్రియలు జరిపించుకోవాలనిఉంది' అన్నాడు త్యాగరాజు.

అంబ కంటివెంట నీళ్లు అప్రయత్నంగా రాలాయి.

త్యాగరాజు చెప్పిన ప్రేమగాధ వినిన తరువాత ఎవరూ మాట్లాడలేకపోయారు.

అంబ బస్సులో కునికిపాట్లు పడుతున్న ప్రయాణీకులను పరిశీలించింది. ఒకపిల్లవాడు ఏదో మారాం చేస్తున్నాడు. వాడిని సముదాయించడానికి వాని తల్లి ప్రయత్నం చేస్తోంది.

'నా పాపాయికి జాగాలేదూ' అని రాగాలు తీస్తున్నాడు, నాలుగేళ్ల పిల్లవాడు.

'అసలు పాపాయి ఏదిరా కనిపించలేదేం? లంటున్నది వాని తల్లి.

'ఇదేంటి. ఇక్కడ నిలిచిపోయింది, చూడు' అని ఖాళీప్రదేశాన్ని చూపిస్తున్నాడు.

ఆ తల్లికి కోపంవచ్చి కొట్టడానికి చేయి ఎత్తింది.

'ఆపమ్మా. ఆ పసివానిని కొట్టకండి' అని అంబ కేకవేసి, 'ఇలా రా నాయనా. నీ పాపాయికి నేను జాగా యిస్తాను' అన్నది. ఆ పిల్లవాడు సీట్లు పట్టుకుని రావడానికి ప్రయత్నంచేస్తూంటే వాని తల్లి వానిని ఎత్తుకుని అంబఉన్న సీటు వద్దకు వచ్చింది.

'నీ పాపాయికూడా వచ్చిందికదు బాబూ?' అన్నది అంబ.

'అవును మామ్మా. ఇదుగో చూడు. ఇక్కడే నుంచుంది' అన్నాడా పసివాడు ఉత్సాహంగా.

'అవును సుమా. ఇదుగో కనిపిస్తోంది. ఏమే పాపాయీ బాగున్నావా?' అని శూన్యాన్ని పలకరించింది. ఆ పసివానిముఖంమీద నవ్వులు నాట్యం చేశాయి.

'మరేమో, నా పాపాయికి జాగా లేదంటున్నది అమ్మ, చూడు మామ్మా' అని ఫిర్యాదుచేశాడు ఆ పసివాడు.

'జాగా లేకేం బాబూ. ఇదిగో ఇక్కడ నేను జరుగుతున్నాను. ఇక్కడ పడుకోపెట్టు. నా ఒళ్ళో నువ్వు పడుకుంటావా లేక మీ పాపాయిని పడుకోపెట్టుకోమంటావా?' అన్నది అంబ.

'ఇద్దరం పడుకుంటాము, మామ్మా.' అన్నాడు ఆ పసివాడు.

'అలాగే బాబూ. నువ్వు ఈ తొడమీద తలపెట్టుకుని పడుకో. పాపాయిని ఆ తొడమీద పడుకోపెట్టు' అనగానే ఉత్తుత్త పాపాయిని అంబ తొడమీద పడుకోపెట్టి ఆ పసివాడు అంబ ఒడిలో తలదూర్చి పడుకున్నాడు.

'నా దగ్గర ఉండనీయండి,' అని అంబ చెప్పగానే థాంక్సుచెప్పి ఆ తల్లి తన సీటు దగ్గరకు పోయింది.

'పాపం, పసివాడు' అన్నాడు త్యాగరాజా.

'అవును పాపం, పసివాడు' అన్నారు తక్కిన ముగ్గురూ.

అంబకు నవ్వు వచ్చింది.

ఎదురుగా తాను ప్రేమించిన స్త్రీ ఉన్నప్పటికీ కాలం ఆమెలో తెచ్చిన భౌతికమైన మార్పు తెరను తొలగించి అసలు స్వరూపాన్ని చూడలేని త్యాగరాజా, తాను ప్రేమించి వివాహం చేసుకున్న స్త్రీ తనను ప్రేమిస్తున్నదో లేదో ఖాయిగా తెలుసుకోకుండా ఊహా ప్రపంచంలో ఉంటున్న తన భర్త శివాజీ, ప్రేమ వివాహాలు చేసుకొని సుఖిస్తున్నామని యితరులను నమ్మించడానికి ప్రయత్నం చేసిన యిద్దరు అపరిచితులూ, తాము ఏదో సాధించి తీరుతామని కలలు కంటున్న రకరకాల పెద్దమనుష్యులూ, ఏవేవో కావాలని, ఏవేవో ఉన్నాయని ఊహించి సంతోషిస్తున్న పసివాళ్ళూ అంబ దృష్టిలో ఒక మాదిరిగనే కనిపించారు.

'ఎవరు పసివాళ్ళు?' అని అంబ తన మనస్సులో ప్రశ్నించుకుని చిరునవ్వు నవ్వింది.

బస్సు శరవేగంతో చీకటిని దూసుకుని పోతోంది.

---



# నూతన శాసనములు-కొన్ని విశేషములు

ఇటీవల నల్లగొండమండలములో కొన్నిగ్రామములు చారిత్రక యభిలాషతో తడవి చూచుచుండగా శాసనములు కొన్ని నూతనముగా బయలుపడినవి. ప్రస్తుత పరిస్థితి, కష్టనిష్ఠురములెట్లున్నను పాఠకుల సౌకర్యార్థమై వాని వివరము లిచట క్లుప్తముగా దెలుపుచున్నాను.

(1) సూర్యాపేట తాలూకా సిరికొండ గ్రామములో శిలాశాసనము; కాలం శక. 1070. క్రీ. శ. 1148. శాసనకర్త పశ్చిమచాళుక్య సామంతుడు. సర్వేతేది 30-8-68 కి పూర్వం.

(2) మిర్యాలగూడెం తాలూకా రామడుగు గ్రామములో శిలాశాసనము. కాలం శక. 1417. క్రీ. శ. 1495. శాసనకర్త మల్లారెడ్డి. త్రవ్వి తీయుట పూర్తికాలేదు. సర్వే తేది 13-10-1968.

(3) నల్లగొండపురభాగములోని పానుగల్లు. నాలుగు శిలాశాసనములు; రెండు పశ్చిమచాళుక్య చక్రవర్తులవి. ఒకటి పద్మనాయకులది. మరియొకటి భగ్నశిల. పానుగల్లు సుప్రసిద్ధమైన చారిత్రకస్థలము. ఇదివరలోనే పెక్కుశాసనములు లభించినవి. ఇప్పుడు ఒకటిరెండు ప్రాచీనదేవాలయములు, భగ్నమైన శిల్పఖండపురాసులు చూడదగినవి. ఒకప్పుడు మూడువందల పైచిలుకు దేవాలయములు యిచ్చట గలవనియెదరు. నిజముగావచ్చును.

ప్రస్తుత శాసనములు, దేవాలయములు తిరిగి సంస్కరించినపుడు అవ్యక్తముగా గోడలో కట్టబడినవి. ఇక స్పష్టముగా చదువుటకు వీలుగల శాసనమొకటి పద్మనాయకులది. కొలదిగావున్నదాని పాఠమును దెలిపెదను.

'శ్రీ శ్రీ సరస్వత్యైనమః'

తన హేషితము వినం తన వారు రంజి
  లం, బగతురమానంబు భంగపడ[ం?]గం
తన ఖురఘట్టనం దన వారు సెలువొంద
  రిపువరుల విభవములు రిత్తవోవ
తన ప్రతాపము సూచి తనవారు హరుషింప
  నరివరుల హరుషంబు లంగిపోవ
సింగయ మాధవ క్షితినాథు వారువము
  రత్నాం [శ.చా?] నశ్వరత్న మొప్పు
దండి నిరువది నాల్గు దవరిన మూరలు
  నవరంగ కేశవనాథు నెదిరి
మల్లప గుడికడ మరి పానుగంటిలో
  సకలజనులు దంను సంనుతింప
  ఇరువదినాలుగుమూరలు। అరుదుగ
  నటు దొర[యబా]ర హరిపతి వోలెం।
  బరగిన ఇరతసావికి। సరిహయములు గ
  లవె యెందుం జర్చింపంగం.॥

ఈ పద్యములో ప్రస్తావింపబడిన మాధవ భూపాలుని పరిపాలనాకాలము క్రీ. శ. 1361—1384. శాసనములో కాలములేదు. దేవరకొండ (వేల్పుగొండ) సంతతిలో ఈతడు మొదటి మాధవ భూపాలుడు. ఇటువంటి అశ్వవృత్తాంతమే తరు

వాతకాలములో దొడ్డారెడ్డి పై శ్రీనాథుడు, విశ్వంకు కొమ్మన కవులు పద్యములలో జెప్పియుండిరి.*

(4) నల్లగొండతాలూకా చిట్యాల గ్రామములో శిలాశాసనం. కాలం, శక 1175. క్రీ. శ, 1253. శాసనకర్త ప్రఖ్యాతుడైన కాకతీయ సేనాని గంగయసాహిణి. ఈతని శాసనములు ఈ ప్రాంతములో లభించుట ఇదే ప్రథమము. సర్వే 14-10-1968.

(5) నల్లగొండతాలూకా వల్లాల గ్రామములో శిలాశాసనము. కాలము, శక 1021. క్రీ. శ. 1099. శాసనకర్త మల్లికార్జునచోడదేవుడు. త్రికూటాలయ మొకటి శిథిలము. కాని ప్రాంగణములో మహాశిలాద్వారమొకటి నిలచియున్నది. సర్వే 14-10-1968.

(6) నల్లగొండ తాలూకా ముసంపల్లి గ్రామములోశిలాశాసనము. కాలం, శక 1137. క్రీ. శ. 1215 శాసనకర్త కాకతీయసేనాని యగు రేచర్ల కాట్రెడ్డి. పేరు పిల్లలమఱ్ఱిరెడ్లు. సర్వే 4-11-1968.

(7) నల్లగొండ తాలూకా అన్నారెడ్డి గూడెములో శిలాశాసనము. కాలము, శక 1178. క్రీ. శ. 1256. కాకతీయసేనాన్యైన గంగయ సాహిణి దీ శాసనం. వరుస సంఖ్య నాలుగులోను ఇతని శాసనమే. సర్వే 14-11-68.

(8) నల్లగొండ తాలూకా అనంతారం గ్రామములో శిలాశాసనము. దీనిని దేవాలయములో ప్రతిష్ఠించి రంగుపూసి పూజించుచున్నారు. దాన క్రమభాగం మరికొంత త్రెంపటు తీసుకోబడినది. వరాహలాంఛనం. సర్వే 23-8-1969.

(9) మిర్యాలగూడెము తాలూకా పేరూరు గ్రామములో ఏడు శిలాశాసనములు. కొన్నిటికాలము, శక 1212. క్రీ. శ. 1290. శాసనకర్తలు కాకతీయులకు జెందిన యాదవసింగణ, మల్లయ దండనాయకులు మొదలైనవారు గలరు క్రియాశక్తిపండితు లాకరు దానగ్రహీతగా దెలియుచున్నారు. దేవాలయశిల్పములో రామాయణకథ లెన్నో చిత్రింపబడుట ఇక్కడి శిల్ప విశేషము. సర్వే 24-8-1969.

(10) సూర్యాపేట తాలూకా మామిళ్ల గూడెం గ్రామములో శిలాశాసనము కాలము, శక 1171. క్రీ. శ. 1249 విరియాల వంశీయుల దీ శాసనము. గణపతి చక్రవర్తి తుదికాలములో వచ్చిన శాసనమిది. కాకతీయుల ప్రసక్తి యున్నది గనుక విరియాలవారికి కాకతీయులకుగల సంబంధము మరికొంత దెలియవచ్చును. త్రికూటాలయము శిథిలము. అంతస్స్తంభములతో నిర్మించిన శిలామండప మొకటి నిలచియున్నది.

(11) మిర్యాలగూడెంతాలూకా వాడపల్లి

---

* 'హరి దాటించె బుఱోపకంఠమున
వాహ్యాళి ప్రదేశంబు నం,
దరరే యల్లయరెడ్డి నందను డు
దొడ్డక్ష్మాధీశ్వరుం డిరువై
నాలుగు మూళ్ల మేరయును
గోసెక్కింపగా నేల య
ద్ధరణీనాథుని కీర్తిదాటెఁ
గడునుద్దండించి బ్రహ్మాండముల్.'

— కాశీఖండము. 52.

'అరరె యల్లయదొడ్డభూవిభుఁడు
వాహో హ రేవంతుఁ డిం,
పరు దాడన్వడి మూలిగూరికడ
వాహ్యాళిస్థలిన్
రాజకుంజరసింహ బను వారువంబును
యదృచ్ఛాలీల దాటింపఁడే
తిరమై యిర్వదినాల్గుమూళ్ల నిడు పు
త్సేకంబు చేయెత్తుగన్.'

— శివలీలావిలాసము. విశ్వంకుకొమ్మన.

క్షేత్రములో శాసనములు రెండు. ఒక శాసనకాలము శక. 1133. క్రీ. శ. 1211. శాసనకర్త కాకతి సేనానియైన రేచర్లరుద్రుడు. వీరు పిల్లలమఱ్ఱి రెడ్లు.

(12) నల్లగొండ తాలూకా కొప్పోలు గ్రామములో శిలాశాసనములు రెండు. శాసనకర్త ఏఱువతొన్దయ. క్రియాశక్తి పండితు లొకరు దాన గ్రహీతగ చెప్పబడినది. కాలము చెప్పబడలేదు.

(13) నల్లగొండ తాలూకా దోమలపల్లి గ్రామములో భగ్నమైన శిలాశాసనము. ముఖ్యభాగము గల ఈ శాసనపుచెక్కడపుస్తంభము స్థలము మారి నట్లు గ్రామస్థులు చెప్పుచున్నారు. లభించిన భాగమునరకు ప్రతాపరుద్రుని సేనానియైన దాచయ సింగని (రాచకొండ మొదటి సింగమనాయుడు) ప్రస్తావన గనిపించుచున్నది.

(14) నల్లగొండ తాలూకా నాగారం గ్రామములో శిలాశాసనము. కాలము శక 1351. క్రీ. శ. 1429. శాసనకర్త్రి రావు మాధవ భూపాలుని ధర్మపత్నియైన నాగాంబికాదేవి. శాసనములో రావుమాధవభూపాలునిచే రచింపబడిన 'రాఘవీయ' కావ్యప్రశంస - దాని అంకితము,— తటాకప్రతిష్ఠలనుగూర్చి చెప్పబడినది. శాసన రచయిత శంభునాథకవి. ఈ ప్రభువు రావుమాధవ నామధారులలో రాచకొండను బాలించిన మొదటి వాడు. ఆ కాలము క్రీ. శ. 1421—1430.

(15) నల్లగొండ తాలూకా రాజపేట గ్రామములో శిలాశాసనము. తటాకప్రతిష్ఠసమయ మందు వేయబడినది, కాలం శ. 1451. క్రీ. శ. 1529. శాసనకర్త గోలుకొండ నవాబుల సామంతుడైన బాబాజీ అనువారు.

(16) దేవరకొండ స్థానికము. కోటలో ఉన్నతస్థానములోనున్న శిలలపై కొన్నిశాసనములు చెక్కబడినవి. దేవరకొండను పాలించిన రాచకొండ ప్రభువులలో సూర్యారావు (సూరానేడు) ఒకరు. ఈతని శాసనము కొన్నిపంక్తులలో జెక్కబడినది. సింహద్వారముకడను అట్టి శాసన మొకటి గనిపించు నది. ఇచ్చటనే పట్టణములో తామ్రఫలక మొకటి లభింపగా పురావస్తుశాఖకు దానిని బంపుట జరిగి నది. కొద్దిరోజులు మకాముచేసి పరిశీలన జరుపు వారికి దేవరకొండ, రాచకొండ వంటి ప్రదేశములలో చారిత్రకమైన సామగ్రి మరికొంత లభింపగలదు.

పైన గనుపరచినవేగాక ఈ క్రింది గ్రామము లలో సహితము శాసనములు ఉన్నట్లు సమాచారము తెలిసినది. కాని వాని పరిశీలన ఇంకా ఏ స్థాయి లోను జరుగలేదు. ముఖ్యముగా వ్యక్తిమాత్రులకు ఎంత ఉత్సాహమున్నా ఈ పనులు పరిపూర్తిగా నెరవేరవు. అన్నిహంగులుగల ప్రభుత్వమే ఇటువంటి అవకాశమును వినియోగించుకొనుట అవసరము. తక్కిన గ్రామములు:—

చెల్లపల్లి, చెఱువుఘట్టు, గురిజాల, గుడివాడ, పలివెల, పజ్జూరు, రాచకొండ, కన్నె కల్లు, మిర్యాలగూడెం, రాజారం, దేవులపల్లి, చిట్యాల, లాంపెల్లి, కోనేటిపురం, భట్టుగూడెం, మక్లేపల్లి, నసర్లగడ్డ, అనుముల, గొల్లగుట్టలు, రంగారెడ్డిగూడెం, కోదండాపురం, నడిగడ్డ, యాచారం, భువనగిరి, చందుపట్ల, సూర్యాపేట, వల్లభాపురం, ఆమనగల్లు, ఎండ్లపల్లి, వదినే పల్లి, మేళ్లచెర్వు, కల్వచెర్వు, వెల్మినేడు, రామన్నపేట, మునిపంపుల, మేడారం.

—శ్రీ తేరాల సత్యనారాయణశర్మ.

# గ్రంథ విమర్శలు

## రామానుజుని ప్రతిజ్ఞ

[నవల; రచయిత : శ్రీ పి. రాజగోపాల నాయుడు; ప్రచురణ : ఎం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, మచిలీపట్నం, సికింద్రాబాదు; వెల : రు. 2 లు.]

చారిత్ర విషయాలను ఆధారం చేసికొని సాంఘిక, రాజకీయ, మత పరిస్థితులు రచనలో ప్రతిబింబింపజేసి నవలలుగా తీర్చిన వారిని వ్రేళ్ల మీద లెక్కపెట్టవచ్చు. కాని కొందరు రచయితలు తాము వ్రాసిన నవలల్లో చరిత్రనే మార్చివేశారు. ఏ రచయిత నవల వ్రాసినప్పటికి సమాజంలో పేరుకొనిపోయిన అసంతృప్తిని, అసహనాన్ని బయట పెట్టి వానినుండి విముక్తి పొందునట్లుగా తగిన మార్గాన్ని కల్పించి సంస్కార దృష్టిని ప్రదర్శించాలి. అట్టి సంస్కార దృష్టి కల్గిన నవల పదికాలాలపాటు పాఠకుల మనోమండలంపైన విహరిస్తూ ఉంటుంది. అయితే సంస్కారం, సంస్కారం అని గొంతు చించుకొని అరిస్తే ప్రయోజనం లేదు. ఈ రోజుల్లో నవలా రచయితలు సంస్కారం పేరుచెప్పి అవాస్తవికతను నవలల్లో చూపించి ఆ మార్గం అనుసరింపుమని ప్రచారం చేస్తున్నారు. ఎరువు తెచ్చుకొన్న భావాలకు సంస్కారం అనే ముసుగువేసి నవలగా చిత్రించి పాఠకులను చదవమని ఆదేశిస్తున్నారు. రచయిత–రచయిత్రి సమాజాన్ని అన్నివైపులనుంచి చూడాలి. మంచి చెడులను నిష్కర్షగా నిశితంగా పరిశీలించి నవలను వ్రాయాలి. అట్టి నవల సమాజంలో ఒక స్థానాన్ని సంపాదించుకొనగలదు.

దక్షిణదేశంలో ప్రభవించి వైష్ణవమత స్వరూపాన్ని సమూలంగా గ్రహించి మతగ్రంథాలకు భాష్యాలు వ్రాసి మతప్రచారం గవించాలన్న ఉద్దేశంతో ప్రదేశాలు తిరిగి మతచర్చలలో పాల్గొని వైష్ణవమత వ్యాప్తికి తోడ్పడినవాడు రామానుజాచార్యులు. ఆయన పతిత జనోద్ధరణ గావించినవాడు, అస్పృశ్యులకు సంఘంలో ఒక స్థానాన్ని కల్పించినవాడు. తనగురువు తనకుచెప్పిన తిరుమంత్రాన్ని ప్రజలందరికి తెలియజెప్పి తనమతంలో తరతమాలు లేవని నిరూపించినవాడు. రామానుజుడు తను నమ్మిన సిద్ధాంతాన్ని ప్రచారం చేయుటకు పూనుకొని ఆ సిద్ధాంతాన్ని వ్యతిరేకించినవారిని సయితము చిరునగవుతో లాలించి గౌరవించాడు. తనను గౌరవింపుమని తనమతాన్ని పెంపొందింపుమని ఏ రాజును అర్థించలేదు. వైష్ణవాన్ని బలవంతంగా ఎవరికి ఇప్పించలేదు. ఆనాడు కులోత్తుంగ చోళుడు తనకున్న అధికారగర్వంతో సామ్రాజ్యాలను కబళించాడు. ఆ రాజు శైవుడు. అందుచేతనే తనదేశంలో వైష్ణవుడు ఉండటానికి వీల్లేదని హింసలు పెట్టాడు. ఇట్టి పరిస్థితులు దేశంలో ఉన్నప్పటికి రామానుజుడు తన మతాన్ని ప్రచారం చేయుట ఆపలేదు. దేశంలో అందరు రామానుజుని ప్రతిభను గుర్తించారు. రామానుజుని ప్రతిభ కులోత్తుంగుని హృదయాన్ని మానని గాయం చేసింది. రాజు, రామానుజుని బంధించాలని ప్రయత్నించాడుకాని సాధింపలేక పోయాడు. చివరకు కులోత్తుంగుడు తానుచేసిన తప్పిదాన్ని గ్రహించి ప్రజలకు మతస్వాతంత్ర్యం ప్రదానం చేసాడు. ప్రదానం చేసిన తరువాత ప్రజల స్థితిగతులు తెలిసికొనకనే కులోత్తుంగుడు కన్నుమూశాడు. శైవ వైష్ణవాలమధ్య జరిగిన ఉద్యమంలో రామానుజుడే చివరకు జయిస్తాడు. తనుచేసిన ప్రతిజ్ఞ నెరవేరిందని రామానుజుడు సంతోషిస్తాడు. ఇదే ఈ నవలలో ఇతివృత్తము

రామానుజనివర్గం ఒకవైపున వైష్ణవ మతప్రచారం చేస్తున్నది. మరొకవైపు కులోత్తుంగ చోళుడు దానిని నాశనంచేయుటకు పూనుకొన్నాడు. కులోత్తుంగుడుమాత్రం తన మతవ్యాప్తే ప్రధానంగా భావించాడుగాని ప్రజల జీవనపరిస్థితులు గమనించలేదు. కులోత్తుంగునకు తగినట్లుగా ప్రధానియైన త్రిపురాంతకుడు, సైనికనాయకుడైన పశుపతి వంతపాడారు. కులోత్తుంగుడు కఠినంగా మారుటకు త్రిపురాంతకుడే కారణం. కులోత్తుంగునికి శైవమంటే అభిమాన మున్నప్పటికి త్రిపురాంతకుని ప్రేరణచేతనే అన్యమతద్వేషం ప్రదర్శించాడు. మతద్వేషం రాజును కన్నుమిన్ను గానకుండాజేసింది. పాపభీతిఅనేది గ్రహింపకుండా మతోద్రేకంతో కులోత్తుంగుడు పరవళ్లు త్రొక్కాడు. అంత ఆనందించిన వ్యక్తి కడపటి జీవితంలో ప్రాప్తించిన బాధలకు తట్టుకోలేక క్రుంగిపోయి తనకుతానే సిగ్గుపడి దుఃఖించాడు. రాజులో ఈ విధంగా మార్పురావటం త్రిపురాంతకున కేమాత్రం నచ్చలేదు. అతనిలో ఒక సంస్కార దృష్టి కలిగింది. ఆనాడు గోవిందరాజస్వామి ఆలయంలో నృత్యంచేసిన 'తిల్య'ను పిలిపించి ఆమె నృత్య, గాన విశేషం కనులార కని ప్రాణాలు వదలాలని తలంచాడు. ఆ విధంగానే ఆమె గానం చేస్తున్న సమయంలో రాజు ఆ గానాన్ని వింటూ కన్నుమూసాడు. చేసిన పాపకార్యాలకు అతనికి మరణంతో విముక్తి కలిగింది. చివరిదశలోనైనా తన నిరంకుశత్వాన్ని ఆలోచింపగలశక్తి కులోత్తుంగునకు కల్గినందుకు అందరూ సంతోషించారు. అతని మరణం ఎవరినీ కంట తడిపెట్టించలేదు.

కులోత్తుంగుని మరణంతో రామానుజున కధికంగా ప్రతిష్ఠ పెరిగింది. వైష్ణవంలోనున్న భక్తి అమేయమైనదని రామానుజుని శిష్యుడు నిరూపించాడు. కూరేశుడు వైష్ణవంయొక్క గొప్పతనాన్ని నిరూపించుటకే తన కళ్లను లాగివేసికొని దీక్ష, పటుదల నిరూపించి వైష్ణవం మిన్నయని కులోత్తుంగునియెదుట నిరూపించాడు. దీనినిబట్టి మతం మానవునిలో దాగియున్నశక్తిని ప్రేరేపించి దాక్షిణ్యరహితుని గావించి, అంతర్గతశక్తిని ఉద్దీపింపజేసి మతంకోసం జీవితాన్నిగూడా త్యజించే అభినివేశాన్ని ప్రోద్బలపరచగలదని తెలుస్తుంది. అంతేగాక అంతరాంతరాల్లో నిండి నిబిడీకృతమై యున్న అతీతశక్తిని ప్రోత్సహించి ప్రజలకొక మార్గాన్నిచూపి నిర్మల జీవితానికి నాంది పల్కగలదని తెలుస్తుంది.

నవల చారిత్రకమైనను పాఠకునకు చదివాలను కుతూహలం కలిగిస్తుంది. ఎక్కడా వర్ణనలుగాని, చమత్కారాలుగాని లేవు కథ సాఫీగా నడచి పోతుంది. రచయిత నవలలో అచ్చటచ్చట నాటి సాంఘిక రాజకీయ మతపరిస్థితులు చక్కగా వివరించారు. నవల పూర్తి అయిన తరువాత పాఠకుని మనస్సులో ఒక ఆలోచనాత్మకమైన ప్రేరణ కలుగుతుంది. అట్టి ప్రేరణకు కథే కారణం. నవలలో వచ్చిన పాత్రలు చాలవరకు మరపురానివిగా చిత్రించబడినవి. రామానుజుడు, కులోత్తుంగుడు, తిల్య, త్రిపురాంతకుడు, సోమదేవుడు, కూరేశుడు, మహాపూరుడు మున్నగు పాత్రలు పాఠకుల హృదయంలో ఉచిత స్థానాన్ని సంపాదించుకొనగలవు. ప్రతిపాత్ర కొక ప్రత్యేకత అడుగడుగునా గోచరిస్తూనే ఉంటుంది. కథ కనుగుణమైన పాత్రచిత్రణ ఉచి

తంగా ఉన్నది. ఆయా పాత్రల మనస్తత్త్వాలు చిత్రంగా ఉంటాయి. రామానుజుని ఉదారస్వభావం, కులోత్తుంగుని కుటిలత్వం, త్రిపురాంతకుని కుతంత్రాలు, వానరదేవుని ముభావం, తిల్య మధురభక్తి, కూరేశుని గురుభక్తి, మహాపూర్ణుని మతాభిమానం, మున్నగు వ్యక్తులస్వభావాలు ఆయా ఘట్టములందు దర్శనమిస్తాయి. కథలో 'తిల్య' విషయం స్వల్పమే అయినా నవల కాపాత్ర మకుటప్రాయంగా ఉన్నది. ఆమె వారకాంతలజాతిలో పుట్టినా జాతిధర్మాన్ని పాటింపకుండా గోవిందరాజస్వామిపై భక్తినిచూపి ఆ భగవంతుని సన్నిధిలో నాట్యగానాలుచేసి తన మధురభక్తిని చూపించింది. భక్తితోపాటు ఆమెలో ధైర్యం సాహసం రెండూ ఉన్నాయి. అవి తిల్యలో ఉండుటచేతనే గోవిందరాజస్వామి ఆలయంలోని విగ్రహాలను సుళువుగా ఇతర ప్రదేశానికి పంపునట్లు చేయగలిగింది. అంతేగాక తనకున్న సహజలావణ్యంచేత కులోత్తుంగుని అనుచరులను మట్టిబొమ్మలుగజేసి కూర్చుండబెట్టింది. సౌందర్యం ఉన్నదిగదాయని మిడిసిపడలేదు. తనకున్న సౌందర్యజీవితం యావత్తు ఆ భగవంతునికే సమర్పించుటకు పూనుకొన్నది.

కథాకథనంలో శ్రీ రాజగోపాలనాయుడుగారు తమ నైపుణ్యాన్ని ప్రదర్శించి 'రామానుజుని ప్రతిజ్ఞ'ను ఉత్తమ నవలగా తీర్చారు. కాని కథను కొన్ని చోట్ల కావాలని పెంచినట్లుగా కన్పిస్తుంది. అయితే అదిమాత్రం పాఠకుడు గ్రహించలేనంతగా ఉన్నది. చరిత్రకు ప్రాధాన్యమిచ్చి చారిత్రకసత్యాలను వివరిస్తూ నవల చిత్రించుట కష్టమేఅయినను అట్టి కష్టమెందు ఎచ్చటనూ గోచరింపక లేకగా నవల సాగుతుంది.

రచయిత వ్రాసిన ఒక విషయానికి నాకొక్క సందేహం కలిగింది. ఏమంటే 47 వ పేజీలో రచయిత 'రాజేంద్ర చోళునికి తూర్పుచాళుక్యుడైన మలయాదిత్యుడు బావమరిది. ఆ మలయాదిత్యుని కుమారుడే మహాభారత కృతిభర్తయైన రాజరాజనరేంద్రుడు అని వ్రాశారు. దక్షిణ హిందూదేశచరిత్ర వ్రాసిన నీలకంఠశాస్త్రిగారుగాని, చరిత్రను ఆపోసన పట్టిన స్వర్గీయ మల్లంపల్లి సోమశేఖరశర్మగారుగాని రాజరాజనరేంద్రుని తండ్రిని విమలాదిత్యునిగా పేర్కొనియుండిరేగాని మలయాదిత్యునిగా పేర్కొనియుండలేదు. ఇంతన్న భారతమునందు రాజరాజనరేంద్రుని 'విమలాదిత్య తనూజా'యని నన్నయ సంబోధించినాడు. ఈ విధముగానున్న రాజరాజనరేంద్రుని తండ్రి విషయమై మలయాదిత్యునిగా రాజగోపాలనాయుడుగారు పేర్కొనుటచేత సందేహమునకు అవకాశ మిచ్చుచున్నది.

నవలయొక్క వృత్తాంతమును 19 భాగాలుగా విభాగించినారు. ప్రతిభాగమునందలి కథను సూచనప్రాయంగా నాలుగైదు వాక్యాలలో ప్రతి భాగం ఆదిని వివరించారు. ఈ విధంగా వివరించే అవసరం అంతగా కాన్పించదు. దీనివలన ప్రయోజనంకూడా కాన్పింపదు. మొత్తముమీద నవలకు పాఠకుల ఆదరణపొందే అవకాశం ఎక్కువగా కాన్పించుచున్నది.

శ్రీ జి. రామమోహనరావు.

## బ్రతుకు బొంగరం

(రచన: శ్రీ రావులపాటి సీతారామారావ్, ప్రచురణ: ఎం. శేషాచలం అండ్ కంపెనీ; మద్రాసు; మచిలీపట్నం; సికింద్రాబాదు. వెల రు. 2 లు.)

ఈ నవలను మెలోడ్రామా అనొచ్చు. మన దేశంలో థామస్ హార్డీ, జేన్ఆస్టిన్‌లు బాగా ప్రచారం పొందిన నవలాకారులు. కారణమేమంటే వారు 'విధి'కి అత్యంతప్రాధాన్యత నిచ్చారు. వ్యక్తి బాహ్యరూపానికి, బాహ్యచేష్టలకూ బాహ్యపరిసరాలకు ప్రాముఖ్యత నిస్తారుగాని అంతరంగం, ఆ అంతరంగంలోని వివిధప్రవృత్తులకు బాహ్యపరిస్థితులు కల్గించిన ప్రేరణకు తావియ్యరు. సున్నితమైన హృదయంగల ఒక యువకుడు విధిచేత దెబ్బతిని లోకంలో ఒంటరియై పొందిన అనుభవాలగాథ యిది.

# గ్రంథ విమర్శలు

కథానాయకుడు రవిచంద్రది ఆవేశఝరీవేగంలో కొట్టుకుపోయే మనస్తత్వం. తన చేతిలో ఏమీ లేదు. తన సుఖాన్ని గమ్యాన్ని నిర్ణయించే హక్కు అధికారం తనకు లేవు. తను విధి చేతిలో కీలు బొమ్మ. అస్వతంత్రుడు. అందుకనే రవిచంద్ర తన బాధలతో, అనుభవాలతో, సంఘర్షణలతో క్షాళితుడు కాలేకపోయాడు. ఇన్నిబాధలకూ కారణం మూగపిల్ల వీణతో పెళ్లి. రవిచంద్ర ఎం. ఏ. చదివాడు. లెక్చరరు మూగదని తెలియకుండా పెళ్లికి ఒప్పుకోటం తరువాత తెలియటం విధి కల్పించిన వక్రత. వైవాహికజీవితాన్నిగూర్చి ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. నిరాశలైనవి. జీవితం తనను వంచించింది. సమాజంమీద కసి పుడుతుంది. యింట్లోంచి పారిపోతాడు. ట్రెయిన్‌లో రాజగోపాలం ప్రియంవదల పరిచయం కొంతదిగులు పోగొడుతుంది. నాగపూర్‌లో వారు దిగుతూ యింటికి రమ్మని ఆహ్వానించినా మొహమాటపడతాడు. మళ్లీ అక్కడే దిగటం, చిన్ననాటి స్నేహితుడు సురేంద్రకలయిక, సురేంద్రద్వారా సురేఖస్నేహం, రాజగోపాలం, ప్రియంవదలను తిరిగి కలుసుకోటం రవిచంద్ర అసిస్టెంటు కలక్టరవటం జరుగుతాయి. సురేఖ వేశ్యగా మారుతుంది. వ్యభిచారనేరానికి శిష్యురాలైన సురేఖకు రవిచంద్ర శిక్ష వేయాల్సి వస్తుంది. తను ప్రేమించిన సురేఖ వేశ్యగా మారిందన్న కసితో సురేంద్ర ఆమెను హత్యచేయటం, రవిచంద్ర స్నేహితుణ్ణి జైలుకు పంపటం సినిమా తెరమీద దృశ్యాల్లాగ జరిగిపోతాయి. బాగా త్రాగి ప్రియంవద యింటికివచ్చి. ఆమె నిద్రపోతుండగా ముద్దుడుకో బోతాడు. భర్త అనుకుంటుందికాని రవిచంద్ర అని తెలుసుకుని ఆశ్చర్యపోతుంది. పెనుగులాడుతుంది. ఇంతలో రాజగోపాలం ప్రవేశం. రవిచంద్ర నిష్క్రమణ. ఉద్యోగానికి రాజీనామా. రాజగోపాలం ఊరడించటానికి వస్తాడు. చేసిన పొరపాటును క్షమిస్తాడు. యింటికి రమ్మని, ప్రియంవద నిన్ను చూడాలంటుందన్నా వినిపించుకోడు. తన్నుమరచి పొమ్మంటాడు. తిరుపతి వెళతాడు. ముష్టివాళ్ల ప్రక్కన కూలబడతాడు వీణతో పాటువచ్చినతండ్రి అయిదు నయాపైసల నాణెం చేతిలో పెడతాడు. రవిచంద్రుడుచూచి నాన్నా అంటాడు. వీణ అప్రయత్నంగా అతని పాదాలను తాకుతుంది. ఇదీ కథ.

జీవితం బొంగరం వంటిది. బొంగరం తిరగటం ఆగిపోయాక నిశ్చలంగా వుంటుంది. అలాగే బ్రతుకు బొంగరపు సుడిగుండాల్లో కొట్టుమిట్టాడిన రవిచంద్ర బయటపడిన తరువాత అతని జీవితం నిర్మలంగా సుఖంగా శాంతంగా వున్నట్టు రచయిత చూపిస్తే బాగుండేది. తన యింటికి రాజగోపాలం ప్రియంవదలను ఆహ్వానిస్తే రవిచంద్ర వారి సాన్నిహిత్యంతో ఎంతగా ఎదిగాడో పాఠకునికి స్ఫురించేది. తిరుపతికి వెళ్లటం అక్కడ తండ్రితో భార్యతో కలియటం అసహజంగా సినిమా సంఘటనలా కనిపిస్తూ రచయితకు భగవంతునిమీదవున్న నమ్మకం గుర్తుతెస్తుంది. స్త్రీ పాత్రలు సజీవంగా వున్నాయి. సురేఖమీద పాఠకునికి సానుభూతి కలుగుతుంది ప్రియంవదకు తాను కులాసాగా వుంటూ చుట్టూ వున్న వాళ్లను సంతోషపరచటంతప్ప వేరే బరువు లేసీ లేవు. రాజగోపాలం నిండైన వ్యక్తిత్వం కలవాడు. రాజగోపాలం ప్రియంవదల సాన్నిధ్యంతో జీవితంమీద కోల్పోయిన అధికారాన్ని తిరిగి సంపాదించుకోలేకపోయాడంటే రవిచంద్ర జీవించటానికే పనికిరాడేమో! అంతా విధి ఆడించిన నాటకం అని సరిపెట్టుకుంటే ఈ నవల బాగుంటుంది. రచయిత చెప్పదలచుకున్నది చెప్పలేకపోయాడన్న అసంతృప్తి కలుగుతుంది. కథను బిగువుగా నడిపించే నేర్పు వుంది. పుస్తకానికి బాపు ముఖచిత్రం వన్నె తెచ్చింది.

## స్నేహబంధం

(రచన : శ్రీ అంగర వెంకటసత్యనారాయణ రావు; ప్రచురణ : ఎం. శేషాచలం అండ్ కంపెనీ; మద్రాసు, మచిలీపట్నం; సికింద్రాబాదు. వెల : రు. 2—00.)

శేఖరం వాసులు సహాధ్యాయులు. శేఖరం ప్రకాశం గారింట్లోనేవుంటూ మూర్తికి చదువు చెబుతూ తాను చదువుకుంటూ వుంటాడు. గోపాలం రిటైర్డు తమ్ముడు ప్రకాశంగారింట్లో ప్రవేశిస్తాడు. గోపాలం కూతురు పద్మ శేఖరాన్ని చూచిన తొలిచూపులోనే అనురాగం ఉదయిస్తుంది. ఆమె బాబాయి ప్రకాశం చేసిన మోసంవలన వాసుతో సంబంధం నిశ్చయమవుతుంది. పద్మ శేఖరానికి మనసిచ్చింది. ఆ విషయం వాసుతో దాపరికం లేకుండా చెప్పేసింది. గోపాలంకు పరిస్థితుల ప్రభావాన్ని సరిగా అర్థం చేసుకొని అందుకు సరిపడ్డట్టుగా వ్యవహరించే ధైర్యం లేదు. పద్మ తన కోరిక నెరవేరడానికి కావలసిన సహాయాన్ని వాసును అర్థిస్తుంది. వాసుకు ఏ పనినైనా ధైర్యంగా చెయ్యగలననే ఆత్మవిశ్వాసం వుంది. శేఖరం చదువుకున్నా తన్ను శాసిస్తున్న వారిని ఎదిరించి తనకాళ్ళమీద నిలబడలేని అస్వతంత్రుడు. అసమర్థుడు. వాసు హితవుచెప్పి ధైర్యాన్ని కలిగిస్తాడు. పద్మతో పెళ్ళికి ఒప్పుకుంటాడు. వాసు తల్లి చావు బతుకుల్లోవున్నా పద్మశేఖరంల వివాహం జరిపించుటకు అన్నిప్రయత్నాలు చేస్తాడు. అతని స్నేహం అలాంటిది. ఒకవైపు దుఃఖం వేరొక వైపు సంతోషం. పద్మ కన్నీటిని చీరచెంగుతో తుడుచుకుంటూ అంది, 'నాకు తోబుట్టువులులేరని విచారించలేదు. అన్నగా ఈ చెల్లెలి కన్నీటని చూడలేక నా కొరకు వాగ్దానం చేశారు. రక్తం పంచుకు పుట్టినవాళ్ళు సయితం యివ్వలేని వరాన్ని ప్రసాదించేరు. నా కోరికను ఊహలకందని ప్రజ్ఞతో నెరవేర్చేరు నా హృదయాన్ని మీ పాదాలముందు గుమ్మరించడంకన్న ఏం చెయ్యలేని దానిని. మీవంటి అన్నయ్య ఈ చెల్లెలికి లభించటం నా అదృష్టం! కాని అన్నయ్యకథ కన్నీటికథగా ముగిసిపోతుందని ఈ చెల్లెలు అనుకోలేదు!!' కన్నీటి కథగా ముగిసిపోతుందనడం బాగుండలేదు. అప్పుడే వాసుకథ ముగిసిందెక్కడ? అసలు వాసు కథంతా ముందుంది. అతని కన్నీటిపై పన్నీటిజల్లు కురిపించాల్సిన బాధ్యత పద్మశేఖరంలమీద లేదా? శేఖరం వాసునుగూర్చి యిలా అంటాడు: 'మనిషి పోవలసిన మార్గం ఇదని చూపించేవాళ్ళు లోకంలో ఎందరో వుండవచ్చు కాని ఆ మార్గాన్ని పట్టిపోయి తీవ్రమైన విమర్శలు ఎదుర్కొని ఎనలేని కష్టాలు భరించి, ఆదర్శాన్ని నిలబెట్టుకునే ధైర్యశాలు లెందరు? అటువంటి ధైర్యశాలివి నువ్వు' అనటం ఏదో పొగడ్తలాగుందేగాని వాటికి నిదర్శనాలు నవలలో ఎక్కడా కనిపించవు

కథ సాఫీగా సాగిపోయింది. మేధను మెప్పించేదికాదు. ఉబుసుపోకకు చదువుకోటానికి బాగా ఉపకరిస్తుంది. సరళశైలి.

## నిశ్శబ్ద సంగీతం

(రచన: శ్రీమతి సి. ఆనందారామం, ప్రచురణ: ఎం. శేషాచలం అండ్ కో; మద్రాసు; మచిలీపట్నం; సికింద్రాబాదు. వెల : రు 2—00 లు.)

ప్రకృతిలోను, ప్రకృతి చిత్రాలలోను వినిపించే నిశ్శబ్ద సంగీతం ఈ నవలలో విందామనుకున్నవారికి ఆశాభంగం కలుగుతుంది. పేరు బాగుంది. రచయిత్రులు చక్కటి నవలలు సృష్టించలేకపోతున్నారు. నిత్యజీవితంలోని మధ్యతరగతి కుటుంబాల కష్టాలను సమస్యలను సృష్టించి తృప్తిపడుతున్నారు. పామరులనుసైతం భాషలోనూ, భావనలోనూ పై మెట్టుకు తీసికెళ్ళేట్టుగా వుండాలి రచన.

మాధవుకూ సరళకూ ప్రేమబంధం వుంది. కాత్యాయనిమీదవున్న అప్యాయతవలన, జానకి తన బాధల్ని వెళ్ళబోసుకోవటంవలన జానకిని వివాహమాడాడు. 'శ్రీ మాధవరావుగారికీ నాకూ భార్యాభర్తృ సంబంధం ఏమీ లేదు. ఆయన ఎవరిని వివాహం చేసుకున్నా నాకు అభ్యంతరం ఏమీ వుండదని' వాగ్దానం చేసిందికూడా. కాని జానకిని

ప్రేమిస్తాడు, పొందాలని వాంఛిస్తాడు. ఆమెకూ ప్రేమ వుంది. యిచ్చిన వాగ్దానం గుర్తుకొస్తుంది. తిరస్కరిస్తుంది. సరళను పెళ్లి చేసుకోలేడు. జానకిని పొందలేడు. ఇంతరాద్ధాంతానికి కారణం తనకుతల్లివంటి కాత్యాయనితో సరళను ప్రేమించానని మాధవ చెప్పలేకపోవటం. జానకితో వివాహమయ్యాక సరళను ప్రేమించినట్లు తెలిసికొని బాధపడుతుంది. మరణిస్తుంది. ప్రేమించిన సరళకంటె వివాహమాడిన జానకిపట్ల ప్రేమ అధికమవుతుంది. జానకివుండగా సరళను స్వీకరించడు మాధవ అందుకని స్లీపింగ్ టేబ్లెట్స్ మింగుతుంది సరళతో చెప్పటానికి వస్తుంది ఆమె స్థితి చూచి కంగారుపడి డాక్టర్ను పిలుస్తుంది. జానకి బ్రతుకుతుంది, సరళ వారిద్దరినీ కలుపుతుంది. తన్నుమరిచిపోయి మాధవను సుఖపెట్టమంటుంది. కుసుమ పరిస్థితులను ఎదిరించిఉద్యోగంచేసినా శ్యామ్ వలలోపడటం 'అబలవుసుమా' అని గుర్తుచేస్తున్నట్లుంది. స్త్రీసమాజాన్ని ధిక్కరించటంవలన ఎన్నోచిక్కులు తెచ్చిపెట్టుకోవటమేనని కుసుమ జీవితం తెలుపుతుంది.

జానకి తనను బాధలనుంచి తప్పించి విముక్తిని కలుగజేసిన మాధవను, ప్రేమించిన సరళ, తన సర్వస్వాన్నీ అర్పించిన సరళతో కలిపి కన్నుమూస్తే ముగింపు బాగుండేది జానకి యిచ్చిన వాగ్దానం నెరవేర్చుకున్నట్లయ్యేది. ప్రేమకన్న వివాహానికే ప్రాధాన్యత నిచ్చారు రచయిత్రి.

కథను నడిపించుటలో నేర్పు చూపించారు: భాష సరళంగావుంది. ఒకసారి చదవచ్చు.

శ్రీ శివకుమార్.

## సంఘర్షణ: కవితాసంకలనం

(ప్రతులకు, యువరచయితలసమితి, నల్లగొండ, వెల: రు. 1-50.)

'మానవత్వానికి, దానవత్వానికి పోటీపడుతున్న ఈ రోజుల్లో, ఈ నవీనసాహిత్యంతో సంఘంలో మంచిమార్పు తేవాలనే దృఢసంకల్పంతోనే మేమీ కార్యక్రమానికి ఉపక్రమిస్తున్నాం' అని నిర్వాహకవర్గం ఈ సంకలనంయొక్క ముఖ్యోద్దేశ్యాన్ని వెల్లడించారు. ఈ సంధియుగంలో జరుగుతున్న అంతర్యుద్ధానికి – పాత-కొత్తలమధ్య, మానవ, దానవత్వాలమధ్యా—ఈ సంఘర్షణ ప్రతిబింబం. సోమసుందర్, కాళోజీవంటి చేయితిరిగిన రచయితలతోబాటు, మరో 20 మంది కొత్తకవులను పరిచయం చేశారు. ఈ 'సంఘం' అనేది వీర-దరి కవితావస్తువు. ముఖ్యంగా సంఘంఅంటే ఏమిటో? 'చీకటిబజార్లో నా జాతికన్య కన్యాత్వాన్ని కాసులకు వెచ్చిస్తుంటే, అందానికి చిహ్నమైన తాజ్ మహల్‌పక్క ఆకలితో అల్లాడే బీదలు, విశ్వాంతరాళంలోకి ఎగురుతున్న తోటిమానవునిగురించి ఆలోచించే శక్తి, ఓపిక, తీరికలేని నాగరికతను బట్టవంకే పరిమితంచేసి, మానవత్వాన్ని శ్మశానంవరకు మోసుకువెళ్లి, కులమతభాషాద్వేషాలతో నిండిపోయింది' ఇదీ ఈనాటి సమాజస్వరూపం.

ఈ సమాజంలో సామాన్యునిజీవితం, న్యాయాన్యాయాలతో అతనుపడే 'ఘర్షణ' శాంతిలేని కాంతిరాని ఈ కటికచీకటికొట్లో 'ఆశచచ్చినవాళ్లు' భయపడేవాళ్లున్న 'ఆగతానికి శుభారంభం' పలికేవాళ్లు 'విచక్షణ'తోనూ ఉన్నారు మొత్తంమీద ఈ సంకలనంలో చీకటి ద్వేషించేవాళ్లు, కాంతికి వాకిళ్లు తెరిచేవాళ్లు ఎక్కువ. వ్యక్తిగతమైన అనుభూతుల వ్యక్తీకరణ ముఖ్యంగాక, సంఘశ్రేయస్సు, పదుగురి పచ్చదనం, జాతిజీవనవికాసం కోసం ఆవేదన – ఏరులా ప్రవహిస్తుంది, **అంతటా!** ఈ ముసిరిపోయిన లోకాన్ని తిట్టినవాళ్లున్నారు, దేవునితో పోట్లాడి, 'దేవుని దిగిరమ్మని' ఆహ్వానించినవాళ్లున్నారు - ధర్మసంస్థాపన చేయటానికి, నేటి కళ్లు చూడటానికి.' అవిశ్రాంత ప్రయత్నమార్గంలో పయనించే యోధులు', ఎక్కడికక్కడ దీపస్తంభాలై నిలిస్తేతప్ప 'తోవంట ఉద్యమ విద్యుత్తు ప్రవహించదు' అని నొక్కిచెప్పినవాళ్లు

న్నారు. విద్యుత్తేకారు తమస్సును పరిహరించేది. అసలు చీకటి మనసులోనే పుడుతుంది.

> 'అజ్ఞానం దురహంకారం దానికి సోపానం
> అహంత నియంతల బాహిర రూపం
> తన చుట్టూ గిరిగీసుకోవటం
> పసికందుల క్రీడా విశేషం'

అని చెప్పి

దీన్ని పరిష్కరించే మార్గం చూపించారు సోమసుందర్ —

> 'లెంపిస్తాను నీ కోసం
> సదసత్ వివేచనా చంద్రశాలానికేతనం,
> జరిపిస్తాను మన కోసం
> జనహృత్ కల్హార వికాసోత్సవం,
> రాగల వెలుగుల శుభదినాల
> కాగిత మొక చంద్రశాల
> అదే కదా జనహృత్ విషాదాల
> తొలగించే జీవన హేల'

నైతికంగా పతనమౌతున్న సాంఘికరూపాన్ని, కళ్ళ మూసుకు పాలుత్రాగే పిల్లివతుగా నడుస్తున్న రాజకీయ తంత్రాన్ని, 'వ్యగ్యం' ఆయుధంగా గర్హించారు; 'గొర్రెదాటు'లో 'కాళోజి', 'వృషభ పురాణం'లో, పేర్వారంవారు 'వేను'లో 'తాడిశెట్టివారు', 'విచక్షణ'లో కట్టికోల యాదగిరిరావుగారు 'జారుడు మెట్లు'లో దేవులపల్లి శ్యామసుందరరావుగార్లు తదితరులు—అందరిలోనూ ఆవేదన అసంతృప్తి ధ్వనించుతోంది— ఒక సుస్థిరమైన సాంఘిక వ్యవస్థకోసం ఆరాటమూ ఉంది. పాతకొత్తల్లోనూ చీకటిని ద్వేషించటం, వెలుగుకోసం పరవళ్ళు తొక్కటం చక్కగా కానవస్తుంది,

వే. న. రెడ్డిగారి 'నడచివచ్చిన సముద్రం' భావస్ఫోరకంగా, ధ్వనిపూరితంగా గంభీరంగా ఉంది. 'కాళోజి'గారి 'గొర్రెదాటు' సాగదీసినట్లుంది. ఇవిగాక వ్యక్తిగత అనుభూతికి అక్షరరూపమిచ్చిన కవితల్లో ఎన్నదగింది సరస్వతిగారి 'అగ్నిపుల్ల అనుభూతులు,' 'కరుణశ్రీ'గారి 'పుష్పవిలాపం' అంత ఎత్తు తూగగలదు – వళ్ళు పుల్కరిస్తుంది చదివితే. తర్వాత అద్దేపల్లివారి 'భయపడుతున్నాను'లో వారి గుండె గాయం ప్రస్ఫుటం. 'అశోకహతుని స్వగతం' బాగుందికాని స్వంత అనుభూతిని ఇతరుల గొంతుకతో పాడటం సముచితమైనా కాకున్నా, వ్యక్తిత్వం లోపిస్తుంది.

కొత్తవారిలోనూ ఆవేదన, ఆవేశం, ఆలోచన, సమపాళ్లలో కనిపిస్తాయి. కవిత్వాన్ని నియమిత పరిధుల్లోకదను తొక్కిస్తే; తాత్కాలికానందం అది నేడు ప్రసాదించినా, రేపు బ్రతకగల్గుతుందా? రాజకీయాన్ని దుయ్యబట్టటమే కవిత్వం, సంఘ సంస్కరణలంటూ, సంఘంలో కుళ్ళు కడగమంటూ pose పెట్టటమే కవిత్వం అనుకోవటం బాధాకరమైన విషయం. ముఖ్యంగా కొత్తవారు అలా అపోహపడితే ఉత్తమ కవిత్వం జనించదు. మొత్తంమీద ఈ సంకలనం సంతృప్తికరంగానే ఉంది. దీనికి 'యువ రచయితల సమితి'ని అభినందించవలసి ఉంది.

**శ్రీ కె. శివారెడ్డి.**

---

**Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1.
Editor: S. Sambhu Prasad.**